# విషయ సూచిక

శ్రీః

భరతముని ప్రణీతమ్

# నాట్యశాస్త్రమ్

## ఆంధ్రభారతీ సహితమ్

### ప్రథమోఽధ్యాయః

ప్రణమ్య శిరసా దేవౌ పితామహ మహేశ్వరౌ
నాట్యశాస్త్రం ప్రవక్ష్యామి బ్రహ్మణా యదుదాహృతమ్:

### ఆంధ్రభారతీ

జ్యోతిర్మయీం ప్రసూనాంగీ మానందలహరీం పరామ్
లలితాభినయాత్మికాం శివాం దేవీ ముపాస్మహే.

యం శ్రుత్వా వికసత్యశేషవిభవైః హృత్పద్మ మార్ద్రాయతే
యం మత్వా నితరంచ గచ్ఛతి ముదా విద్యార్ణవం మానసమ్
యం ధ్యాయ న్నచిరేణ వేత్తి సకలాన్ శాస్త్రార్థభావా న్మనః
తం భక్త్యా ప్రణమామి పూతచరితం దివ్యాంశయా సంశ్రితమ్.

యత్రైవనాట్యే సుఖమాలభేయుః యతశ్చ నిర్వాణ మశేషలోకైః
తం నాట్యవేదం స్వధియా విచార్య సమగ్రరూపేణ బ్రవీమి దిష్ట్యా.

భారతీయంచ శాస్త్రార్థం తథాఽభినవభారతీమ్
సాకల్యేన సమాలోచ్య నాట్యవ్యాఖ్యాం సమారభే.

ప్రక్షిప్తా నథవ్యాఖ్యాతాన్ శ్లోకానేవ పరిత్యజన్
సంప్రదాయానుసారేణ వివృణోమ్యాంధ్రభారతీమ్:

నాట్యశాస్త్రమందలి విషయ ప్రయోజనములను నిర్దేశింపగోరి భరతముని గ్రంథ ారంభమున దేవతా నమస్కారము చేయుచున్నాడు. జగత్తునకు పితామహుడు, నాట్య [illegible]ము నుచ్చరించినవాడు నగు బ్రహ్మకును, నటరాజగు మహేశ్వరునకును శిరస్సుతో ణమిల్లుచున్నాడు. మనస్సుతోను, వాక్కుతోను, కాయముతోను ప్రణామము జరుగ లెను. కాయముతో ప్రణామమని చెప్పుటకై శిరస్సుతో నమస్కరించుచున్నానినాడు: హ్మ మహేశ్వరులను దేవులని సంబోధించి వాక్కుతో నమస్కరించినాడు. [illegible]

ప్రణామము చేయుచున్నాడని విదితమగుచున్నది. పూజ్యులైనవారికే ప్రణామము చేయవలసి యుండుటచేతను, అట్టివారిని కేవలము వారి పేర్లతో ఉచ్చరించుట తగనిది యగుటచేతను, బ్రహ్మ మహేశ్వరులను దేవులని మొదటనే చెప్పియున్నాడు. కాయముతోను, వాక్కు-తోను నమస్కారము చేయుటవలన నీశాస్త్రమందు ఆంగికాభినయము, వాచికాభినయము ప్రధానముగా గలవని తెలియవచ్చుచున్నది. ఈ ప్రణామము లోకములో సహజముగా గన్పించుటచే అభినయముసహితము లోకప్రసిద్ధమైనదే కాని వేరొండుకాజాలదు. పితామహ మహేశ్వర శబ్దములలో ఛేకానుప్రాసాలంకారము కన్పించుటవలన అలంకారసహితము, సాత్త్వికాహార్యసంయుతము నగు వాక్యాభినయమే నాట్యమున భరతముని సమ్మతమైనదని కానవచ్చుచున్నది. అలంకారసహితమైన వాక్యమే దేవతలకు సంతోషమును కలుగజేయునది. ఈ దేవతలు ప్రజాపతి, మహేశ్వరులగుటచే నీశాస్త్రము ప్రజలకుకూడ సంతోషమును, హితమును చేకూర్చునది యని సిద్ధమగుచున్నది.

దేవతా నమస్కారమైన తర్వాత నాట్యశాస్త్రమును భరతముని చెప్పబోవుచున్నాడు నటుడు ప్రయోగించు విషయములను శాసించునది నాట్యశాస్త్రము. దీనిని నాట్యవేదమని కూడ భరతమునియే పలుమార్లు చెప్పియున్నాడు. సకల భావములతో సమన్వితమై, ఆంగిక వాచికాద్యభినయముల ద్వారా భావముల నభివ్యక్తము చేయగిలిగి, ఉపదేశపూర్వకమగు నానందమును కలుగజేయు ప్రయోజనముగలది యగుటచే నిది నాట్యశాస్త్రమనిపించుకొనుచున్నది. కాని నాట్యము లౌకిక విషయపరంపరకన్న భిన్నమైన ప్రవృత్తిగలది. లోకప్రవృత్తిని యథాతథముగ చిత్రించుటగాని. అనుకరించుటగాని, ప్రతిబింబింపజేయుటగాని నాట్యముయొక్క పరమావధి కాదు. లౌకికజ్ఞానముకన్న విలక్షణమైన జ్ఞానము నొసగునది. అనగా నాట్యము అలౌకికమగు లోకోత్తర విషయములో సంవలితమైనది. అందుచే నిది నాట్యవేదమని పిలువబడుచున్నది. కావుననే యాజ్ఞవల్క్యాది స్మృతులలో నీశాస్త్రము బాగుగా ప్రశంసింపబడియున్నది. దీనివలన ధర్మప్రవృత్తికి నాట్యశాస్త్రము విరోధి కాదని, పైగా అత్యంత సహకారి యని సిద్ధమగుచున్నది.

ఇట్టి నాట్యశాస్త్రము బ్రహ్మచే చెప్పబడినదని భరతముని చెప్పుచున్నా బ్రహ్మముఖమునుండి వెలువడిన నాట్యవేదము అవిచ్ఛిన్న సంప్రదాయ పరంపరతో వ చున్నది. వేదశాస్త్ర పురాణాది విషయములసద్దకు పోజాలని వారలకు మనోజ్ఞమైన స శము లిచ్చుట అనుభూయమానములు కాగలవు. కావున నీశాస్త్రము పురుషార్థము సాధింపజేయుట కుపకరింప గలదు. ఇటువంటి నాట్యశాస్త్రమును భరతమునికి బ్ర చెప్పినాడు. వేదవేదాంగములను స్మరించి ఈ నాట్యవేదమును బ్రహ్మ కూర్చినాడని ముందు చెప్పబడగలదు. మాయాశబలితమైన ప్రపంచమునకు పారమార్థిక సత్యత్వములేదని చె టకై నాట్యశాస్త్రమును బ్రహ్మ చెప్పినాడని భట్టనాయకుని సిద్ధాంతము. కేవలము భా సమున్మిషితమై కల్పనా శతసహస్ర మయమై భాసిల్లుచు, అభూతాద్భుతముగా కన్పి నాట్యము సహితము సత్యమును దర్శింపజేయగల శక్తి గలిగియున్నది. పారమార్థికసత్య లేని నామరూపములతో నిండియున్న జగత్తును ప్రదర్శించుచు, శ్రవణ స్పర్శనాదుల ద్వా

జగత్తులో నంతర్యామిగా గల తత్త్వమును అనుభవింపజేయుగల్గుచు, నాట్యము లోకోత్తర పరమపురుషార్థమునే సూచించుచున్నది. ఈ ప్రయోజనమును, విషయమును తెల్పినది కనుకనే నాట్యశాస్త్రమంతయు శాంతరసమునుండి ఉత్పన్నమై, మరల శాంతరసముననే పర్యవసిత మగుచున్నదని భరతమునియే ఆరవ అధ్యాయమున చెప్పబోవుచున్నాడు.

సమాప్తజప్యం వ్రతినం స్వసుతైః పరివారితమ్
అనధ్యాయే కదాచిత్తు భరతం నాట్యకోవిదమ్. 2

మునయః పర్యుపాస్యైన మాత్రేయప్రముఖాః పురా
పప్రచ్ఛుస్తే మహాత్మానో నియతేంద్రియ బుద్ధయః. 3

బ్రహ్మచే నీ నాట్యశాస్త్రము తనకేరీతిగా చెప్పబడినదో ఆవిషయమును మొదటినుండి సమగ్రముగా చెప్ప నారంభించుచున్నాడు.

వ్రతానుష్ఠానసంపన్నుడు, జపమును పూర్తిచేసికొనినవాడు, తన పుత్రులతో పరివేష్టింపబడియున్నవాడు, నాట్యకోవిదుడు నగు భరతునివద్దకు మహాత్ములు, తమ ఇంద్రియములను బుద్ధిని కట్టుబాట్లలో నుంచుకొనినవారు నగు ఆత్రేయుడు మొదలుగా గల మునులొకానొక అనధ్యయన దినమున పూజాబుద్ధితో వచ్చి ఈ చెప్పబోవు ప్రశ్నల నడిగినారు.

నాట్యవేదముయొక్క యోగ్యత, అదృష్టఫలము, వినోదహేతుత్వములను తెల్పి, ఇది సులభముగా తెలిసికొనబడగలదనియు, ప్రసిద్ధమైనదనియు, ఇచట యోగ్యుడగు నాచార్యు డవసరమనియు తెల్పుచు శిష్యులకు ప్రామాణికముకూడ నని చెప్పబడినది. నియమపూర్వకముగా శాస్త్రమును తెలిసికొన వలయుననియు, శిష్యులు ఊహాపోహపటులై యుండవలయు ననియుకూడ నిట సూచింపబడినది.

యోఽయం భగవతా సమ్యగ్గ్రథితో వేద సమ్మితః
నాట్యవేదః కథం బ్రహ్మన్నుత్పన్నః కస్యవా కృతే. 4

కత్యంగః కింప్రమాణశ్చ ప్రయోగశ్చాస్య కీదృశః
సర్వమేత ద్యథాతత్త్వం భగవన్ వక్తుమర్హసి. 5

"అతి సుందరములైన విషయములను సేకరించి పూజ్యులైన మీచే వేదసమ్మితముగా కూర్చబడిన ఈ నాట్యవేదమెట్లు జన్మించినది ? ఎవరికొఱకై పుట్టినది ? దీనిలో ఎన్ని అంగములు కలవు ? వీని నే ప్రమాణములో తెలిసికొన వచ్చును ? ఈ నాట్యప్రయోగ మేవిధముగా నుండును ? ఈ ఐదువిషయములను సమగ్రముగా మాకు తెలియజేయవలసినది" అని మునులు భరతుని ప్రార్థించినారు.

ఇంతకుముందు నాట్యమును దర్శించినను మునులకది అనిర్వాచ్యముగా నుండుటచే నీ ప్రశ్నలు బయలుదేరినవి. ఈ నాట్యవేదము వేదతుల్యమగుటచే పరీక్షించి తెలిసికొనవలసిన విషయమైనది. అనగా వేదములలో గానవచ్చు ధర్మాది పురుషార్థ చతుష్టయమిచట గూడ [illegible] ఉపదేశహేతు వగుటచేతనే నాట్యముకూడ వేద [illegible]

చున్నది. వేదము జిజ్ఞాస్యవిషయము. ఇట్టి నాట్యవేద మేప్రయోజనము నపేక్షించి, ఏ ప్రకారముగా జన్మించిన దని మొదటి ప్రశ్న. వేదాధ్యయనమున కధికారము గలవారే ఇచటగూడ నధికారులా, లేక ఇతరులకు సహిత మీయధికారము గలదా అని రెండవ ప్రశ్న.

నాట్యమున గీతము, ఆతోద్యము, అభినయము కలదు. వీనిలో నాట్యాంగము లెవ్వి? అంగియగు నాట్యమునకు, దాని అంగములకు గల సంబంధ మేది? లేక ఈ వివిధాంగముల సముదాయమునకే నాట్యమని పేరు గలదా? అని మూడవ ప్రశ్న.

నాట్యాంగములను తెలిసికొనవలయుననిన, ఏ ప్రమాణముతో తెలిసికొనవలయును? విషయమునుగూర్చి సమగ్రముగా తెలిసికొనవలెననిన ప్రమాణజ్ఞాన మవసరము. కావున నాట్యమునకు సంబంధించిన ప్రమాణము లెవ్వి? యని నాల్గవ ప్రశ్న.

అంగములతో కూడిన నాట్యము నేరీతిగా ప్రయోగించవలయును? అని ఐదవ ప్రశ్న. నాట్యాంగములకు నాట్యమునకు నియత సంబంధము కలదా? లేదా? నాట్యాంగ ప్రయోగము నడుగుటచేత సామాన్యాభినయము, చిత్రాభినయము, నాటకాది రూపక విషయము చెప్పబడగలవని సూచన కలుగుచున్నది.

ఈ ఐదు ప్రశ్నల నాధారము చేసికొని చెప్పబడినదే నాట్యశాస్త్రము. మునులకు కావలసిన దీ ప్రశ్నలకు సమాధానము మాత్రమే గాదు. మునులు ఈ విషయమున కేవలము అజ్ఞులై వచ్చినవారు. అందుచే యథాతత్త్వము చెప్పుమని అడిగినారు. మునులు తెలిసికొనవలసిన విషయములను వా రడుగకపోయినను, వారికి చెప్పవలసిన బాధ్యత భరతునిపై గలదు.

తేషాంతు వచనం శ్రుత్వా మునీనాం భరతో మునిః
ప్రత్యువాచ తతో వాక్యం నాట్యవేదకథాంప్రతి. 6

భవద్భిః శుచిభిర్భూత్వా తథావహితమానసైః
శ్రూయతాం నాట్యవేదస్య సంభవో బ్రహ్మనిర్మితః. 7

ఆ మునుల వాక్యమును వినిన తర్వాత నాట్యవేద కథను గురించి భరతముని క్రింది విధమున చెప్పదొడగెను. "మీరు శుచులై, శ్రద్ధతో కూడిన మనస్సు కలవారై, బ్రహ్మచే నిర్మింపబడిన నాట్యవేదమెట్లు ఉత్పన్నమైనది వినవలయును."

మునులడిగిన మొదటిప్రశ్నకు సమాధానముగా నీ నాట్యవేదము బ్రహ్మచే నిర్మింపబడిన దని చెప్పబడినది. మిగిలిన ప్రశ్నలకు ప్రత్యుత్తరముగా ముప్పదియారధ్యాయములు గల నాట్యశాస్త్రము బ్రహ్మచే చెప్పబడినది. నాల్గు ప్రశ్నలకు యథాక్రమముగా సమాధానము చెప్పబడినట్లు కన్పించదు. సందర్భానుసారముగా, ఔచిత్యమును, యోగ్యతను పాటించుచు, మునులు అడిగిన ప్రశ్నలకు ప్రత్యుత్తరము లొసగబడిన వని గ్రహించవలెను. ఈ ప్రత్యుత్తరములు నాట్యవేదకథా రూపమున నొసగబడుచున్న వనుటచేత నాట్యప్రయోగమును దర్శించిన మునుల సందేహ నివృత్తికి, జిజ్ఞాసకు సాధనమగు జ్ఞానము మాత్ర మిచ్చట ఇవ్వబడుచున్న దని చెప్పుకొనవలెను.

పూర్వం కృతయుగే విప్రా వృత్తే స్వాయంభువేఽన్తరే
త్రేతాయుగేఽథ సంప్రాప్తే మనోర్వైవస్వతస్యతు. 8
గ్రామ్యధర్మప్రవృత్తేతు కామలోభవశం గతే
ఈర్ష్యాక్రోధాది సంమూఢే లోకే సుఖిత దుఃఖితే. 9
దేవ దానవ గంధర్వ యక్ష రక్షో మహోరగైః
జంబూద్వీపే సమాక్రాంతే లోకపాలప్రతిష్ఠితే. 10
మహేంద్రప్రముఖై ర్దేవైః కిల పితామహః
"క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రవ్యంచ యద్భవేత్. 11
న వేద వ్యవహారోఽయం సంశ్రావ్యః శూద్రజాతిషు
తస్మాత్ సృజాపరం వేదం పంచమం సార్వవర్ణికమ్". 12

నాట్యమున కుపకరించు దేశకాలములను నిర్వచించుచు, నాట్యమున కధికారి నిర్ణయము చేయనెంచి ఐదు శ్లోకములను చెప్పినాడు.

స్వాయంభువమన్వంతరమైన తర్వాత కొంతకాలమున కేడవదియగు వైవస్వతమన్వంతరము సంప్రాప్తించగా, కృతయుగము పోయి త్రేతాయుగము రాగా మహేంద్రుడు మొదలగు దేవతలు బ్రహ్మవద్దకు వెళ్ళి క్రీడనీయకమును ప్రసాదింపుమని అడిగినారు. ప్రజలు కామమునకు, లోభమునకు వశులై గ్రామ్యధర్మములో పడిపోగా సుఖదుఃఖములతో సమాక్రాంతమైన జగత్తు ఈర్ష్యాక్రోధాదులకు లోనైనది. అట్టిసమయమున లోకపాలురచే కాపాడబడుచున్న జంబూద్వీపము దేవ, దానవ, గంధర్వ, యక్ష, రాక్షస, మహోరగముల వశమైనది. ఇటువంటి కాలమున దృశ్యము, శ్రవ్యము నగు ఆటను గోరిన దేవతలు సర్వ వర్ణములకు సహితము పాఠ్యయోగ్యము, ప్రయోగయోగ్యము నగు ఐదవవేదము సృష్టించవలసినదని బ్రహ్మను ప్రార్థించినారు.

దేవతలు క్రీడనీయకమును కోరినారు. క్రీడనీయక మనగా చిత్తవిక్షేపమును కలుగ జేయునది, చిత్తమును వికసింపజేయునది, చిత్తమును ఉత్తేజింపగలిగినది అని అర్థము. అనగా చిత్తమున దాగియున్న భయశోకాదులు నాట్యము ద్వారా బహిర్గతములై చిత్తశాంతిని చేకూర్చగలవు. దీనిచే చిత్తద్రుతి కలిగి, ఆపై చిత్తవిస్తృతి, చిత్తవికాసము కలుగగలవు. కాగా, రజస్తమోగుణములను సత్త్వగుణములోనికి పరిణమింపజేయగలిగినది క్రీడనీయకము.

సుఖదుఃఖాత్మకమైన జీవితముగల వ్యక్తికే క్రీడనీయకము కావలెనుకాని, అన్యులకు కాదు. కేవలము సుఖమేగల కాలమగు కృతయుగమునగాని, కేవల దుఃఖమేగల కాలమగు కలియుగపు చతుర్థపాదమునగాని క్రీడనీయకము రక్తికట్టదు, రాణించదు కూడ. ఈర్ష్యాక్రోధాదులతో హృదయము సమావిష్టమైనది కనుక లోకము సుఖిత దుఃఖితమని దుఃఖ బాహుళ్యమును చెప్పినాడు. కామము, లోభము మొదలగువానివలన ఈర్ష్యాక్రోధాదులు బయలుదేరినవి. అందుచే జనులు స్వధర్మములను వదలి నిషిద్ధమైన కర్మల నాచరించుచున్నారు. అట్టివారికి మార్గోపదేశకమగుటచే క్రీడనీయకమగు నాట్యము చిత్తవికాసమునకు దోహదమగుచున్నది.

వైవస్వత మన్వంతరమున దుఃఖబాహుళ్యమున్నను, ధర్మము నశించలేదని చెప్పుటకు జంబూద్వీపమున దేవతలుకూడ కలరని. లోకపాలురు కాపాడుచున్నారని చెప్పబడినది.

దేవతలు కోరిన క్రీడనీయకము దృశ్యము, శ్రవ్యము నై యుండవలెను. దృశ్య శ్రవ్య శబ్దములచే నేత్రేంద్రియము, శ్రవణేంద్రియము గ్రహింపబడుచున్నవి. ఇంద్రియముల ద్వారా మనకనుభూతి కల్గుచున్నను, ఉత్తమమైన ఇంద్రియములీ రెండుమాత్రమే నని ఇచట సూచన కలదు. వీనినే కావ్యేంద్రియము లందురు. వీని ద్వారా ఆత్మావేశము, లోకోత్తరానుభూతి కలుగగలవు. కన్ను, చెవి యనునవి సాహిత్యేంద్రియము లగుటచేత దృశ్యమనగా హృద్య మని, శ్రవ్యమనగా వ్యుత్పత్తిప్రదమని చెప్పికొనవలెను. కాగా నాట్యము ప్రీతివ్యుత్పత్తిప్రద మైన దని సిద్ధాంతము.

ఈవిధమైన నాట్యము సార్వవర్ణికము. వేదాధ్యయనమున కధికారము లేని వర్ణములకు వేదవిహితధర్మములపై గౌరవముకాని, అభిమానముకాని లేక పోవచ్చును. అట్టిచో నాట్యవేద మనబడు పంచమవేదము వీరికి కూడ ధర్మోపదేశకము, సన్మార్గోపదేశకము నై, ప్రజల హితమును పెంపొందింప గలదు. కావున నాట్యవేదమునకు అతిశయితమైన అధికారము సంప్రాప్తించుచున్నది. వేదమును చదువుట కధికారము లేనివారికి కూడ సుకుమారమార్గము ద్వారా హితోపదేశజనకము, ఆనందజనకము నగుచున్నది.

ఏవమస్త్వితి తాన్ ఉక్త్వా దేవరాజం విసృజ్యచ
సస్మార చతురో వేదాన్ యోగ మాస్థాయ తత్త్వవిత్. 13

దేవతలు ప్రార్థించిన విషయమునుగూర్చి 'అట్లే అగుగాక' అని పలికి, మహేంద్రుని, దేవతలను పంపివేసి సమస్తలోకవేదజ్ఞుడగు బ్రహ్మ యోగసమాధిలో మగ్నుడై, తన బుద్ధికుశలతతో నాలుగు వేదములను స్మరించెను.

ధర్మ్య మర్థ్యం యశస్యంచ సోపదేశం ససంగ్రహమ్
భవిష్యతశ్చ లోకస్య సర్వకర్మాను దర్శకమ్. 14
సర్వశాస్త్రార్థ సంపన్నం సర్వశిల్ప ప్రవర్తకమ్
నాట్యాఖ్యం పంచమం వేదం సేతిహాసం కరోమ్యహమ్. 15
ఏవం సంకల్ప్య భగవాన్ సర్వవేదా ననుస్మరన్
నాట్యవేదం తత శ్చక్రే చతుర్వేదాంగ సంభవమ్. 16

చక్కని ఉపదేశముతో కూడినది, ధర్మార్థ కామ మోక్షములతో అన్వితమైనది, కీర్తిప్రదమైనది, సులభగ్రాహ్యమైనది యగు నాట్యవేదమును నిర్మింప బ్రహ్మ సంకల్పించి నాడు. ఇతర ప్రమాణముల నపేక్షించక, సాక్షాత్కారరూపమైనది నాట్యము. అన్ని కర్మలకు కలుగబోవు శుభాశుభ ఫలములను ప్రజలకు తెలియజేయునది నాట్యము. కావుననే ఇది ధర్మాది పురుషార్థములతో కూడినది మాత్రమే గాక, అర్థ్యమగుచున్నది. హృద్యత్వముతో నుండి సర్వజనులకు ఆకర్షణీయముగను, అభిలషణీయముగను ఉండునది అర్థ్యము. హృద్య భావముతో అంతట వ్యాపించిన దగుటచే యశస్యమగుచున్నది.

సర్వశాస్త్రములలోని అర్థములతో కూడినది, సర్వశిల్పములకు ప్రవృత్తిహేతువు నగు నాట్యమనబడు పంచమ వేదమును ఇతిహాసయుక్తముగా నిర్మింప సంకల్పించినాడు. ప్రత్యక్షముగా పరిదృశ్యమానములు, ఆగామికములు నగు అర్థములు కర్మఫల సంబంధ స్వభావములుగా ఎచట కన్పించునో అదియే ఇతిహాసము. అనగా ఉపదేశకరూపముగలది నాట్యము.

ఈ విధముగా సంకల్పించి, పూజ్యుడైన బ్రహ్మ అన్ని వేదములను చక్కగా స్మరించి, వేద వేదాంగముల నొక్కచో కూర్చవలె నను బుద్ధితో నాట్యవేదమును చేసినాడు. ఇట్టి నాట్యవేదము చతుర్వేదాంగసంభవము. నాల్గువేదములనుండి, వేదాంగములనుండి ఉత్పన్నమైనదీపంచమవేదము.

జగ్రాహ పాఠ్య మృగ్వేదాత్ సామభ్యో గీతమేవచ
యజుర్వేదా దభినయాన్ రసా నాథర్వణాదపి. 17

స్వరాలంకారాది సామగ్రీయోజనచే చెప్పదలచినదానిని చక్కగా వ్యక్తముచేయు వాక్కును పాఠ్యమందురు. నాట్యమునకు వాగభినయము శరీరమువంటి దగుటచేత పాఠ్యమును మొదట చెప్పినాడు. ఈ పాఠ్యము ఋగ్వేదమునుండి గ్రహించబడినదగుటచే నిది కాక్వాది మూడు స్వరములతో కలసియున్నదని భావము. పాఠ్యము స్వరయుక్తముగావున, గానమున కుపకరించు స్వరముగల సామవేదమునుండ గీతము గ్రహింపబడినదని తర్వాత చెప్పబడినది. నాట్యప్రయోగమునకు ప్రాణము గీతము. గీతము నాశ్రయించుకొని యున్నది రసచర్వణ. గీతములో వచ్చునవి తాళ లయాదులు. యాగక్రియాప్రధానమగు యజుర్వేదమందు ప్రదక్షిణ గమనాదిక్రమము కన్పించుటచే నీ వేదమునుండి సుషిరాత్మకమగు నాతోద్యము, అభినయము స్వీకరించబడినవి. విభావాదిసామగ్రీరూపములగు రసములు అథర్వణ వేదములోని శాంతిక మారణాది కర్మలనుండి తీసికొనబడినవి. కావున గీతాతోద్యప్రాణాభినయ వర్గములచే పరిపోషము చెందు శృంగారాది రసములతో పరమప్రీతిమయమైనది నాట్యము.

వేదోపవేదైః సంబద్ధో నాట్యవేదో మహాత్మనా
ఏవం భగవతా సృష్టో బ్రహ్మణా సర్వవేదినా. 18

వేదార్థమునకుపకరించు అర్థముకలవి ఉపవేదములు. వేదములతోను, ఉపవేదములతోను సమ్మిశ్రితమైన నాట్యవేదము పూజ్యుడు, మహాత్ముడు, అన్నియు తెలిసినవాడు నగు బ్రహ్మచే నీ విధముగా సృష్టించబడినది.

ఉత్పాద్య నాట్యవేదంతు బ్రహ్మోవాచ సురేశ్వరమ్
"ఇతిహాసో మయాసృష్టః సనురేషు నియుజ్యతామ్. 19
కుశలా యే విదగ్ధాశ్చ ప్రగల్భాశ్చ జితశ్రమాః
తేష్వయం నాట్యసంజ్ఞోహి వేదః సంక్రామ్యతాం త్వయా." 20

నాట్యవేదము నుద్భవింపజేసిన తర్వాత "నాచే దశరూపక మొకటి సృష్టించబడినది. దానిని దేవతలచే ప్రయోగింపజేయుము. గ్రహణధారణయోగ్యులు, ఊహాపోహాసమర్థులు,

సభాపిరికితనము లేనివారు. అలసట నెరుగజాలనివారు నగువారలకు నీ ద్వారా నాట్యవేద మనబడు నియ్యది సంక్రమింపవలెను" అని ఇంద్రునితో బ్రహ్మ పలికినాడు.

ఇందు్రిన కీరీతిగా ఆజ్ఞ నొసగుటచేత నాట్యమును ప్రయోగింపజేయుటకు ప్రభువే సమర్థుడని తేలుచున్నది.

> తచ్ఛ్రుత్వా భగవా న్ఛక్రో బ్రహ్మణా యదుదాహృతమ్
> ప్రాంజలిః ప్రణతో భూత్వా ప్రత్యువాచ పితామహమ్. 21
> 'గ్రహణే ధారణే జ్ఞానే ప్రయోగే చాస్య సత్తమ
> అశక్తా భగవన్ దేవా అయోగ్యా నాట్యకర్మణి. 22
> య ఇమే వేదగుహ్యజ్ఞా ఋషయః సంశితవ్రతాః
> ఏతేఽస్య గ్రహణే శక్తాః ప్రయోగే ధారణే తథా' 23

బ్రహ్మ యనిన మాటను దేవేంద్రు డాలకించి అంజలిపూర్వకముగా ప్రణమిల్లి బ్రహ్మకు ఈ రీతిగా ప్రత్యుత్తర మిచ్చెను. "గురుముఖమున విషయము నాగాహనము చేసికొనుట, తెలసికొనినదానిని మరచిపోకుండుట, ఊహాపోహావిచారము గలిగియుండుట, సభలో ప్రయోగించుట అను నీ నాలు విషయములలోను దేవతలు శక్తిలేనివారు. సహజముగా సుఖమును గోరు దేవతలు నాట్యకర్మకు యోగ్యులుకారు. అందుచే వేదముల రహస్యములను తెలిసికొనినవారు, అభ్యాసము చేయగలవారు నగు నీ ఋషులు నాట్యముయొక్క గ్రహణ, ధారణ, ప్రయోగములందు సమర్థులు". కావున ఋషులనే నాట్యప్రయోగమున నియమింప వలసినదని ప్రార్థన.

ఋషులు వేదజ్ఞులనుటచే గ్రహణధారణసామర్థ్యము కలవారని, వేదములరహస్యముల నెరిగినవారనుటచే శృంగారాది రసముల నభినయించుట కుపయోగించు సాత్త్వికసంపాదిత మగు సామర్థ్యముగలవారని సిద్ధము కాగలదు.

> శ్రుత్వాతు శక్రవచనం మామాహాంబుజసంభవః
> 'త్వం పుత్రశతసంయుక్తః ప్రయోక్తాస్య భవానఘ.' 24

ఇంద్రుని వాక్యమును విని "పాపరహితుడవైన నీవు నీ నూర్గురు పుత్రులతో కలసి నాట్యమును ప్రయోగింపజేయుము" అని భరతుని ఉద్దేశించి బ్రహ్మ పలికినాడు.

> ఆజ్ఞాపితో విదిత్వాహం నాట్యవేదం పితామహాత్
> పుత్రా నధ్యాపయామాస ప్రయోగం చాపి తత్త్వతః. 25

బ్రహ్మచే ఆజ్ఞాపింపబడిన భరతముని బ్రహ్మవద్దనే నాట్యవేదమును తెలసికొనినవాడై నాట్యవేదము, దాని ప్రయోగమును ఉన్నదున్నట్లుగా తన పుత్రులకు నేర్పెను.

> శాండిల్యం చైవ వాత్స్యంచ కోహలం దత్తిలం తథా
> జటిలాం బష్టకొంచైవ తణ్డు మగ్నిశిఖం తథా, 26
> సైంధవం సపులోమానం శాడ్వలిం విపులం తథా
> కపింజలిం బాదిరంచ యమ ధూమ్రాయణౌ తథా, 27

జంబుధ్వజం కాకజంఘుం స్వర్ణకం తాపసంతథా
కైదారిం శాలికర్ణంచ దీర్ఘగాత్రంచ శాలికమ్, 28
కౌత్సం తాండ్యాయనించైవ పింగలం చిత్రకంతథా
బంధులం భల్లకంచైవ ముష్టికం సైంధవాయనమ్. 29
తైతిలిం భార్గవంచైవ శుచిం బహులమేవచ
అబుధం బుధసేనంచ పాండుకర్ణం సుకేరలమ్, 30
ఋజుకం మండకంచైవ శంబరం వంజులంతథా
మాగధం సరలంచైవ కర్తారం చోగ్రమేవచ, 31
తుషారం పార్షదంచైవ గౌతమం బాదరాయణం
విశాలం శబలంచైవ సునాభం మేషమేవచ, 32
కాలియం భ్రమరంచైవ తథా పీఠముఖంమునిమ్
నఖకుట్టా శ్మకుట్టాచ షట్పదం సోత్తమంతథా, 33
పాదుకో పానహాచైవ శృతిం చాపస్వరంతథా
అగ్నికుండా జ్యకుండౌచ వితండ్యం తాండ్యమేవచ, 34
కర్తరాక్షం హిరణ్యాక్షం కుశలం దుఃషహంతథా
లాజం భయానకంచైవ భీభత్సం సవిచక్షణమ్, 35
పుండరీకం పుండరీనాసంచ అసితం సితమేవచ
విద్యుజ్జిహ్వం మహాజిహ్వం శాలంకాయనమేవచ, 36
శ్యామాయనం మాఠరంచ లోహితాంగం తథైవచ
సంవర్తకం పంచశిఖం త్రిశిఖం శిఖమేవచ, 37
శంఖవర్ణముఖం షండం శంకుకర్ణమథాపిచ
శకరీనేమిం గభస్తిం చాప్యంశుమాలిం శఠంతథా, 38
విద్యుతం శాతజంఘుంచ రౌద్రం వీరమథాపిచ
పితామహాజ్ఞయా స్మాభి ర్లోకస్యచ గుణేప్సయా, 39
పరియోజితం పుత్రశతం యథా భూమి విభాగశః
యో యస్మి న్కర్మణి యథాయోగ్య స్తస్మిన్ స యోజితః 40

మొదటి పదమూడున్నర శ్లోకములలో శాండిల్య, వాత్స్య, కోహళ, దత్తిల, జటిల, అంబష్ట, తండు, అగ్నిశిఖ, సైంధవ, సపులోమాన, శాద్వలి, విపుల, కపింజలి, బాదరి, యమ, ధూమ్రాయణ, జంబుధ్వజ, కాకజంఘు, స్వర్ణక, తాపస, కైదారి, శాలికర్ణ, శాలిక, కౌత్స, తాండాయనిక, పింగల, చిత్రక, బంధుల, భల్లక, ముష్టిక, సైంధవాయన, తైతిలి, భార్గవ, బహుల, అబుధ, బుధసేన, పాండుకర్ణ, సుకేరల, ఋజుక, మండక, శబర, వంజుల, మాగధ, సరల, కర్తార, ఉగ్ర, తుషార, పార్షద, గౌతమ, బాదరాయణ, విశాల, శబల, సునాభ, మేష, కాలియ, భ్రమర, పీఠముఖ, నఖకుట్ట, అశ్మకుట్ట, షట్పద, పాదుక, ఉపానహ, చాపస్వర, అగ్నికుండ, ఆజ్యకుండ, వితండ్య, తాండ్య,

కర్తరాక్ష, హిరణ్యాక్ష, కుశల, దుఃసహ, లాజ, భయానక, బీభత్స, సవిచక్షణ, పుండ్రాక్ష, పుండ్రనాస, అసిత, సిత, విద్యుజ్జిహ్వ, మహాజిహ్వ, శాలంకాయన, శ్యామాయన, మాఠర, లోహితాంగ, సంవర్తక, పంచశిఖ, త్రిశిఖ, శిఖ, శంఖవర్ణముఖ, షండ, శంకుకర్ణ, శక్రనేమి, గభస్తి, అంశుమాలి, శఠ, విద్యుత, శాతజంఘ, రౌద్ర, వీర మొదలగు భరతకుమారుల పేర్లు గలవు. వీరు నూర్గురు. వీరందరు భరతునకు ఆప్తులైన శిష్యులగుటచే భరతుని పుత్రు లని పిలువబడినారు. వీరిలో కోహల, దత్తిల, తండు నామధారులు ప్రత్యేకముగా నాట్యశాస్త్రములను రచించినవారు.

బ్రహ్మయొక్క ఆదేశము ననుసరించి, లోకకల్యాణమును వాంఛించి, భూవిభాగమును గుర్తించి, ఈ నూర్గురచే నాట్యప్రయోగమును భరతముని చేయించినాడు. ఏ పనిచేయుట కెవడు శక్తిగలిగి, యోగ్యుడై ఉబలాటపడినాడో, వానిని ఆపనిలో నియమించినవాడు భరతుడు.

భారతీం సాత్త్వతీం చైవ వృత్తి మారభటీంతథా
సమాశ్రితః ప్రయోగస్తు ప్రయుక్తో వై మయా ద్విజాః. 41

భారతీ, సాత్త్వతీ, అరభటీ వృత్తులతో కూడియున్న నాట్యము భరతునిచే ప్రయోగింప బడినదని భరతుడు మునుల నుద్దేశించి పల్కుచున్నాడు.

ధర్మము మొదలుగాగల నాల్గు పురుషార్థములను సాధింపనెంచెడి వాగంగ సత్త్వ చేష్టా సామాన్యమును వృత్తి యందురు. ఇట్టి వృత్తులు నాలుగు కలవు. ఎవడైన ఏ పనిని చేయ సాగినను వాఙ్మనఃకాయవ్యాపారమచట గలుగును. ఉత్తమప్రకృతిగలవారు లలితముగాను, తదితరులు వేరొకవిధముగాను తమతమ కృత్యములను నిర్వర్తించుకొనుట గలదు. ఈ భేదము నాశ్రయించుకొనియే వృత్తులు నాల్గు రకములని చెప్పినారు. కేవలము వాగ్వృత్తి యైనది భారతీవృత్తి. సంవేదనముకలది సత్త్వము. సత్త్వమనగా మనస్సు. కావున మనోవ్యాపార రూపమైనది సాత్త్వతీ వృత్తి. అలసట లేనివారు, ఉత్సాహవంతులు నగు భటులకు సంబంధించినది యగు ఆభరటీవృత్తిని కాయవృత్తి యందురు.

పరిగృహ్య ప్రణమ్యాథ బ్రహ్మా విజ్ఞాపితో మయా
అథాహ మాం సురగురుః "కైశికీమపి యోజయ, 42

యచ్చ తస్యాః క్షమం ద్రవ్యం తద్బ్రూహి ద్విజసత్తమ"
ఏవం తేనాస్మ్యభిహితః ప్రత్యుక్తశ్చ మయా ప్రభుః. 43

"దీయతాం భగవన్ ద్రవ్యం కైశిక్యాః సంప్రయోజకమ్
నృత్తాంగహారసంపన్నా రసభావ క్రియాత్మికా. 44

దృష్టా మయా భగవతో నీలకంఠస్య నృత్యతః
కైశికీ శ్లక్ష్ణ నైపథ్యా శృంగార రససంభవా. 45

అశక్యా పురుషైః సాతు ప్రయోక్తుం స్త్రీజనాదృతే"
తతో உసృజన్మహాతేజా మనసాప్సరసో విభుః. 46

నాట్యప్రయోగమైన తర్వాత ప్రణామపూర్వకముగా బ్రహ్మకు తను జేసినదంతయు భరతుడు విన్నవించుకొనగా, "కైశికీవృత్తిని గూడ ప్రయోగించుము. ఆ ప్రయోగమును సమర్థించుటకు కావలసిన సౌందర్య మనబడు ద్రవ్యమేదో తెలుపుము" అని దేవగురువు భరతుని అడిగినాడు. నృత్తాంగహారములతో కూడుకొనినది, రసభావక్రియలనే ఆత్మ గలది యగు కైశికీవృత్తి శృంగారరసములో నుత్పన్న మగునది. ఉచితమైన నేపథ్యముతో కూడినది. భగవానుడగు నీలకంఠుడు నృత్యము చేయుచుండగా కైశికీవృత్తిని దర్శించితిని. కాని స్త్రీలు లేకుండా కేవలము పురుషులచే నీ కైశికీవృత్తి ప్రయోగింపబడ లేదు. కావున కైశికీవృత్తిని చక్కగా ప్రయోగించుటకు కావలసిన ఉపకరణముల నిమ్ము అని భరతుడు సమాధానము నివ్వగా మహా తేజస్సుగల అప్సరసలను పరమేష్ఠి మనస్సుతో సంకల్పించి సృష్టించెను.

కేశము లేరీతిగా సౌందర్యపోషకములో అట్లే సౌందర్యోపయోగియగు వ్యాపారమును కైశికీవృత్తి యందురు. లాలిత్య మెచట కన్పించినను అది కైశికీవృత్తి వలన వచ్చినదే అని గ్రహించ వలెను. కైశికి లేని నాట్యప్రయోగమున సౌందర్యమనబడు విశిష్టత కన్పించదు. కైశికికి కావలసిన ఉపకరణ ద్రవ్యమును కోరుకొనమనగానే సౌందర్యవతులగు స్త్రీలను భరతుడు కోరుటలో నాట్యాచార్యునకు కవిహృదయగ్రహణయోగ్యత్వ మనబడు గుణ ముండునని సూచింపబడు చున్నది.

నర్తించువేళ అంగహారములు సముచితస్థానములయందలంకరింపబడుట కైశికియొక్క లక్షణములలో నొకటి. పరిపూర్ణమగు నానందముతో నిండి, సుందరాకారుడై, ఆనంద నృత్తమున తేలిపోవుచున్న శంకరునినాట్యములో కైశికి మూర్తీభవించగా భరతుడు గ్రహించినాడు. ఉచితమైన నేపథ్యముతో, అనగా యోగ్యమైన వేషముతో కూడియున్నపుడే కైశికి నాట్యమున ఉపకరించ గలదు. అనగా సుకుమారమైన ఆంగికాభినయనములో కైశికీవృత్తి గలదని భావము. కవి, నట, సామాజికుల హృదయముల నావేశించియున్న రసభావముల నభివ్యక్తము చేయజాలిన దీకైశికీవృత్తి యని తర్వాత లక్షణము నిచ్చినాడు. ఈ కైశికీవృత్తి లేకుండా శృంగారరసమే సిద్ధించదు.

తమ తమ హృదయములలో రసము విలసిల్లి పరిపూర్ణమై, లౌకికాతీతమై, పవిత్రముగా కవి, నట, సామాజికులకు భాసించవలయును. ఇట్టి విలాసము స్వాభావికముగా విముఖ చిత్త వృత్తిగల మునులకు కలుగజాలదు. ఒకవేళ యోగసమాధిలో కలిగినను, ఆ విలాసము సమాధిని వదలిన తర్వాత ఉండదు. కాని సహజముగా ఆర్ద్రహృదయులగు స్త్రీలకే ఇట్టి విలాసము పూర్తిగా కలదు. అందుచే స్త్రీజనులు లేనిది కైశికీవృత్తి ప్రయోగింపబడజాలదని భరతుడు విన్నవించుకొనినాడు.

నాట్యాలంకార చతురాః ప్రాదా న్మహ్యం ప్రయోగతః
మంజుకేశీం సుకేశీంచ మిశ్రకేశీం సులోచనామ్, 47
సౌదామినీం దేవదత్తాం దేవసేనాం మనోరమామ్
సుదతీం సుందరీంచైవ విదగ్ధాం విపులాంతథా, 48

సుమాలాం సన్తతించైవ సునన్దాం సుముఖీంతథా
మాగధీ మర్జునీంచైవ సరలాం కేరలాం ధృతిమ్, 49

నందాం సపుష్కలాంచైవ కలభాంచైవ మే దదౌ
స్వాతి ర్భాండ నియుక్తస్తు సహశిష్యైః స్వయంభువా, 50
నారదాద్యాశ్చ గంధర్వా గానయోగే నియోజితాః

నాట్యమునకు వైచిత్ర్యమును, విశిష్టతను కైశికీవృత్తితో తీసికొనివచ్చువారు, చతురు రాండ్రు నగు నప్సరసలను కైశికీప్రయోగముతో భరతున కప్పగించెను. నాట్యాలంకారమును తెచ్చునవి స్వభావములగు లీల, విలాసము మొదలగు పదిగుణములు, యత్నజములగు శోభా, కాంతి మొదలగు నేడుగుణములు కూడ నగుచున్నవి స్వభావసిద్ధములు, యత్నసిద్ధములు నగు గుణములవసరమగుటచే మునికన్యలు కైశికీవృత్తిని ప్రయోగించపేరు. అందుచే మంజుకేశి, సుకేశి, మిశ్రకేశి, సులోచన, సౌదామిని, దేవదత్త, దేవసేన, మనోరమ, సుదతి, సుందరి, విదగ్ధ, విపుల, సుమాల, సునంద, సుముఖి, మాగధి, అర్జుని, సరల, కేరల, ధృతి, నంద, పుష్కల, కలభ మొదలుగాగల ఇరువదిముగ్గురు అప్సరసలు సృష్టించబడినారు. దీనితో నాల్గు వృత్తులతో కలసిన నాట్యము సిద్ధించగలదు.

నాట్యమునకు గీతాతోద్యములు కూడ నవసరములు. అందుచే పుష్కరవాద్యమును నిర్మించిన స్వాతి యను ఋషి, పణవ మృదంగాది వాద్యములలో ప్రసిద్ధులైన స్వాతియొక్క శిష్యులు, నారదుడు మొదలుగాగల గంధర్వులు, సుషిరాతోద్యాది గానమునకై నాట్యాచార్యుడగు భరతున కర్పింపబడినారు.

ఏవం నాట్యమిదం సమ్య గ్బుద్ధ్వా సర్వైః సుతైఃసహ, 51
స్వాతి నారద సంయుక్తో వేదవేదాంగ కారణమ్
ఉపస్థితోఽహం లోకేశం ప్రయోగార్థం కృతాంజలిః. 52

వేదవేదాంగములనుండి ఉత్పన్నమైన నాట్యమును పుత్రులతో సహ చక్కగా తెలసికొని, నాట్యప్రయోగమును జరుపదలచి, స్వాతి నారదులతో గలసి, కృతాంజలినై భరతుడు బ్రహ్మను సమీపించెను.

'నాట్యస్యగ్రహణం ప్రాప్తం బ్రూహి కిం కరవాణ్యహమ్'
ఏతత్తు వచనం శ్రుత్వా ప్రత్యువాచ పితామహః. 53
'మహానయం ప్రయోగస్య సమయః సముపస్థితః
అయం ధ్వజమహః శ్రీమాన్ మహేంద్రస్య ప్రవర్తతే. 54
అత్రేదానీ మయం వేదో నాట్యసంజ్ఞః ప్రయుజ్యతామ్

"నాట్యము తెలసికొనబడినది, శిక్షణలోనికి వచ్చినది. ఇకపై నేమిచేయవలసియున్నది" అని భరతుడు బ్రహ్మ నడిగినాడు. "దైవసంఘటితముగా మహత్తరమైన ఇంద్రధ్వజ మహోత్సవము వచ్చుచున్నది. ఇది ఇంద్రునుద్దేశించిన ఉత్సవము. నాట్యప్రయోగమునకు అనుకూలమైన

దివ్యమగు సమయముకూడ. కావున నీ సమయమున నాట్యవేదము ప్రయోగించుము" అని బ్రహ్మ ప్రత్యుత్తర మొసగెను.

తత స్తస్మిన్ ధ్వజమహే నిహతాసుర దానవే. 55
ప్రహృష్టా మరసంకీర్ణే మహేంద్ర విజయోత్సవే
పూర్వం కృతా మయా నాందీ హ్యాశీర్వచన సంయుతా. 56
అష్టాంగ పద సంయుక్తా విచిత్రా వేదనిర్మితా
తద న్తేఽనుకృతి ర్బద్ధా యథా దైత్యాః సురైర్జితాః. 57
సంఫేట విద్రవకృతా ఛేద్య భేద్యాహవాత్మికా

రాక్షసులు నశింపగా, సంతుష్టులైన దేవతలు మహేంద్రవిజయోత్సవమున స్వేచ్ఛగా విహరించుచుండగా, ఇంద్రధ్వజ మహోత్సవము జరిగినది. అందు భరతుడు నాట్యప్రయోగమును జేయించినాడు. నాట్యప్రయోగమునకు పూర్వము వేదనిర్మితము, అష్టాంగపదములతో కూడినది, ఆశీర్వచనముతో కూడినది, విచిత్రము నగు నాంది ప్రయోగించబడినది.

రాక్షసులు కలుగజేయు విఘ్నములనుండి రక్షించుటకు, నాట్యమండపమునగల దేవతల నానందింపజేయుటకు, నాంది చాల యవసరము. నాందీప్రయోగము పూర్వరంగమున కంగము కాదు. అన్ని పనులు ఆశీఃపూర్వకములగుటచే నాట్యము నాందీపూర్వకము కావలెను. అంగభూతములైన ఎనిమిది పదములుకాని, ఎనిమిది వాక్యములుకాని, ఒకే ఒక మహావాక్య రూపమున నుండుటయే నాందియొక్క ముఖ్య లక్షణము. అందుచేతనే నాంది విచిత్రమైన దనినాడు. ఈ పదములుగాని, వాక్యములుగాని ఎనిమిది, లేక పన్నెండు, లేక నాలుగు, లేక పదునారు ఉండవచ్చునని తర్వాతి ఆలంకారికులు సిద్ధాంతము చేసినారు,

నాంది కాగానే దేవతలచే రాక్షసులోడిపోయినవిషయము నాట్యరూపమున ప్రయోగించ బడినది. రోషము, శంకా, భయములతో కూడిన వాక్యములతో, శస్త్రయుద్ధము, మల్లయుద్ధములతో నున్న ఈ నాట్యము ప్రయోగింప బడినది.

తతో బ్రహ్మదయో దేవాః ప్రయోగ పరితోషితాః. 58
ప్రదదు ర్మత్సుతేభ్యస్తు సర్వోపకరణానివై
ప్రీతస్తు ప్రథమం శక్రో దత్తవాన్ స్వం ధ్వజం శుభమ్. 59
బ్రహ్మా కుటిలకంచైవ, భృంగారం వరుణః శుభమ్
సూర్య శ్ఛత్రం, శివస్సిద్ధిం, వాయు ర్వ్యజనమేవచ. 60
విష్ణుః సింహాసనంచైవ, కుబేరో మకుటం తథా,
శేషా యే దేవగంధర్వా యక్ష రాక్షస పన్నగాః. 61
తస్మిన్ సదస్యభిప్రేతా న్నానాజాతి గుణాశ్రయాన్
అంశాంశై ర్భాషితాన్ భావాన్ రసాన్ రూపం క్రియాబలమ్. 62
దత్తవంతః ప్రహృష్టా స్తే మత్సుతేభ్యో దివౌకసః

బ్రహ్మ మొదలగు దేవతలు ఈ నాట్యప్రయోగమువలన సంతుష్టులై భరతకుమారులకు సమస్త ఉపకరణముల నర్పించినారు. ప్రీతుడైన ఇంద్రుడు మొట్టమొదటనే శుభప్రదమైన

ధ్వజము నిచ్చెను. పూజ కుపయోగించునది, విఘ్నములను శాంతిపరచునది ధ్వజము. విదూషకున కుపకరించు వక్రదండమును బ్రహ్మ, పారిపార్శ్వకులకై భృంగారమును వరుణుడు, ఛత్రమును సూర్యుడు, దైవీ. మానుషీయను సిద్ధులను శివుడు, వింజామరములను వాయువు, రాజభూమికకై సింహాసనమును విష్ణువు, మకుటమును కుబేరుడు ఇచ్చినారు. సభాసదులకు అభిరుచిని కల్గించునవి, నానాజాతి గుణాశ్రయములు నగు వాగభినయములను, విభావాది భావములను, రతిహాసాది రసములను, ఆంగికాభినయమునకు కావలసిన రూపమును, చేష్టను, బలమును, శేషించిన దేవతలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, పన్నగములు వారి వారి అంశల ననుసరించి అర్పించినారు.

ఏవం ప్రయోగే ప్రారబ్ధే దైత్య దానవ నాశనే. 63
అభవన్ క్షోభితాః సర్వే దైత్యా యే తత్ర సంగతాః
విరూపాక్ష పురోగాంశ్చ విఘ్నా నుత్పాదయంతి తే. 64
'నేత్థ మిచ్ఛామహే నాట్య మేత దాగమ్యతా' మితి
తతస్తై రసురైః సార్ధం విఘ్నా మాయా ముపాశ్రితాః. 65
వాచ శ్చేష్టాం స్మృతించైవ స్తంభయంతిస్మ నృత్యతామ్

దైత్య దానవ నాశన మనబడు నాట్యప్రయోగము ప్రారంభింపబడగా, విరూపాక్షుని నాయకత్వమున అచటకువచ్చిన రాక్షసులు క్షోభిల్లినవారై, "ఇట్టి నాట్యము మాకక్కరలేదు; రానీ, చూచెదముగాక" అని తలచి, మాయారూపమున విఘ్నములు చేయసాగిరి. దానితో నృత్యముచేయువారలకు వాక్కు, ఆంగికాభినయము, స్మృతి స్తంభించిపోయినవి.

తథా విధ్వంసనం దృష్ట్వా సూత్రధారస్య దేవరాట్. 66
'కస్మాత్ ప్రయోగ వైషమ్య'మి త్యుక్త్వా ధ్యాన మావిశత్
అథా పశ్య త్సదో విఘ్నైః సమంతా త్పరివారితమ్. 67
సహేతరైః సూత్రధారం నష్టసంజ్ఞం జడీకృతమ్
ఉత్థాయ త్వరితం శక్రః గృహీత్వా ధ్వజ ముత్తమమ్. 68
సర్వరత్నోజ్జ్వలతనుః కించి దుద్వృత్త లోచనః
రంగపీఠగతాన్ విఘ్నా నసురాంశ్చైవ దేవరాట్. 69
జర్జరీకృత దేహాం స్తా నకరో జ్జర్జరేణ సః

నాట్యప్రయోగమున సూత్రధారునకు, నటులకు సంభవించినప్రమాదమును ఇంద్రుడు కనుగొని, 'ప్రయోగమునకీ విషమస్థితి యెట్లు వచ్చినది?' అనిపలికి ధ్యానసమాధిలో మగ్నుడాయెను. ఆ సమాధిలో నాట్యసభ అన్నివైపుల విఘ్నములచే నావరింపబడినదని, సూత్రధారునితో బాటు ఇతర నటులుగూడ స్పృహలేక పడిపోయినారని గ్రహింపగలిగెను. సమస్తరత్నాభరణములతోను ఉజ్జ్వలముగా నున్న శరీరముతో, కొంచెము పైకి తిరిగిన కన్నులతో ఇంద్రుడు త్వరగా లేచి, ఉత్తమమైన తన ధ్వజమును స్వీకరించెను. ఆ ధ్వజముతో రంగపీఠమునగల విఘ్నములను, రాక్షసులను చూర్ణముగా చేయబడిన దేహములు కలవారినిగా జేసెను.

నిహతేషుచ సర్వేషు విఘ్నేషు సహదానవైః. 70
సంప్రహృష్య తతో వాక్య మాహుః సర్వే దివౌకసః
'అహో ప్రహరణం దివ్య మిద మాసాదితం త్వయా. 71
జర్జరీకృత సర్వాంగా యేనైతే దానవాః కృతాః
యస్మా దనేన తే విఘ్నాః సాసురా జర్జరీకృతాః. 72
తస్మాజ్జర్జర ఏవేతి నామతోఽయం భవిష్యతి
శేషా యేచైవ హింసార్థ ముపయాస్యంతి హింసకాః. 73
దృష్ట్వైనం జర్జరం తేఽపి గమిష్య న్త్యేవ మేవతు'

సమస్త విఘ్నములు, రాక్షసులు నశింపగా సంతోషించినవారై దేవతలీక్రిందిరీతిగా ఇంద్రునితో పలికిరి. "నీచే దివ్యమైన వధ చేయబడినది. దానవుల సకలావయవములు జర్జరీకృతములు, అనగా చూర్ణముగా చేయబడినవి. విఘ్నములు కూడ జర్జరీకృతములైనవి. అందుచే నీ ధ్వజము జర్జరమనిపించుకొనగలదు. నాట్యప్రయోగమునకు విఘ్నములు కలుగ జేయవలయునని హింసకులెవ్వరైన వచ్చిరేని, ఈ జర్జరమనబడు ధ్వజమును చూడగనే ఈ రాక్షసులు వచ్చినస్థితికి వారును రాగలరు."

'ఏవ మేవా స్త్వితి' తతః శక్రః ప్రోవాచ తాన్ సురాన్. 74
'రక్షాభూతశ్చ సర్వేషాం భవిష్య త్యేష జర్జరః
ప్రయోగే ప్రస్తుతే హ్యేవం స్ఫీతే శక్రమహే పునః. 75
త్రాసం సంజనయంతిస్మ విఘ్నాః శేషాస్తు నృత్యతామ్'
దృష్ట్వా తేషాం వ్యవసితం మదర్థే విప్రకారజమ్. 76
ఉపస్థితోఽహం బ్రహ్మాణం సుతైః సర్వైః సమన్వితః
'నిశ్చితా భగవన్ విఘ్నా నాట్యస్యాస్య వినాశనే. 77
అస్య రక్షావిధిం సమ్య గాజ్ఞాపయ సురేశ్వర'

దేవతలనిన మాటలకు 'అట్లే యగుగాక' యని పలికి ఇంద్రుడు దేవతలతో నిట్లనెను. "జర్జరమనబడు ఈధ్వజము అందరను రక్షించునది కాగలదు. ఉత్సాహజనకమగు ఇంద్రోత్సవమున నాట్యప్రయోగము జరుగుచుండగా ఈ ధ్వజము విఘ్నములకే భయము కల్గించకలదు. ఇతరులు నృత్యము చేయుదురు గాక."

భరతునికొరకై చేయబడిన ఈ శత్రువధను, దేవతలు చేసిన పనులను చూచి, పుత్రులతో కలసి భరతుడు బ్రహ్మవద్దకు వచ్చి ఇట్లనెను. "నాట్యవినాశమునకువచ్చు విఘ్నములు నివారింప బడినవి. దేవేశ్వరుడవైన నీవే నాట్యమండపము నేరీతిగా, రక్షింపవలయునో తెలియజేయవలసి యున్నది."

తతశ్చ విశ్వకర్మాణం బ్రహ్మోవాచ ప్రయత్నతః. 78
'కురు లక్షణసంపన్నం నాట్యవేశ్మ మహామతే'
తతోఽచిరేణ కాలేన విశ్వకర్మా మహచ్ఛుభమ్. 79

సర్వలక్షణ సంపన్నం నాట్యవేశ్మ చకార సః
ప్రోక్తవాన్ ద్రుహిణం గత్వా సభాయాంతు కృతాంజలిః. 80
'సజ్జం నాట్యగృహం దేవ తదవేక్షితు మర్హసి'
తతః సహమహేంద్రేణ సురైః సర్వైశ్చ సేతరైః. 81
ఆగత స్త్వరితో ద్రష్టుం ద్రుహిణో నాట్యమండపమ్

'లక్షణసంపన్నమగు నాట్యగృహమును నిర్మింపుము' అని బ్రహ్మ విశ్వకర్మ కాజ్ఞ నొసగెను. అతి శీఘ్రకాలములో సకల లక్షణములతో కూడినది, శుభప్రదము నగు నాట్య గృహమును నిర్మించి విశ్వకర్మ సభలోనున్న బ్రహ్మసద్దకు వెళ్ళి కృతాంజలియై 'నాట్య గృహము పూర్తియైనది. దానిని చూచి పరిశీలించుటకు మీరు రావలసినది' అని విన్నవించు కొనెను. అప్పుడు నాట్యమండపమును చూచుటకు బ్రహ్మ త్వరగా వచ్చెను.

దృష్ట్వా నాట్యగృహం బ్రహ్మ ప్రాహ సర్వాన్ సురాం స్తతః. 82
'అంశభాగై ర్భవద్భిస్తు రక్ష్యోఽయం నాట్యమండపః
రక్షణే మండపస్యాథ వినియుక్తస్తు చంద్రమాః. 83
లోకపాలా స్తథా దిక్షు విదిక్ష్వపిచ మారుతాః
నేపథ్య భూమౌ మిత్రస్తు నిక్షిప్తో వరుణోఽమ్బరే. 84
వేదికారక్షణే వహ్ని ర్భాండే సర్వదివౌకసః
వర్ణా శ్చత్వారవాథ స్తంభేషు వినియోజితాః. 85
ఆదిత్యాశ్చైవ రుద్రాశ్చ స్థితాః స్తంభాంతరేష్వథ
ధారణీషు స్థితాభూతాః శాలా స్వప్సరస స్తథా. 86
సర్వవేశ్మసు యక్షిణ్యో మహీపృష్ఠే మహోదధిః
ద్వారశాలా నియుక్తౌతు కృతాంతః కాలఏవచ. 87
స్థాపితౌ ద్వారపత్రేషు నాగముఖ్యౌ మహాబలౌ
దేహల్యాం యమదండస్తు శూలం తస్యో పరి స్థితమ్. 88
ద్వారపాలౌ స్థితౌ చోభౌ నియతి ర్మృత్యురేవచ
పార్శ్వేచ రంగపీఠస్య మహేంద్రః స్థితవాన్ స్వయమ్. 89
స్థాపితా మత్తవారణ్యాం విద్యుత్ దైత్య నిషూదనీ
స్తంభేషు మత్త వారణ్యాః స్థాపితాః పరిపాలనే. 90
భూత యక్ష పిశాచాశ్చ గుహ్యకాశ్చ మహాబలాః

నాట్యగృహమును అవలోకించి దేవతలతో బ్రహ్మ ఇట్లు పలికెను. "మీ మీ అంశలతో నాట్యమండపము రక్షింపబడ వలయును. మండపము సౌమ్యప్రకృతితో నుండునుగనుక మండప రక్షణకు చంద్రుడు నియోగింపబడుచున్నాడు. నాట్యగృహముయొక్క దిక్కులను లోకపాలురు, మూలలను మరుద్గణములు, ఆహార్యమున కుపకరించు నేపథ్యభూమిని మిత్రుడు, పై భాగమును వరుణుడు, రంగవేదికను అగ్ని, వాద్యములతో నున్న త్రిపుష్కరమును

మేఘములు, స్తంభములను బ్రాహ్మణాది నాలుగువర్ణములయొక్క అధిష్ఠానదేవతలు, స్తంభాంతరములను ఆదిత్యులు రుద్రులు, ధారణులను భూతములు, గవాక్షనేపథ్యాదులను అప్సరసలు, అన్ని గదులను యక్షిణులు, భూమియొక్క క్రిందిభాగమును మహాసముద్రము, ద్వారశాలను కాలము యముడు, కవాటాత్మకములైన ద్వారములను నాగముఖ్యులగు అనంతగుళికులు, గడపను యమదండము, గడప పైభాగమును శూలము రక్షింపవలయును. ద్వారపాలకులుగా నియతి, మృత్యువు కలరు. రంగపీఠముయొక్క ప్రక్కభాగమున మహేంద్రుడే స్వయముగా గలడు. అచటనేగల మదపుటేనుగుపై విద్యుత్తువలె మెరయుచున్నది, రాక్షసులను సంహరించినదియు నగు శక్తి స్థాపింపబడియున్నది. స్తంభములపై చెక్కిన మదపుటేనుగులయందు మహాబలముకల భూతములు, యక్షులు, పిశాచములు, గుహ్యకులు కలరు.

జర్జరేతు వినిక్షిప్తం వజ్రం దైత్య నిబర్హణమ్. 91
తత్పర్వసు వినిక్షిప్తాః సురేంద్రా హ్యమితౌజసః
శిరఃపర్వస్థితో బ్రహ్మా ద్వితీయే శంకరస్తథా. 92
తృతీయేచ స్థితో విష్ణు శ్చతుర్థే స్కందఏవచ
పంచమేచ మహానాగాః శేష వాసుకి తక్షకాః. 93
ఏవం విఘ్నవినాశాయ స్థాపితా జర్జరే సురాః

"ఇంద్రధ్వజమును రక్షించుటకు రాక్షసులను సంహరింపజాలిన వజ్రాయుధము కలదు. ధ్వజముయొక్క వివిధభాగములను అమిత తేజస్సుగల దేవతలు రక్షించెదరు. అగ్రభాగమును బ్రహ్మ, రెండవ వరుసను శివుడు, మూడవదానిని విష్ణువు, నాల్గవదానిని కుమారస్వామి, ఐదవదానిని ఆదిశేషువు, వాసుకి, తక్షకుడు అను మహానాగములు రక్షించగలవు". ఈవిధముగా విఘ్నములను పోగొట్టుటకు జర్జరమున దేవతలు స్థాపింపబడినారు.

రంగపీఠస్య మధ్యేతు స్వయం బ్రహ్మా ప్రతిష్ఠితః. 94
ఇష్ట్యర్థం రంగమధ్యేతు క్రియతే పుష్పమోక్షణమ్
పాతాళవాసినో యేచ యక్ష గుహ్యక పన్నగాః. 95
అధ స్తాద్రంగపీఠస్య రక్షణే తే నియోజితాః

"రంగపీఠముయొక్క మధ్యభాగమున బ్రహ్మయే స్వయముగా ప్రతిష్ఠింపబడియున్నాడు. పూజార్థము రంగ మధ్యభాగమున పూలు వెదజల్లబడుచున్నవి. రంగపీఠముయొక్క క్రింది భాగమును రక్షించుటకు పాతాళలోకవాసులగు పన్నగములు, యక్షులు, గుహ్యకులు నియమించబడినారు."

'నాయకం రక్షతీంద్రస్తు నాయికాంతు సరస్వతీ. 96
విదూషక మథోంకారః శేషాస్తు ప్రకృతీర్హరః
యాన్యేతాని నియుక్తాని దైవతానీహ రక్షణే. 97
ఏతాన్యే వాధిదైవాని భవిష్యంతీ త్యువాచ సః

"ఇంద్రుడు నాయకుని, సరస్వతి నాయికను, ఓంకారము విదూషకుని, శివుడు ఇతర నటీ నటులను రక్షించెదరు. ఈ రక్షణవిధిలో నే యే దేవతలు నియమింపబడినారో వారే ఆ యా భాగముల కధిదేవతలు" అని బ్రహ్మ పలికెను.

ఏతస్మి న్నంతరే దేవైః సర్వై రుక్తః పితామహః. 98

'సామ్నా తావదిమే విఘ్నాః స్థావ్యంతాం వచసా త్వయా

పూర్వం సామప్రయో క్తవ్యం ద్వితీయం దానమేవచ. 99

తయోరుపరి భేదస్తు తతో దండః ప్రయుజ్యతే'

దేవానాం వచనం శ్రుత్వా బ్రహ్మా విఘ్నా నువాచహ. 100

'కస్మా ద్భవంతో నాట్యస్య వినాశాయ సముత్థితాః'

బ్రహ్మణో వచనం శ్రుత్వా విరూపాక్షోఽ బ్రవీ దిదమ్. 101

'దైత్యై ర్విఘ్నగణైస్సార్ధం సామపూర్వ మిదంవచః

యోఽయం భగవతా సృష్టో నాట్యవేదః సురేచ్ఛయా. 102

ప్రత్యాదేశోఽయ మస్మాకం సురార్థం భవతా కృతః

తన్నైతదేవం కర్తవ్యం త్వయా లోక పితామహ. 103

యథా దేవా స్తథా దైత్యా స్త్వత్తః సర్వే వినిర్గతాః'

ఆ తర్వాత దేవతలందరు బ్రహ్మకీరీతిగా విజ్ఞాపన చేసికొనిరి— "సామోపాయముతో మీరే మాటలాడి ఈ విఘ్నముల నాపుజేయించ వలయును. మొదట సామోపాయముతో ప్రయత్నించి, అది విఫలమైన దానముతోను, ఈ రెండును ఫలించనిచో భేదోపాయము తోను, ఈ మూటికి కుదురనిచో దండోపాయముతోనైనను ఈకార్యమును సాధించవలయును."

దేవతలవాక్యమును విని "మీరేకారణమువలన నాట్యవినాశమునకై బయలుదేరినారని" బ్రహ్మ విఘ్నములనెనర్చు దైత్యులను దేశించి పలికెను. ఈ వాక్యమును విని విరూపాక్షుడిట్లు మాటలాడసాగెను—"విఘ్నములతోను, రాక్షసులతోను సామోపాయము ననుసరించి పల్కు చున్నారు. కాని దేవతలప్రార్థన నాలకించి పూజ్యులగు మీచే ఏ నాట్యవేదము సృష్టింపబడినదో అది మాకవమానకరము. ఆ నాట్యవేదమును మీరు కేవలము దేవతలకొరకే నిర్మించినారు. మీరు జగత్తున కంతటికి పితామహులు. దేవతలవలె రాక్షసులుసహితము మీనుండియే జన్మించినారు. కావున ఈ దేవతా పక్షపాతబుద్ధి తగదు."

విఘ్నానాం వచనం శ్రుత్వా బ్రహ్మా వచన మబ్రవీత్. 104

'అలం వో మన్యునా దైత్యా విషాదం త్యజతానఘాః

భవతాం దేవతానాంతు శుభాశుభ వికల్పకః. 105

కర్మ భావాన్వయాపేక్షీ నాట్యవేదో మయా కృతః

నైకాంత తోఽత్ర భవతాం దేవానాం చానుభావనమ్.' 106

విరూపాక్షుని ప్రత్యుత్తరమును విని బ్రహ్మ ఇట్లు పలికెను. "రాక్షసులగు మీ కిక కోపము తగదు. గొప్పవారలగు మీరు విషాదమును వదలిపెట్టవలసినద్ది. మీకు, దేవతలకు

గూడ శుభాశుభ ఫలములను తెల్పునది, కర్మవిపాకమును, భావపరిణామములను చెప్పునది యగు నాట్యవేదమే నాచేత నిర్మింపబడినది. మిమ్ము విడచి కేవలము దేవతలుగాని, దేవతలను విడచి కేవలము మీరేగాని ఈ నాట్యమును అనుభవింపలేరు. మీ ఉభయులకు నిది ముఖ్యమైనది యగుటచే మీరావిధముగా భావింపనక్కరలేదు."

ధర్మాధర్మరూపమగు శుభాశుభఫలమును సుఖదుఃఖాత్మకముగా చూపునది నాట్యవేదము. ఇది కర్మభావాన్వయాపేక్షకము. కర్మయనగా ధర్మాధర్మవిషయమగు కృత్యములు. భావమనగా ఆశయము. అన్వయమనగా సదాచారకులాదికము. వీటన్నిటి సహకారముగలది నాట్యము.

'త్రైలోక్యస్యాస్య సర్వస్య నాట్యం భావానుకీర్తనమ్'

"ముల్లోకములయందు సకలభావములకు అనుకీర్తనమైనది నాట్యము." నాట్యమునకు కావ్యమునకు భేదము లేదు. కావ్యము భావనచే సమున్మిషితము. ఈ అనుభూతిలో విభావాదులకు సాధారణీకరణము కల్గుచున్నది. గుణాలంకార మనోహర శబ్దార్థ శరీరము కలిగి, లోకోత్తరమైన రసమునే ప్రాణముగా గలిగిన కావ్యమున హృదయసంవాదము కలదు. అందు కలుగు చిత్తవృత్తి నటీనటుల చిత్తవృత్తులలో నిమగ్నమగుచున్నది. తద్ద్వారా విషయావలోకనమున దానిలో నంతర్లీనమైన తత్త్వమే అనుభూయమానమగును. ఈ అనుభూతి అలౌకికము, లోకోత్తరమునై లోకోత్తరదర్శనశ్రవణముల నాశ్రయించుకొని వచ్చుచున్నది.

నిర్మలమైన అద్దమువలెనున్న హృదయపద్మముగల సహృదయునకు అభినయముద్వారా తన్మయీభవనము కలుగుచున్నది. ఈ తన్మయీభవనము దేశకాలముల కతీతమగుటచే మిథ్యాసంశయ సంభావనాదులకు విలక్షణమైన జ్ఞానము నొసగజాలినది. రామ రావణాదుల తమయందారోపించుకొని నటులు ప్రయోగకుశలులు కాగా, హృద్యవస్తువులచేత, గీతాతోద్యములచేత సంస్కరింపబడిన మనస్సునకు విషయముతో నభేదబుద్ధి కలుగును. అప్పుడు తన ఆత్మలో, తన ఆత్మద్వారా, సహృదయుడు జగత్తును చూడగలుగుచున్నాడు. కాగా సహృదయుని సంవేదనలో విశ్వమంతయు సంవిజ్జాతీయమగుచున్నది. దీనివలన ఉత్తమకావ్యనాట్యములలో ఆత్మానుభూతియే కలుగునుగనుక నివి ధర్మబాహ్యములు కాజాలవు. అందుచే కావ్యనాట్యముల ననుశీలించుటవలన శుభము నాచరించుట, అశుభము ననాదరించుట కలదు.

ఇట్టి సంవేదనాలాభమువలన నాట్యము భావములకనుకీర్తన మగుచున్నది. అనుకీర్తనమనగా అనువ్యవసాయము. దీనినే స్వసంవేదన మందురు. అనగా కావ్యము జగత్తును అనుకరించునది గాదని భావము. పరుని చేష్టను అనుకరించుట హాస్యలక్షణము. నాట్యము హాస్యప్రాయమైనది కాదని గుర్తుంచుకొనవలయును. రాముని శోకమునకు సదృశమగు శోకమును నటుడభినయించుటలేదు. రాముని శోకమునకు సజాతీయమగు శోకమునే నటుడభినయించుచున్నాడు గాని, దానికి సదృశమగు దుఃఖమును గాదు.

స్వశరీరముపైని యభిమానము, దేశకాలోపహితత్వము, నటునకాహార్యముచే నివర్తింపబడుచున్నవి. రామాది శబ్దములచే నటుడు వ్యవహరింపబడుచున్నాడు. హృద్యములగు

గీతాదులు వెంటరా నటుడు ప్రయోగవశగతు డగును. అప్పుడు నాలుగు విధములగు అభినయములతో నటుని స్వరూపము మరుగుబడగలదు. అట్టి నటుడు హృదయసంవాదమును తెచ్చి తన్మయీభవనము కలుగజేయజాలినవా డగును. ఆ నటుని ప్రయోగములో కన్పించు సుఖదుఃఖాకారమగు చిత్తవృత్తిరూపముచే నావిష్టమైన స్వసంవిదానందప్రకాశమయమైనదే నాట్యము. అందుచే నీ నాట్యము విచిత్రమై, అలౌకికానందమయమగు రసాస్వాదమును కలుగజేయుచున్నది. ఇటువంటి ఆనందము ననుభవింపజేయగల్గిన వస్తువును నాట్య మందురు. ఈ నాట్యయు జ్ఞానాకారము.

'క్వచి ద్ధర్మః క్వచి త్క్రీడా క్వచిదర్థః క్వచిచ్ఛమః. 107
క్వచిద్ధాస్యం క్వచిద్యుద్ధం క్వచిత్కామః క్వచిద్వధః
ధర్మో ధర్మ ప్రవృత్తానాం కామః కామోపసేవినామ్. 108
నిగ్రహో దుర్వినీతానాం వినీతానాం దమక్రియా
క్లీబానాం ధార్ష్ట్య జనన ముత్సాహః శూరమానినామ్. 109
అబుధానాం విబోధశ్చ వైదుష్యం విదుషామపి
ఈశ్వరాణాం విలాసశ్చ స్థైర్యం దుఃఖార్దితస్యచ. 110
అర్థోపజీవినా మర్థో ధృతి రుద్విగ్న చేతసామ్
నానాభావోప సంపన్నం నానావస్థాంతరాత్మకమ్. 111
లోకవృత్తానుకరణం నాట్యమేత న్మయా కృతమ్.

ముల్లోకములలోని భావములు నాట్యమున కలవని చెప్పబడినది. అవి ఏరీతిగా కలవో చెప్పచున్నాడు. "కొన్ని నాటకములలో ధర్మము, కొన్నింట క్రీడ, మరికొన్నిటిలో అర్థము, వేరొకచో శమము, మరొక్కచో హాస్యము, ఇతరత్ర యుద్ధము, ఇంకొకచో కామము, అన్యత్ర వధ ప్రధానముగా గలవు."

ధర్మార్థములుగలచోట్ల ఉత్సాహము, క్రీడగలనాట్యమున విస్మయము, శమమున్నచోట నిర్వేదాదులు, హాస్యమున్నచోట హాసము, యుద్ధము చెప్పినవేళ రౌద్రాదులు, కామమును పల్కినచోట రతి, వధ యున్నచోట క్రోధ, భయ, జుగుప్సా, శోకములు అనునవి స్థాయి భావములుగా కన్పించగలవు. ధర్మప్రధానమైనది నాటకముగాని, ప్రకరణముగాని యగును. క్రీడాప్రధానమైనది భాణము, అర్థప్రధానమైనది ప్రకరణము అని వ్యాఖ్య చేసికొనవలెను. ధర్మప్రధానమైనది ఛలితరామ మనబడు నాటకము. స్వప్న వాసవదత్త క్రీడాప్రధానమైనది. ఇట్లే మిగిలినవాటికి ఉచితములగు ఉదాహరణలను గ్రహించవలెను. మరియును ఒకే నాటకములో ఈ వివిధ విషయములు కన్పించగలవు. అట్టిదే అభిజ్ఞాన శాకుంతలము.

"ధర్మప్రవృత్తి గలవారికి ధర్మము, కాముకులకు కామము, దుష్టులకు నిగ్రహము, వినీతులకు దమము నాట్యమున కన్పించ గలవు. నపుంసకులకు ధార్ష్ట్యము కలుగగలదు. మానవంతులగు శూరులకు ఉత్సాహము, తెలివి లేనివారికి విబోధము, విద్వాంసులకు

స్మృతి, మతి మొదలైనవి, ప్రభువులకు విలాసము, దుఃఖముతో క్రుంగి కృశించువారికి వ్యవసాయాత్మకమగు ఉత్సాహము, ధనమునకై ప్రాకులాడువారికి ధనము, చిత్తక్షోభగల వారికి ధైర్యము నాట్యమున, కావ్యమున గలవు. కావున వివిధభావములతో కూడినది, సకల అవస్థా సన్నివేశములతో నున్నది, లోకవృత్తము ననుకీర్తనము చేయునదియు నగు నాట్యము బ్రహ్మచే నిర్మింపబడినది."

'ఉత్తమాధమ మధ్యానాం నరాణాం కర్మసంశ్రయమ్. 112
హితోపదేశ జననం ధృతి క్రీడా సుఖాదికృత్
దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినామ్. 113
విశ్రాంతి జననం కాలే నాట్యమేత ద్భవిష్యతి
ధర్మ్యం యశస్య మాయుష్యం హితం బుద్ధివివర్ధనమ్. 114
లోకోపదేశ జననం నాట్యమేత ద్భవిష్యతి

"ఉత్తములు, మధ్యములు, అధములు నగు మానవులకందరకు నాట్యము వారు వారు చేయవలసిన కృత్యములను, విధులను తెలుపునది. హితోపదేశకరమగుచున్నది. ధైర్యమును, క్రీడకుపకరించు విస్మయోత్సాహములను, సుఖమును కలుగజేయునది. దుఃఖముచేత, శోకము చేత, శ్రమవలన క్షోభించువారికి, తపస్యులకు నాట్యము విశ్రాంతినొసగి వారి వారి కష్టము లను, దుఃఖములను నివారింపగలదు. ధర్మమునకు విరుద్ధముకానిది, లోకములో ప్రసిద్ధిచెందు టకు హేతుభూతమగు విషయమును చూపునది, ఆయుర్వృద్ధికరము, హితకరము, బుద్ధిని వృద్ధిని పొందింపజేయునది నాట్యము. కావ్యనాట్యములు గురువువలె ఉపదేశము చేయవు: కాని బుద్ధిని నిర్మలముచేసి, వృద్ధిపొందునట్లు చేయగలవు. ఈ విధముగా ప్రజలకు మంచి ఉపదేశము నీయజాలినది నాట్యము."

మహత్తరమైన తత్త్వము ఆత్మరూపమున, అనగా సంవిద్రూపమున, కావ్యనాట్యము లలో భాసించును. ఈ తత్త్వమునకు మించిన ధర్మము లేదుగనుకనే కావ్యనాట్యములలో కన్పించు విషయము భావనావాహినిలో పరిష్కృతమై లోకోత్తరమైన ధర్మోపదేశరూపమున సహృదయులచే గ్రహింపబడుచున్నది.

'నత జ్ఞానం నత చ్ఛిల్పం నసా విద్యా నసా కలా. 115
నాసౌ యోగో నతత్కర్మ నాట్యేఽస్మి న్యన్నదృశ్యతే

"సప్తద్వీపములలోను, ముల్లోకములలోను గల భావముల కనుకీర్తనరూపమగు నాట్య మున నేది హృదయగోచరము కాదో అట్టి జ్ఞానము, శిల్పము, విద్య, కళలు, యోగము, కర్మలు లేనే లేవు."

జ్ఞానమనగా ఆత్మజ్ఞానము. శిల్పమనగా మాలా చిత్ర పుస్తాది యోజనము. దండనీతి మొదలగునవి విద్యలు. గీతవాద్యాదికములు కళలు. పై నాల్గింటిని చక్కగా యోజించుటయే యోగము. యుద్ధ నియుద్ధాది వ్యాపారమే కర్మ. ఇవన్నియు కావ్యజగత్తునుండి, అనగా

భావనావాహినినుండి, వ్యావహారికజగమును చేరుచున్నవిగనుక లౌకికజగత్తునకు కావ్యజగమే మాతృక యగుచున్నది. తద్విపర్యయము కాదని తెలియవలెను.

"తన్నాత్ర మన్యుః కర్తవ్యో భవద్భి రమరాన్ప్రతి. 116
సప్తద్వీపానుకరణం నాట్యమేత ద్భవిష్యతి
యేనానుకరణం నాట్య మేతత్తద్య న్మయా కృతమ్. 117
దేవానా మసురాణాంచ రాజ్ఞా మథ కుటుంబినామ్
బ్రహ్మర్షీణాంచ విజ్ఞేయం నాట్యం వృత్తాంత దర్శకమ్. 118

"అందువలన రాక్షసులగు మీరు దేవతలనుచూచి కోపగించనక్కరలేదు. నాట్యమున దేవతల ప్రసక్తియేలేదు. వారికి ప్రాధాన్యము లేదు. ఏడుద్వీపములలోని భావములకు ననుకీర్తన మైనది నాట్యము. అట్టి నాట్యమే నాచే నిర్మింపబడినది. దేవతలు, రాక్షసులు, రాజులు, గృహస్థులు, బ్రహ్మర్షులు అనువారల వృత్తాంతమును చూపునదియే నాట్యమని తెలసికొనవలెను."

నాట్యము దేవతలకొరకే చేయబడినదని, రాక్షసుల నవమానపరచునదని చెప్పిన వాక్యములకీ పంక్తులలో బ్రహ్మచే చక్కని సమాధానమీయబడినది.

'యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖ సమన్వితః
సోఽఙ్గా ద్యభినయోపేతో నాట్యమిత్యభిధీయతే. 119

"సుఖదుఃఖములతో కలసియున్న ఈ లోకముయొక్క స్వభావము ఆంగికాది అభినయములతో అన్వితముకాగా నాట్యమని పిలువబడుచున్నది."

లోకస్వభావము కేవలము సుఖాత్మకముకాదు, కేవలము దుఃఖాత్మకముగూడ కాదు. సుఖదుఃఖములు రెండును అతి సన్నిహితసంబంధము కలిగియుండును. నాట్యముకూడ సుఖ దుఃఖములతో పూర్తిగా సమ్మిశ్రితమై యున్నది. రతి, హాస, ఉత్సాహ, విస్మయము లను స్థాయిభావములు సుఖస్వభావముతో భాసించునవి యని మనమనుకొనుట గలదు. కాని రతి స్థాయిభావములో అన్యవిషయములపై కొంత ద్వేషము, ప్రేమించినవిషయమున కేమి వాటిల్లునో యను భయము, అపాయభీరుత్వము కన్పించుటచే కొంత దుఃఖాంశ గలదు. తాత్కాలికమైన స్వల్పదుఃఖముకూడ హాసమున గలదు. తాత్కాలిక దుఃఖాయాసములు ఉత్సాహమందు, క్షణికసుఖము విస్మయమున కన్పించుచున్నవి. క్రోధ, భయ, శోక, జుగుప్స లను స్థాయిభావములు దుఃఖాత్మకములని అందరకు తెలసిన విషయమే. భావనాకాంక్షయే ప్రాణముగా గలిగి సుఖదుఃఖానువేధతోనున్నది క్రోధము. కలిగిన తాత్కాలికదుఃఖమును పోగొట్టుకొనవలె నను కాంక్షతో సుఖమును భావించుట భయావస్థలో కన్పించుటచే నిచటగూడ సుఖాంశగలదని స్పష్టమగుచున్నది. తన అభీష్టవిషయము నశించుటవలన జన్మించి, గతించిన సుఖస్మరణతో నుండునది శోకము. జుగుప్సలో సహితమిట్లే సుఖాంశ కొంత గలదు. ఇదే రీతిగా సంచారిభావములలో కూడ సుఖదుఃఖములు రెండును కలవు. కావున సంవిత్సంవేదనలోని ఈ భావములన్నియు సుఖదుఃఖాత్మకములని సిద్ధమగుచున్నది.

సుఖదుఃఖాత్మకములైన ఈ భావములే నాట్యమునగూడ అంగాద్యభినయాత్మకములై కన్పించుచున్నవి. ఆంగికాద్యభినయము ద్వారా ప్రత్యక్షముగా భాసించునవి భావములు. ఈ భావములను సామాజికులనబడు ప్రేక్షకులకభిముఖముగా తెచ్చి, వారి హృదయానుప్రవేశమున కుపకరించునది అభినయమనబడుచున్నది. విభావ, అనుభావ, వ్యభిచారి భావముల సంయోగముచే శృంగారాది రసములు సిద్ధించుచున్నవని మున్నెందు చెప్పబడగలదు. అభినయము ద్వారా శృంగారాది రసములు సంవిద్దర్పణము నావహించగలవు కనుకనే నాట్యము ధర్మామ్నాయరూపమని చెప్పబడుచున్నది. అట్టి ధర్మామ్నాయము సుఖదుఃఖములతో పూర్తిగా నన్వితమైనది.

"వేదవిద్యేతి హాసానా మాఖ్యాన పరికల్పనమ్
వినోదజననం లోకే నాట్యమేత ద్భవిష్యతి." 120

"వేదవిద్యలయందు, ఇతిహాసములయందు గల కథా భాగములను ప్రయోగించు నాట్యము లోకములో వినోదజనకము కాగలదు."

ఏతస్మి న్నంతరే దేవాః సర్వానాహ పితామహః
'క్రియతా మద్య విధివ ద్యజనం నాట్యమండపే. 121
బలిప్రదానై ర్హోమైశ్చ మంత్రౌషధి సమన్వితైః
జప్యై ర్భక్ష్యైశ్చ పానైశ్చ బలిః సముపకల్ప్యతామ్. 122
మర్త్యలోకగతాః సర్వే శుభాం పూజా మవాప్స్యథ

ఆ తర్వాత దేవతలనందర నుద్దేశించి బ్రహ్మ మరల ఇట్లు పలికెను— "మంత్రములతోను, ఓషధీలతలతోను కూడినవి యగు బలిప్రదానములచేత, హోమములచేత విధిపూర్వకముగా నాట్యమండపమున యాగమును చేయింపవలెను. జపములతోను, పిండివంటలతోను, పానీయములతోను, బలిప్రదానాదులను చేయింపవలెను. శ్రేష్ఠుడగువాడేదిచేసిన దాని నితరులాచరించుట గలదు కనుక దేవతలు నాట్యమండపమున నీయాగమును జేసినచో భూలోకమందలి మానవులందరు చక్కగా నాట్యరంగమును పూజింపగలరు. మానవులట్టి పూజను చేసి శుభమును పొందెదరు గాక."

'అపూజయిత్వా రంగంతు నైవ ప్రేక్షాం ప్రవర్తయేత్. 123
అపూజయిత్వా రంగంతు యః ప్రేక్షాం కల్పయిష్యతి
తస్య తన్నిష్ఫలం జ్ఞానం తిర్యగ్యోనించ యాస్యతి. 124
యజ్ఞేన సమ్మితం హ్యేత ద్రంగ దైవత పూజనమ్
తస్మా త్సర్వప్రయత్నేన కర్తవ్యం నాట్యయోక్తృభిః.' 125

"నాట్యరంగమును పూజింపక ప్రేక్షకులకు నాట్యప్రయోగమును చూపరాదు. అట్లు పూజింపకయే నాట్యప్రయోగమును గావించినచో అట్టివాని జ్ఞానము ఫలరహితమగుటయే

గాక వాడు పశువై జన్మించగలడు. నాట్యరంగమందలి దేవతలను పూజించుట యజ్ఞమువంటి దగుటచేత ఎంత ప్రయత్నమునైనను చేసి నాట్యాచార్యుడు రంగపూజను చేసితీరవలయును."

'న ర్తకోఽర్థపతి ర్వాపి యః పూజాం న కరిష్యతి
నకార యిష్యత్య న్యైర్వా ప్రాప్నో త్యపచయంతు సః. 126
యథావిధి యథాదృష్టం యస్తు పూజాం కరిష్యతి
స లప్స్యతే శుభా నర్థా న్స్వర్గలోకంచ యాస్యతి'. 127
ఏవముక్త్వాతు భగవాన్ ద్రుహిణః సర్వదైవతైః
రంగపూజాం కురుష్వేతి మామేవం సమచోదయత్. 128

ఇతి శ్రీభారతీయే నాట్యశాస్త్రే నాట్యోత్పత్తిర్నామ ప్రథమోఽధ్యాయః.

"నటుడుగాని, నాట్యగృహమును పోషించు ధనాధిపతిగాని రంగదైవతపూజ చేయక పోయినను, లేక చేయించకపోయినను నాశనమును పొందగలడు. విధిప్రకారము, ఆచారము ననుసరించి ఎవడైతే ఈ పూజను చేయునో అట్టివాడు శుభఫలములను పొంది, అనుభవించి, చివరకు స్వర్గలోకమున నివసించగలడు" అని దేవతలకందరకు బ్రహ్మ చెప్పి, తర్వాత భరతుని చూచి "రంగపూజను చేయుము" అని ఆదేశించెను.

ఇది భరతముని ప్రణీతమగు నాట్యశాస్త్రమున ఆంధ్రభారతియందు
నాట్యోత్పత్తి యనబడు మొదటి అధ్యాయము.

## ద్వితీయోఽధ్యాయః

భరతస్య వచః శ్రుత్వా ప్రత్యూచు ర్మునయ స్తతః
'భగవాన్ శ్రోతుమిచ్ఛామో యజనం రంగసంశ్రయమ్. 1
అథవా యాః క్రియా స్తత్ర లక్షణం యచ్చ పూజనమ్
భవిష్యద్భి ర్నరైః కార్యం కథం తన్నాట్యవేశ్మని. 2
ఇహాది ర్నాట్యయోగస్య నాట్యమండపఏవహి
తస్మా త్తస్యైవ తావ త్త్వం లక్షణం వక్తు మర్హసి.' 3

భరతుని మాటలను వినిన తర్వాత మునులిట్లనిరి— "పూజ్యుడా, నాట్యరంగము నుద్దేశించి చేయవలసిన యాగవిధిని వినగోరియున్నాము. నాట్యమండపము లేనిది రంగపూజయే కుదురదు గనుక మండపము నెట్లు చేయవలెను ? దాని లక్షణమేమి? పూజావిధానమేమి ? నాట్యగృహమున మున్ముందు మానవులేవని నెట్లు చేయవలెను ? నాట్యోత్పత్తికి ప్రారంభమే నాట్యమండపము గదా. కావున మీరు నాట్యమండపముయొక్క లక్షణాదికము నంతయు చెప్పవలయును."

తేషాంతు వచనం శ్రుత్వా మునీనాం భరతోఽబ్రవీత్
'లక్షణం పూజనంచైవ శ్రూయతాం నాట్యవేశ్మనః. 4
దివ్యానాం మానసీసృష్టి ర్గృహేషూ పవనేషుచ
నరాణాం యత్నతః కార్యా లక్షణాభిహితాః క్రియాః. 5
శ్రూయతాం తద్యథా యత్ర కర్తవ్యో నాట్యమండపః
తస్య వాస్తుచ పూజాచ యథాయోజ్యా ప్రయత్నతః.' 6

ఆ మునుల వాక్యములను విని భరతుడిట్లు సమాధానమిచ్చెను— "సంకల్పమాత్రము చేత దేవతలు గృహములను, ఉపవనములను సృష్టించుకొనగలుగుచున్నారు. ఐనను సంకల్పించిన విషయమును నిర్మించుటకు జ్ఞానము పేక్షితము. కావున చెప్పబోవు నాట్యమండప నిర్మాణ విధి మానవులకు, దేవతలకుగూడ అవసరము. నాట్యమండపము నే యేలక్షణముల ననుసరించి నిర్మించవలెనో అట్లు మానవులు ప్రయత్నించి చేయవలెను. కావున నాట్యగృహముయొక్క వాస్తులక్షణమును, పూజా విధిని వినవలసియున్నది."

ఇహ ప్రేక్షాగృహం దృష్ట్వా ధీమతా విశ్వకర్మణా
త్రివిధః సన్నివేశశ్చ శాస్త్రతః పరికల్పితః. 7
వికృష్ట శ్చతురశ్రశ్చ త్ర్యశ్రశ్చైవ తు మండపః
తేషాం త్రీణి ప్రమాణాని జ్యేష్ఠం మధ్యం తథావరమ్. 8
ప్రమాణ మేషాం నిర్దిష్టం హస్త దండ సమాశ్రయమ్

బుద్ధిశాలియగు విశ్వకర్మ నిర్మించిన నాట్యగృహమును చూచి శాస్త్రకారులు మూడు విధములగు నాట్యగృహములను శాసించినారు. దీర్ఘ చతుస్రాకారమున నుండునది

వికృష్టమని, సమచతురముగా నుండునది చతురస్రమని, త్రికోణాకారముగా నుండునది త్ర్యస్రమని పిలునబడుచున్నది. ఒక్కొక్కదానిలో మరల జ్యేష్ఠము, మధ్యము, అధమము అని మూడువిధములగు నాట్యగృహము లేర్పడగలవు. కాగా వికృష్టమగు నాట్యగృహములు మూడు, చతురస్రములు మూడు, త్ర్యస్రములు మూడు కలసి తొమ్మిది యేర్పడుచున్నవి. వీటి కొలతలను మూరలలోను, బారలలోను ఇచ్చుచున్నారు.

అణూ రజశ్చ వాలశ్చ లిక్షా యూకా యవ స్తథా. 9
అంగుళంచ తథాహస్తో దండశ్చైవ ప్రకీర్తితః
అణవోఽష్టౌ రజః ప్రోక్తం తాన్యష్టౌ వాల ఉచ్యతే. 10
వాలా స్త్వష్టౌ భవే ల్లిక్షా యూకా లిక్షాష్టకం భవేత్
యూకా స్త్వష్టౌ యవో జ్ఞేయో యవా స్త్వష్టౌ తథాంగులమ్. 11
అంగుళాని తథా హస్త శ్చతుర్వింశతి రుచ్యతే
చతుర్హస్తో భవేద్దండో నిర్దిష్టస్తు ప్రమాణతః. 12
అనేనైవ ప్రమాణేన వక్ష్యామ్యేషాం వినిర్ణయమ్

మూర యనగా ఎంత యుండునో, బార యనగా ఎంత యుండునో నిశ్చయించుటకు ఈకొలతలలోని విభిన్న సన్నివేశములు చెప్పబడుచున్నవి. అణువు, రజము, వాలము, లిక్ష, యూక, యవ, అంగుళము, హస్తము, దండము అను తొమ్మిది కొలతలు కలవు. కంటికి సూక్ష్మాతి సూక్ష్మముగా కన్పించునది అణువు. అట్టి ఎనిమిది అణువులు ఒక రజ మగును. ఎనిమిది రజములొక వాలము. ఎనిమిది వాలము లొక లిక్ష. ఎనిమిదిలిక్ష లొక యూక. ఎనిమిది యూక లొక యవ. ఎనిమిది యవలొక అంగుళము. ఇరువదినాలు అంగుళములొక హస్తము లేక మూర. నాలు హస్తములు ఒక దండము లేక బార యని భావము. ఈ విధమైన మూర, బారల కొలతలతో నాట్యమండపముల పరిమాణములు చెప్పబడగలవు.

శతంచాష్టౌ చతుఃషష్టి ర్హస్తా ద్వాత్రింశ దేవవా. 13
అష్టాధికం శతం జ్యేష్ఠం చతుఃషష్టిస్తు మధ్యమమ్
కనీయస్తు తథా వేశ్మ హస్తా ద్వాత్రింశ దిష్యతే. 14

నూట ఎనిమిది మూరలు పొడవుగల నాట్యగృహమును జ్యేష్ఠమని, అరువదినాలుగు మూరలు పొడవుగలది మధ్యమమని, ముప్పదిరెండు మూరలు పొడవుగలది అధమ మని చెప్పబడుచున్నది.

దేవానాంతు భవే జ్జ్యేష్ఠం నృపాణాం మధ్యమం భవేత్
శేషాణాం ప్రకృతీనాంతు కనీయః సంవిధీయతే. 15
ప్రమాణం యచ్చ నిర్దిష్టం లక్షణం విశ్వకర్మణా
ప్రేక్షాగృహాణాం సర్వేషాం తచ్చైవహి నిబోధత. 16

దేవతాదులను నాట్యరూపమున ప్రయోగించుటకు జ్యేష్ఠమనబడు నాట్యగృహము కావలెను. నృపతిప్రాయులను ప్రయోగించు నాటకాదులకు మధ్యమపరిమాణముగల నాట్య

గృహ మవసరము. మిగిలిన సామాన్యప్రజలనే చూపు భోగ ప్రహసనాదులకు అధమ మన బడు నాట్యగృహము కావలెను. కనుక సకలప్రేక్షాగృహములకు విశ్వకర్మచే నిర్దేశించబడిన లక్షణముల నిక వినవలసినది.

చతుఃషష్టికరాన్ కుర్యా ద్దీర్ఘత్వేన తు మండపమ్
ద్వాత్రింశతంచ విస్తారాన్ మర్త్యానాం యో భవేదిహ. 17
అతఊర్ధ్వం నకర్తవ్యః కర్తృభి ర్నాట్యమండపః
యస్మా దవ్యక్తభావంహి తత్రనాట్యం వ్రజేదితి. 18
మండపే విప్రకృష్టేతు పాఠ్య ముచ్చరితస్వరమ్
అనిస్సరణధర్మత్వా ద్విస్వరత్వం భృశం వ్రజేత్. 19
యశ్చా ప్యాస్య గతో భావో నానాదృష్టి సమన్వితః
స వేశ్మనః ప్రకృష్టత్వా ద్వ్రజే దవ్యక్తతాం పరామ్. 20
ప్రేక్షాగృహాణాం సర్వేషాం తస్మా న్మధ్యమ మిష్యతే
యావ త్పాఠ్యంచ గేయంచ తత్ర శ్రవ్యతరం భవేత్. 21

నాట్యగృహముయొక్క పొడవు అరువదినాలుగు మూరలు. ఇందులో సగభాగము ముప్పదిరెండు మూరలు మానవుల నాట్యమండపము కాగలదు. నాట్యమండపము నింతకన్న పెద్దదిగా నిర్మించినచో నాట్యము అవ్యక్తము కాగలదు. నాట్యమండపము చాల పెద్దదిగా యున్నచో అతి ప్రయత్నముతో పాఠ్యము బిగ్గరగా ఉచ్చరింపబడినను దూరమున కూర్చొని యున్న సామాజికులకు వినబడకయుండును. నాట్యమండపము చాల చిన్నదైనచో శబ్దము ప్రతిధ్వనించి మాధుర్యమును కోల్పోవగలదు. మండపము పెద్దదైనచో ముఖములోనభివ్యక్తము లగు నానాదృష్టిసమన్వితములైన భావములు అవ్యక్తమగును. జ్యేష్ఠపరిమాణముగల నాట్య గృహమున నాటకాదులను ప్రయోగించుటకు సౌకర్యము లేకపోవుటచేతను, మధ్యమనాట్య గృహముననే పాఠ్యగేయములు చక్కగా వినిపించగలవు గనుకను నాట్యగృహములన్నిటిలోను మధ్యమ పరిమాణముగల నాట్యమండపమే శ్రేష్ఠమైనది.

దేవానాం మానసీ సృష్టి ర్గృహే షూ పవనేషుచ
యత్న భావాద్వినిష్పన్నాః సర్వే భావాహి మానుషాః. 22
తస్మా ద్దేవకృతై ర్భావై ర్న విస్పర్ధేత మానుషః
మానుషస్యతు గేహస్య సంప్రవక్ష్యామి లక్షణమ్. 23

దేవతలు సంకల్పమాత్రముచేత తమ తమ మనస్సులతో గృహములను, ఉపవనము లను సృష్టించుకొనగలుగుచున్నారు. అట్టివారు నాట్యమండపమును సహితము సృష్టించగలరు కదా! సర్వవిషయములు మానవులకు ప్రయత్నలభ్యములు. ప్రయత్నముతో నీ నాట్య గృహము నిర్మించవలసినవారు మానవులు. కావున దేవతాకృత్యములనుగూర్చి మానవులు స్పర్ధవహించరాదు. అందువలన మానవుల కుపకరించు నాట్యగృహముయొక్క లక్షణములిక చెప్పబోవుచున్నాడు.

భూమే ర్విభాగం పూర్వంతు పరీక్షేత ప్రయోజకః
తతో వాస్తుప్రమాణేన ప్రారభేత యదృచ్ఛయా. 24
సమా స్థిరాచ కఠినా కృష్ణా గౌరీచ యా భవేత్
భూమిస్తత్రైవ కర్తవ్యః కర్తృభి ర్నాట్యమండపః 25

నాట్యగృహమును నిర్మింపదలచిన భూప్రదేశమును నాట్యాచార్యుడు చక్కగా పరీక్షచేసి, వాస్తుప్రమాణముతో గృహనిర్మాణకృత్యమును శుభసమయమున ప్రారంభించవలెను: నిమ్నోన్నతములు లేనిది, చలించని స్వభావము కలది, చవుడునేల కానిది, తెలుపు లేక నలుపురంగుతో నున్నది యగు భూమియందు నాట్యమండపమును నిర్మించవలెను.

ప్రథమం శోధనంకృత్వా లాంగలేన సముత్కృషేత్
అస్థి కీల కపాలాని తృణ గుల్మాంశ్చ శోధయేత్. 26
శోధయిత్వా వసుమతీం ప్రమాణం నిర్దిశేత్తతః
పుష్య నక్షత్రయోగేన శుక్లసూత్రం ప్రసారయేత్. 27

మొట్టమొదట భూమిని శుద్ధిపరచి, తర్వాత నాగలితో దున్ని, అందలి ఎముకలు, మేకులు, పుర్రెలు, చెట్లవేరులు, ముళ్లు మొదలగువానిని తీసివేయవలెను. దీనితో నా భూమికి బాహ్యాభ్యంతరములలో శుద్ధి కలుగగలదు. భూ శుద్ధియైన తర్వాత, పుష్యమీనక్షత్రమున తెల్లని సూత్రమును చాచి, నాట్యగృహమునకు కావలసిన ప్రమాణములను పట్టవలెను.

కార్పాసం బాల్బజం వాపి మౌంజం వాల్కలమేవచ
సూత్రం బుధైస్తు కర్తవ్యం యస్యచ్ఛేదో నవిద్యతే. 28
అర్ధచ్ఛిన్నే భవేత్సూత్రే స్వామినో మరణం ధ్రువమ్
త్రిభాగచ్ఛిన్నయా రజ్జ్వా రాజకోపో విధీయతే. 29
ఛిన్నాయాంతు చతుర్భాగే ప్రయోక్తుర్నాశ ఉచ్యతే
హస్తాత్ప్రభ్రష్టయావాపి కశ్చిత్త్వపచయో భవేత్. 30
తస్మాన్నిత్యం ప్రయత్నేన రజ్జుగ్రహణ మిష్యతే
కార్యం చైవ ప్రయత్నేన మానం నాట్యగృహస్యతు. 31

నూలుతోగాని, నారతోగాని చేయబడి, తెగిపోనటువంటి దారమును కొలతలకు పట్టవలెను. ఈ దారము సగములో తెగిపోయిన సభాపతి మరణించగలడు. మూడవభాగమున తెగిన రాజకోపమునకు నాట్యగృహము గురికాగలదు. నాల్గవభాగమున తెగిన నాట్యాచార్యుడు నశించగలడు. ఒకవేళ చేతినుండి జారి పడిపోయినను నాశము కలుగగలదు. కావున శ్రద్ధతో, ప్రయత్నపూర్వకముగా నీ సూత్రమును పట్టుకొని నాట్యగృహముయొక్క కొలతలను పట్టవలయును.

ముహూర్తే నానుకూలేన తిథ్యా సుకరణేనచ
బ్రాహ్మణాం స్తర్పయిత్వాతు పుణ్యాహం వాచయేత్తతః. 32
శాంతితోయం తతో దత్త్వా తతః సూత్రం ప్రసారయేత్

అనుకూలమగు ముహూర్తములయందు శుభతిథి శుభకరణములను చూచి, బ్రాహ్మణులను చక్కగా తృప్తిపరచి, పుణ్యాహవచనములు చెప్పిన తర్వాత, శాంత్యుదకములను చల్లి, కొలతదారముతో కొలతలు పట్టవలయును.

చతుష్షష్టికరాన్ కృత్వా ద్విధా భూతాన్ పునస్తతః. 33
పృష్ఠతో యో భవేద్భాగో ద్విధాభూతస్య తస్యతు
సమ మర్ధవిభాగేన రంగశీర్షం ప్రకల్పయేత్. 34
పశ్చిమేచ విభాగేఽథ నేపథ్యగృహ మాదిశేత్

ఇక వికృష్టమనబడు నాట్యగృహములలో మధ్యమ పరిమాణము గల గృహమునకు కొలతల నిచ్చుచున్నాడు.

వికృష్ట నాట్యమండపముయొక్క పొడవు అరువదినాలుగు మూర లుండును. తూర్పు ప్రక్కనుంచి దారమును పట్టవలెను. ఈ దారముతో అరువదినాలుగు మూరలను రెండు సగ భాగములు చేయగా తూర్పునగల ముప్పదిరెండు మూరల ప్రదేశమున ప్రేక్షకులు కూర్చొందురు. మిగిలిన ముప్పది రెండు మూరలు నాట్యమండపమునకు రాగలవు. దీని వెడల్పు ముప్పదిరెండు మూర లుండును.

మున్ముందు 2 అ. 63 వ శ్లోకమున రంగపీఠప్రసక్తి గలదు. ఇచ్చట రంగశీర్ష ప్రసంగము గలదు. రంగపీఠ, రంగశీర్షములకు భేదమున్నదా, లేదా? వికృష్టమండప నిరూపణలో రంగశీర్షమునకే స్వరూప ప్రమాణాదికమును చెప్పినాడు. రంగపీఠ శబ్దమును "రంగపీఠస్య పార్శ్వేతు", "రంగపీఠప్రమాణతః", "రంగపీఠం తతః కార్యం" అని మూడుతడవలు ప్రయోగించినాడు. మొదటి రెండు ప్రయోగములలో అనువాదరూపమున నిర్దిష్టమై రంగపీఠము కన్పించుటచే దీని విధానమును మొదట చెప్పవలసి యున్నది. కాని ఇచ్చట రంగశీర్షవిధానమే కన్పడుచున్నది. అందుచే రంగపీఠ రంగశీర్షములు భిన్నమైనవి కావని సిద్ధమగును. ఇవి రెండును భిన్నములైనచో వికృష్టమండపమున రంగపీఠముయొక్క స్థానప్రమాణాదికము చెప్పబడవలసియున్నది. కాని భరతుడు వచించలేదు. చతురశ్ర, త్ర్యశ్ర మండపములలో రంగపీఠవిధానమునే నిర్వచించియున్నాడు. కేవలము వికృష్టమండపముననే రంగశీర్షముండునని కూడ చెప్పవీలులేదు. 2 అ. 99, 100 శ్లోకములలో చతురశ్రమునగూడ రంగశీర్షమును విధించినాడు. పైగా నేపథ్యగృహమునుండి వికృష్టమండపములో రంగశీర్షమును ప్రవేశించుటకు, చతురశ్ర త్ర్యశ్రమండపములలో రంగపీఠమును ప్రవేశించుటకు, ద్వారములను విధించుచు, రంగపీఠ రంగశీర్షములకు తాదాత్మ్యమునే గ్రహించినాడు.

కావున రంగపీఠ రంగశీర్షములు భిన్నములని చెప్ప వీలున్నదా? "రంగపీఠం తతః కార్యం విధి దృష్టేన కర్మణా రంగశీర్షంతు కర్తవ్యం" అనుచో వీటికి వైలక్షణ్యము కన్పించుచున్నది. "సమున్నతం సమంచైవ" అనుచో వికృష్టమండపమున రంగపీఠముకన్న రంగశిరస్సు ఎత్తుగా ఉండవలెనని కలదు. "సమ మర్ధ విభాగేన" అనుచో ఎనిమిదిమూరల పొడవుగల రంగశీర్షమును నిర్మించవలెనని కలదు. కావుననే "రంగపీఠే కర్తవ్యే రంగశిరస్థానదాహ రంగశీర్ష

మితి" అని, "రంగపీఠ తచ్ఛిరసో ర్వక్తవ్యశేషం నిరూపయతి" అని మొదలుగాగల వాక్యములలో అభినవగుప్తుడుకూడ రంగపీఠము వేరు, రంగశీర్షము వేరు అని గ్రహించినట్లున్నది. ఈ రెంటికి ప్రయోజనభేదమునుగూడ చెప్పినాడు. పాత్రలవిశ్రాంతికి, ప్రవేశించువారి గోపనకు, రంగమునకు శోభను తెచ్చుటకు రంగశిరస్సును నిర్మించవలెనని వ్యాఖ్యానించినాడు. అనగా మొదట నర్తనాదికముచే శ్రాంతులై మరల అభినయాంతర ప్రయోగమునకు రంగపీఠమును ప్రవేశించుటకు, అంకమధ్యమున అపటీక్షేపము మొదలగువాని ద్వారా ప్రవేశించు పాత్రల గోపనకు, ఉద్యానవన పత్తన జలాశయ పర్వతాది విభావములను సాక్షాత్తుగా ప్రదర్శించుటకు, రంగశోభా జననమునకు, రంగశీర్షము కలదని భావము. గాయక, వైణికా ద్యుపరంజకవర్గ మీరంగశిరస్సున ఉండును. రంగపీఠముననే గాయకాదులకు నివేశనమున్నచో పాత్రాంతర ప్రవేశ పరిక్రమణాదుల కవకాశమే ఉండదు.

ఇట్టిచో రంగపీఠ రంగశీర్షములకు తాదాత్మ్యము చెప్పవచ్చునా? నేపథ్యగృహమునకు తూర్పునగల ప్రదేశము ప్రేక్షకులు కూర్చొను భూభాగముకంటె ఒకటిన్నరమూర ఎత్తుగా నుండును. దీనికి రంగపీఠమని సామాన్యనామము. ఈ రంగపీఠమును రెండు సమభాగములు చేయగా, వెనుకనున్న సగభాగమునకు రంగశిరస్సు అని విశేషనామము. మిగిలినసగభాగము, అనగా తూర్పునగల సగభాగమునకు రంగపీఠమని విశేషనామము. కొన్నికొన్ని స్థలములలో పూర్వ పశ్చాద్భాగములను అవివక్షితములుగా గ్రహించుటచే రంగశీర్షమునకుగూడ రంగపీఠ మని వ్యవహారము వచ్చుచున్నది. కావుననే నేపథ్యగృహమునుండి రంగపీఠమును ప్రవేశించు టకు, రంగశీర్షమును ప్రవేశించుటకు ద్వారములు అవివక్షితములుగా చెప్పబడినవి. రంగపీఠ రంగశీర్ష ప్రమాణములు సమము లగుటచే, రంగపీఠ ప్రమాణమును మరల చెప్పలేదు. చతురశ్రమండపమున వీటికి వైశిష్ట్యముండుటచే మరల చెప్పవలసివచ్చినది. "నాట్యమండప స్యోత్థాన సుప్తవదవస్థితస్య రంగపీఠం ముఖం తదష్టహస్తం శిరః" "రంగపీఠస్య యత్పృష్ఠం రంగశిరస్తత్ర" "రంగపీఠస్య య దుపరి శిరోరూపమిత్యర్థః" అని మొదలుగాగల వాక్యముల ద్వారా అభినవగుప్తునకు సమ్మతమైన అర్థమిదేనని గ్రహించవలెను.

వనోద్యాన యుద్ధరంగాది విస్తృత ప్రదేశములను ప్రదర్శించుటకు, యుద్ధాదులలో ఉచ్చతరపరిక్రమణకొరకు, రంగపీఠమునకు వెనుకగల భాగముకూడ పాత్రలచే నప్పుడప్పుడు ఉపయోగింపబడుచున్నది. వికృష్టమండపమున సామాజికుల దృష్టివిఘాత పరిహారార్థము రంగపీఠమునకన్న దాని వెనుకభాగము ఎత్తుగా ఉండవలెను. చతురశ్రమున సామాజికులు సోపానాకృతి గల ఆసనములపై కూర్చొందురు గనుక దృష్టికి ఉపరోధము తటస్థించదు. అందుచే చతురశ్రమున సమతలముగనే రంగపీఠ రంగశీర్షము లుండవలెనని భావము.

కాగా ఎనిమిదిమూరల పొడవుగల నేపథ్యగృహము పశ్చిమమున నుండును. దీనికి తూర్పున ఎనిమిది మూరల పొడవుగా రంగశీర్షముండును. ఈ రంగశీర్షమునకు తూర్పుగా ఎనిమిదిమూరల పొడవున రంగపీఠముండును.

విభజ్య భాగా న్విధివ ద్యథావ దనుపూర్వశః. 35

శుభే నక్షత్రయోగేచ మండపస్య నివేశనమ్
శంఖ దుందుభి నిర్ఘోషైః మృదంగ పణవాదిభిః. 36
సర్వాతోద్యైః ప్రణుదితైః స్థాపనం కార్యమేవతు
ఉత్సార్యాణి త్వనిష్టాని పాషండ్యా శ్రమిణ స్తథా. 37
కాషాయవసనాశ్చైవ వికలాశ్చైవ యే నరాః

పైన చెప్పబడినట్లు విధిపూర్వకముగా దారముతో కొలతలను బెట్టి భూవిభాగమును చేసి శుభనక్షత్రమున నాట్యమండపమునకు శంకుస్థాపన చేయవలెను. శంఖ దుందుభుల యొక్కయు, పణవ మృదంగముల యొక్కయు, సకలవాద్యములయొక్కయు గీతధ్వనులతో శంకుస్థాపన జరుగవలెను. అశుభములు, అనిష్టకరములు నగు శకునములైన పాషండులు, సన్యాసులు, కాషాయవస్త్రధారులు, వికలాంగులు ఎదురుపడకుండునట్లు శంకుస్థాపన కుపక్రమించ వలెను.

నిశాయాంచ బలిః కార్యో నానాభోజన సంయుతః 38
గంధ పుష్ప ఫలోపేతో దిశో దశ సమాశ్రితః
పూర్వేణ శుక్లాన్నయుతో నీలాన్నో దక్షిణేనచ. 39
పశ్చిమేన బలిః పీతో రక్తశ్చై వోత్తరేణతు
యాదృశం దిశి యస్యాంతు దైవతం పరికల్పితమ్. 40
తాదృశ స్తత్ర దాతవ్యో బలి ర్మంత్రపురస్కృతః

రాత్రివేళ పదిదిక్కులయందు, ఆ దిక్కులలో గల దేవతలకు గంధము, పుష్పము, ఫలములతో కూడిన భోజనముతో బలులను వేయవలెను. తూర్పుదిక్కున తెల్లనియన్నము, దక్షిణమున నల్లని యన్నము, పసుపురంగుగల యన్నమును పడమరను, ఎర్రని యన్నమును ఉత్తరదిక్కున బలిగా వేయవలెను. మిగిలిన దిక్కులలో ఏ దిక్కున ఏ దేవత గలదో, ఆ దేవతకు సరిపోవు వర్ణముగల గంధమాల్యాదులను, అన్నమును బలిగా నొసంగవలెను. ఈ బలులను మంత్రపూర్వకముగా జరుపవలయును.

స్థాపనే బ్రాహ్మణేభ్యశ్చ దాతవ్యం ఘృతపాయసమ్. 41
మధుపర్క స్తథారాజ్ఞే కర్తృభ్యశ్చ గుడౌదనమ్

శంకుస్థాపన సమయమున బ్రాహ్మణులకు నేతితోకూడిన పాయసమును, రాజునకు మధుపర్కమును, గృహమును కట్టువారలకు బెల్లముతో కలిపిన అన్నమును ఇవ్వవలయును.

నక్షత్రేణతు కర్తవ్యం మూలేన స్థాపనం బుధైః. 42
ముహూర్తే నానుకూలేన తిథ్యా సుకరణేనచ
ఏవంతు స్థాపనం కృత్వా భిత్తికర్మ ప్రయోజయేత్. 43
భిత్తికర్మణి నిర్వృత్తే స్తంభానాం స్థాపనం తతః

మూలానక్షత్రమున తెలివితేటలుగలవారిచే శంకుస్థాపన చేయబడవలయును. శుభతిథి, శుభకరణము, శుభలగ్నమున శంకుస్థాపనానంతరము పునాదులను వేసి గోడలు కట్టవలెను. గోడలు పూర్తికాగా స్తంభముల నెత్తవలయును.

తిథి నక్షత్రయోగేన శుభేన కరణేనచ. 44

స్తంభానాం స్థాపనం కార్యం రోహిణ్యా శ్రవణేనవా
ఆచార్యేణ సుయుక్తేన త్రిరాత్రోపోషితేనచ. 45

స్తంభానాం స్థాపనం కార్యం ప్రాప్తే సూర్యోదయే శుభే

శుభతిథి, శుభయోగములలో, రోహిణీనక్షత్రమునగాని శ్రవణనక్షత్రమునగాని స్తంభముల నెత్తవలెను. మూడురాత్రులు ఉపవాసముచేసి, యోగ్యులతో కూడియున్న నాట్యాచార్యునిచే శుభమైన సూర్యోదయలగ్నమునకే స్తంభముల నిలుపవలెను.

మొట్టమొదట ఆగ్నేయదిక్కుగా స్తంభమును నిలుపవలెను. ఆ తర్వాత క్రమముగా నైఋతి, వాయవ్యము, ఈశాన్యములలో స్తంభస్థాపన చేయబడవలయును.

ప్రథమే బ్రాహ్మణస్తంభే సర్పి స్సర్షప సంస్కృతః. 46
సర్వశుక్లో విధిః కార్యో దద్యా త్పాయసమేవచ
తతశ్చ క్షత్రియస్తంభే వస్త్రమాల్యా నులేపనమ్. 47
సర్వం రక్తం ప్రదాతవ్యం ద్విజేభ్యశ్చ గుడౌదనమ్
వైశ్యస్తంభే విధిః కార్యో దిగ్భాగే పశ్చిమోత్తరే. 48
సర్వం పీతం ప్రదాతవ్యం ద్విజేభ్యశ్చ ఘృతౌదనమ్
శూద్రస్తంభే విధిః కార్యః సమ్యక్పూ ర్వోత్తరాశ్రయే. 49
నీలప్రాయం ప్రయత్నేన కృసరంచ ద్విజాశనమ్

ఆగ్నేయమూలను స్థాపించబడు బ్రాహ్మణస్తంభమును నేయి, తెల్లఆవాలతో పరిష్కరించి విధిపూర్వకముగా తెల్లని అన్నమును, పాయసమును బ్రాహ్మణులకీయవలెను. నైఋతమున గల క్షత్రియస్తంభమును వస్త్రమాల్యానులేపనములతో సంస్కరించి ఎర్రని అన్నమును బెల్లముతో కలిపి బ్రాహ్మణులకొసగవలెను. వాయవ్యమందలి వైశ్యస్తంభమునకై పసుపు రంగుగల అన్నమును నేతితో బ్రాహ్మణులకు పెట్టవలెను. ఈశాన్యమునగల శూద్రస్తంభమునకై నల్లగానుండు పులగమును బ్రాహ్మణుల కర్పింపవలెను. ఈవిధముగా స్తంభములను నిలుపుటయే స్తంభస్థాపన యనిపించుకొనును.

పూర్వేతు బ్రాహ్మణస్తంభే శుక్లమాల్యానులేపనే. 50
నిక్షిపేత్ కనకం మూలే కర్ణాభరణ సంశ్రయమ్
తామ్రం చాధః ప్రదాతవ్యం స్తంభే క్షత్రియసంజ్ఞకే. 51
వైశ్యస్తంభస్య మూలేతు రజతం సంప్రదాపయేత్
శూద్రస్తంభస్య మూలేతు దద్యా దదాయసమేచ. 52
శేషేష్వపిచ నిక్షేప్యం స్తంభమూలేతు కాంచనమ్

స్వస్తిపుణ్యాహ ఘోషేణ జయశబ్దేనచైవహి. 53
స్తంభానాం స్థాపనం కార్యం పుష్పమాలా పురస్కృతమ్
రత్నదానైః సగోదానై ర్వస్త్రదానై రనల్పకైః. 54
బ్రాహ్మణాం స్తర్పయిత్వాతు స్తంభా నుత్థాపయే త్తతః

తెల్లని పూలదండలతోను, అనులేపనములతోను సంస్కరించి ఆగ్నేయ స్తంభముక్రింద మొట్టమొదటనే కర్ణాభరణములకు చెందిన బంగారము నుంచవలెను. నైఋత స్తంభముక్రింద రాగిని, వాయవ్య స్తంభముక్రింద వెండిని, ఈశాన్య స్తంభముక్రింద ఇనుమును, మిగిలిన స్తంభములక్రింద కూడా బంగారమును ఉంచవలెను. రత్నములను, గోవులను, వస్త్రములను విరివిగా బ్రాహ్మణులకు దానముచేసి, వారిని తృప్తిపరచి, స్వస్తిపుణ్యాహవచనములతో, జయజయశబ్దములతో, పూలదండలు వేయబడిన స్తంభముల నెత్తవలెను.

అచలం చాప్యకంప్యంచ తథైవాచలితం పునః. 55
స్తంభస్యో త్థాపనే సమ్యగ్దోషా హ్యేతే ప్రకీర్తితాః
అనావృష్టి రుక్తా చలనే వలనే మృతితో భయమ్. 56
కంపనే పరచక్రాత్తు భయం భవతి దారుణమ్
దోషైరేతై ర్విహీనంతు స్తంభ ముత్థాపయే చ్ఛివమ్. 57

స్తంభము నెత్తునప్పు డది కదలకుండుట, కదలినను వణకుచున్నట్లు కనబడుట, వలయాకృతితో పరివర్తనముచేయుట అను నీ మూడును స్తంభస్థాపనలోగల దోషములు. స్తంభము కదలకపోయినచో వర్షములుండవు. కంపించినచో మృత్యుభయము కల్గును. పరివర్తన చేయునట్లున్న పరులాక్రమించుటవలన దారుణమగు భయము కలుగగలదు. ఈ దోషములు లేకుండునట్లు స్తంభములను స్థాపించవలయును.

పవిత్రే బ్రాహ్మణ స్తంభే దాతవ్యా దక్షిణాచ గాః
శేషాణాం భోజనం కార్యం స్థాపనే కర్తృసంశ్రయమ్. 58
మంత్రపూతంచ తద్దేయం నాట్యాచార్యేణ ధీమతా
పురోహితం నృపంచైవ భోజయే న్మధు పాయసైః. 59
కర్మ్యానపి తథా సర్వాన్ కృసరాం లవణోత్తరామ్

పవిత్రమగు ఆగ్నేయ స్తంభస్థాపనసమయమున ఆవును దక్షిణగా నొసగవలెను. ఇతర స్తంభములను స్థాపించువేళ యజమాని, బుద్ధిశాలియగు నాట్యాచార్యుడు మంత్రముచే పవిత్రము కాబడిన భోజనములను పెట్టవలెను. పురోహితునకు, రాజునకు మధువుతోను, పాయసముతోను భోజనము నిచ్చి, పనిచేయువారలకందరకు ఉప్పుతో కలిపిన పులగమును భోజనముగా పెట్టవలెను.

సర్వమేవ విధిం కృత్వా సర్వాతోద్యైః ప్రవాదితైః. 60
అభిమంత్ర్య యథాన్యాయం స్తంభ ముత్థాపయే చ్ఛుచిః
'యథాచలోగిరి ర్మేరు ర్హిమవాంశ్చ మహాబలః. 61

జయావహో నరేంద్రస్య తథా త్వ మచలో భవ
ఏవ ముత్థాపయే త్తజ్ఞో విధిదృష్టేన కర్మణా. 62
స్తంభద్వారంచ భిత్తించ నేపథ్యగృహమేవచ

సకలవిధములగు గీతాతోద్యములతో నీ విధులను చేసి, శాస్త్రప్రకారము స్తంభముల నభిమంత్రించి వాని నెత్తుచు "మేరుపర్వతము, మహాబలశాలియగు హిమవత్పర్వతము ఏవిధముగా కదలక స్థిరముగా యున్నారో, అట్లే నీవును స్థిరముగానుండి రాజునకు జయమును చేకూర్చుము" అని వచింపవలెను. శాస్త్రమందు చెప్పబడిన విధుల ననుసరించి ఈ రీతిగా స్తంభములను, ద్వారములను, గోడలను, నేపథ్యగృహమును శాస్త్రమును తెలిసికొనిన నాట్యాచార్యుడు నియమింపవలయును.

రంగపీఠస్య పార్శ్వేతు కర్తవ్యా మత్తవారణీ. 63
చతుః స్తంభ సమాయుక్తా రంగపీఠ ప్రమాణతః
అధ్యర్ధ హస్తోత్సేధేన కర్తవ్యా మత్తవారణీ. 64
ఉత్సేధేన తయోస్తుల్యం కర్తవ్యం రంగమండపమ్

నాట్యమండపమున తూర్పుగా గల ఎమినిదిమూరల మేరను రంగపీఠమందురు. రంగపీఠమునకు రెండుప్రక్కలయందు మదపుటేనుగులను నిర్మించివలెను. ఉత్తరమున ఒకటి, దక్షిణమున నొకటి కలసి రెండేనుగులు రాగలవు. ఈ ఏనుగులు నాలుగు స్తంభములతో కలసి యుండవలయును.

నాట్యమండపమునకు గోడవద్ద నొక స్తంభము, దీనికి ఎనిమిది మూరల దూరమున లోపల మరియొక స్తంభము ఉండగలదు. ఈ రెండింటికి మధ్యదూరము ఎనిమిదిమూరలుండును. కావున రంగపీఠమునకు నాల్గు మూలలలోను రెండేసి రెండు స్తంభముల చొప్పున ఎనిమిది స్తంభములు రాగలవు. తూర్పుముఖముగా ఎనిమిదిమూరల పొడవున దక్షిణదిశలో నొక మదపుటేనుగు, ఉత్తరదిశలో మరియొకఏనుగు వచ్చినచో ఒక్కొక్కయేనుగునకు నాల్గు స్తంభములతో సంబంధము కలుగగలదు.

ప్రేక్షకులు కూర్చుండు భూభాగమునకు ఒకటిన్నరమూర ఎత్తున మదపుటేనుగులుండవలెను. మదపుటేనుగులెంత ఎత్తున గలవో అంతే యెత్తున రంగపీఠముండవలెను. ప్రేక్షకుల కభిముఖముగా నున్న ఈ యేనుగులు నాట్యమండపమును మోయుచున్నట్లు కన్పించగలవు కాగా మత్తవారణీల మధ్య ఎనిమిదిమూరల వెడల్పున, పదునారుమూరల పొడవున రంగపీఠము ఏర్పడగలదు.

తస్యాం మాల్యంచ ధూపంచ గంధం వస్త్రం తథైవచ. 65
నానావర్ణాని దేయాని తథా భూతప్రియోబలిః
ఆయసం తత్ర దాతవ్యం స్తంభానాం కుశలైరధః. 66
భోజనం కృసరాంచైవ దాతవ్యం బ్రాహ్మణాశనమ్
ఏవం విధిపురస్కారైః కర్తవ్యా మత్తవారణీ. 67
రంగపీఠం తతః కార్యం విధిదృష్టేన కర్మణా

మదపుటేనుగును నిర్మించు సమయమున నానావర్ణములుగల పూలమాలలను, ధూపమును, గంధమును, వస్త్రమును అర్పించి, భూతముల కభిమతమగు బలులను వేయవలెను. అప్పుడు రంగపీఠమునకుండవలసిన నాలుగు స్తంభముల క్రింద ఇనుము నుంచవలెను. బ్రాహ్మణులకు పులగముతో భోజనము పెట్టవలెను. ఈరీతిగా విధిపూర్వకములగు మంత్రములతో, కర్మలతో మదపుటేనుగుల నేర్పరచి, శాస్త్రరీతి ననుసరించి రంగపీఠమును నిర్మించవలెను.

రంగశీర్షంతు కర్తవ్యం షడ్దారుక సమన్వితమ్. 68

నేపథ్యగృహమునకు తూర్పున గల గోడవద్ద మధ్యగా రెండు స్తంభముల నేర్పరుపవలెను. ఈ రెండింటిమధ్య దూరము ఎనిమిదిమూరలుండ వలెను. ఒక్కొక్క స్తంభమునకు తూర్పుగా నాలుగుమూరల దూరమున మరల రెండు స్తంభములను నిర్మించవలెను. అపుడు నాలుగు స్తంభములు రాగలవు. వీటిలో వెనుకగల రెండు స్తంభములకు క్రిందుగాను, ముందుగా గల రెంటికి పైగాను దూలములవంటి రెండు కొయ్యల నేర్పరచగా నాల్గు స్తంభములతో కలసి మొత్తము ఆరు కొయ్యలు రాగలవు. ఈ షడ్దారువులు మండపాకారమున నుండును.

కార్యం ద్వారద్వయం చాత్ర నేపథ్య గృహకస్యతు

నేపథ్యగృహమనగా నటీనటులు వేషములు వేసికొను గది. ఇది నాట్యమండపమునకు చివర పడమరగా నుండును. ఈ నేపథ్యగృహమున రెండు ద్వారములను నిర్మించవలెను. అనగా షడ్దారువులలో వెనుకగల రెండు స్తంభములకు రెండుప్రక్కల రెండు ద్వారములు రాగలవు. ఉత్తరమునగల ద్వారము నటీ నటుల ప్రవేశమునకు, దక్షిణద్వారము పాత్రల నిర్గమనమునకు ఉపకరించును. ఒకప్పుడు రెండుద్వారములనుండి పాత్రలు ప్రవేశింతురు. ఈ రెండుద్వారములకు మధ్యగల షడ్దారుక ప్రదేశమున గాయకాద్యుపరంజకవర్గ ముండును.

పూరణే మృత్తికాచాత్ర కృష్ణా దేయా ప్రయత్నతః. 69
లాంగలేన సముత్కృష్య నిర్లోష్ఠ తృణ శర్కరమ్
లాంగలే శుద్ధవర్ణౌతు ధుర్యౌ యోజ్యౌ ప్రయత్నతః. 70
కర్తారః పురుషాశ్చాత్ర యే ఽంగదోష వివర్జితాః
అహీనాం గైశ్చ వోఢవ్యా మృత్తికా పీవరై ర్నరైః. 71
ఏవం విధైశ్చ కర్తవ్యం రంగశీర్షం ప్రయత్నతః

నాట్యమండపభాగమును నాగలితో దున్ని ఎముకలు, వేళ్లు మొదలగువానిని తీసివేసి ప్రయత్నముచేసియైనను నల్లని మట్టితో నింపవలెను. భూశుద్ధిని చేయు నాగలికి తెల్లనివగు బలిష్ఠమైన ఎద్దులను కట్టవలెను. అవయవహీనులు కానివారు, అవయవదోషములు లేనివారు, బలిష్ఠులు నగు పురుషులచే మట్టిని పోయించవలెను. ఈ విధానము ననుసరించి మొట్టమొదట రంగశీర్షమును నిర్మింపవలెను.

కూర్మపృష్ఠం నకర్తవ్యం మత్స్యపృష్ఠం తథైవచ. 72
శుద్ధాదర్శతలాకారం రంగశీర్షం ప్రశస్యతే

కూర్మపృష్ఠమనగా అన్నివైపుల పల్లముగా నుండి మధ్య ఎత్తుగా గుండ్రముగా నుండునది. మత్స్యపృష్ఠమనగా మధ్య ఎత్తుగా, పొడవుగా నుండునది. రంగశిరస్సు కూర్మపృష్ఠమువలెగాని, మత్స్యపృష్ఠమువలెగాని ఉండరాదు. నిర్మలమైన అద్దముయొక్క సమతల భాగమువలె ఉండు రంగశీర్షమే ప్రశస్తమైనది.

రత్నాని చాత్ర దేయాని పూర్వే వజ్రం విచక్షణైః. 73
వైడూర్యం దక్షిణే పార్శ్వే స్ఫటికం పశ్చిమేతథా
ప్రవాల ముత్తరే చైవ మధ్యేతు కనకం భవేత్. 74
ఏవం రంగశిరః కృత్వా దారుకర్మ ప్రయోజయేత్

రంగశీర్షమున భూమిలో తత్తదుచితరత్నములను విచక్షణుడైన నాట్యాచార్యుడు వేయవలెను. తూర్పుదిక్కున వజ్రమును, దక్షిణమున వైడూర్యమును, పడమర స్ఫటికమును, ఉత్తరమున ప్రవాళమును, మధ్యలో బంగారమును వేయవలెను. ఈవిధముగా రంగశిరస్సును నిర్మించి, కొయ్యపనిని చేయించవలెను.

ఊహాప్రత్యూహ సంయుక్తం నానాశిల్ప ప్రయోజితమ్. 75
నానాసంజవనోపేతం బహువ్యాలోప శోభితమ్
భవేయ శ్చాత్ర విన్యస్తా వివిధాః సాలభంజికాః. 76
నిర్వ్యూహ కుహరోపేతం నానాగ్రథిత వేదికమ్
నానావిన్యాస సంయుక్తం యంత్రజాల గవాక్షకమ్. 77
సుపీఠ ధారణీయుక్తం కపోతాలీ సమాకులమ్
నానాకుట్టిమ విన్యస్తైః స్తంభైశ్చా ప్యుపశోభితమ్. 78
ఏవం కాష్ఠవిధిం కృత్వా భిత్తికర్మ ప్రయోజయేత్

శిల్పకారుని ఊహాపోహపాటవమును చూపు వివిధశిల్పములచే చెక్కబడిన స్తంభముల మధ్య స్త్రీమూర్తులగు సాలభంజికలుండవలెను. నానాసంజవనోపేతమైనవి, అనేకపక్షులతో శోభించుచున్నవియు నగు వివిధములగు సాలభంజికలు చక్కగా కూర్పబడినవి కావలెను. నిర్వ్యూహకుహరోపేతమైనవి, వివిధములగు ఆకృతులచే కూర్చబడిన వేదికలు గలవి, వివిధ విన్యాసములతో కూడినవియునై ఉండవలెను. చతురస్రములు, అష్టకోణములు, గుండ్రనివి యగు ద్వారములుండవలెను. స్తంభములపైని పీటలు తులాదండమువలె నేర్పరుపబడవలెను. కపోతముల సమూహములతో నిండినట్లు స్తంభములు కన్పడవలెను. నానాకుట్టిమవిన్యస్తములగు స్తంభములతో నాట్యగృహము శోభిల్లవలెను. ఈ రీతిగా దారుశిల్పముల చేయించి, గోడలవిషయ మాలోచింపవలెను.

స్తంభంవా నాగదంతంవా వాతాయన మథాపివా. 79
కోణం వా సప్రతిద్వారం ద్వారవిద్ధం న కారయేత్

స్తంభమునకుగాని, నాగదంతమునకుగాని, వాతాయనమునకుగాని ద్వారవేధ కలుగునట్లు నిర్మించరాదు. స్తంభమునకు పైన ఆధారభూతముగా వేయు నాగపుష్పమును నాగదంత

మందురు. మూలలలో ద్వారములున్న ద్వారవేధ కలుగునుగావున ద్వారవేధకలుగజేయునట్టి ద్వారముల నుంచరాదు.

> కార్యః శైలగుహాకారో ద్విభూమి ర్నాట్యమండపః. 80
> మంద వాతాయనోపేతో నిర్వాతో ధీరశబ్దవాన్
> తస్మా న్నివాతః కర్తవ్యః కర్తృభి ర్నాట్యమండపః. 81
> గంభీర స్వరతా యేన కుతపస్య భవిష్యతి

ముందు కూర్చొను ప్రేక్షకులు వెనుక కూర్చొనువారికి అడ్డము రాకుండునట్లు, క్రమక్రమముగా వెనుక కూర్చొనువారి ఆసనములను ఎత్తుగా నుంచుచు నిచ్చెన మెట్లనలె నిర్మించవలెను. చివరి ఆసనముల ఎత్తు రంగపీఠముయొక్క ఎత్తుతో సమానముగా నుండవలెను. ఇట్లు చేయగా నాట్యగృహమున ప్రేక్షకులుండు భూభాగము, నాట్యప్రయోగమును చూపు భూభాగము అని రెండు భూభాగములు రాగలవు. ఆసనములు సోపానాకృతితో నుండుటచే నాట్యమండపము కొండ గుహావలె కన్పించగలదు.

ఈ నాట్యగృహమున చతురశ్రగృహముకన్న ఎక్కువ స్తంభములు కన్పించగలవు.

వికృష్ట నాట్యమండపము




జల్లెడవలె అల్లిన కిటికీలుమాత్రమే నాట్యమండపమున నుండవలెను. తద్ద్వారా మందపవనమే లోనికిరాగలదు. గీతవాద్యములు మ్రోగునపుడు మందపవనమున్నచో చక్కని స్వరము రాగలదు. లేనిచో ప్రతిధ్వనిగల్గును గాన నాట్యాచార్యుడీ నియమములతో నాట్యగృహమును నిర్మించవలెను.

రంగపీఠమునకు రంగశీర్షమునకు మధ్య రంగపీఠమంత పొడవుగల తెర ఉండును. వనోద్యానాది ప్రదర్శనమునకు, నాటకాంతర్గత రూపకమును ప్రదర్శించుటకు రంగశీర్షము నుపయోగించవలెను. అప్పుడు ఈ తెరను తీసివేయుదురు.

నాట్యమండపము నిట్లు నిర్మించి, గోడలకు రంగు వేయవలెను. వన, పత్తన, జలాశయ, ఉపవన, పర్వతాదులను సాక్షాత్తుగా భాసింపజేయుటకు అనేకవిధములైన చిత్రదారుకర్మాదికముతో రంగము నలంకరింపవలెను.

> భిత్తికర్మవిధిం కృత్వా భిత్తిలేపం ప్రదాపయేత్. 82
> సుధాకర్మ బహి స్తస్య విధాతవ్యం ప్రయత్నతః
> భిత్తి ష్వథ విలిప్తాసు పరిమృష్టాసు సర్వతః. 83
> సమాసు జాతశోభాసు చిత్రకర్మ ప్రయోజయేత్
> చిత్రకర్మణి చాలేఖ్యాః పురుషాః స్త్రీజనా స్తథా. 84

(1) ప్రేక్షాగృహము 32 మూరలు పొడవు, 32 మూ. వెడల్పు. (2) రంగమండపము 16 మూ. పొ, 8 మూ. వె. (3) మత్తవారణి 8 పొ, 8 వె. (4) రంగశీర్షము 32 పొ, 8 వె. (5) పద్దారుకము 8 పొ, 4 వె. (6) ద్వారములు పద్దారుకము తర్వాత 4—8 మూరలకు మధ్య. (7) నేపథ్యగృహము 32 పొ, 16 వె. [o] స్తంభములు.

లతాబంధాశ్చ కర్తవ్యా శ్చరితం చాత్మ భోగజమ్
ఏవం వికృష్టం కర్తవ్యం నాట్యవేశ్మ ప్రయోక్తృభిః. 85

గోడలు పూర్తియైన తర్వాత గోడలకు లేపమును పూయవలెను. ప్రయత్నముచేసి గోడలకు వెలుపలివైపున సున్నము పూయించవలెను. సున్నము వేసిన తర్వాత శుభ్రమై, సమముగా కన్పించి, శోభించుచున్న గోడలపై చిత్రములను లిఖింపజేయవలెను. పురుషులను, స్త్రీలను, లతాబంధములను, తన భోగజీవితమున కభిమతమగు చరిత్రను చిత్రలేఖన ద్వారా చిత్రింపజేయవలెను. ఈ రీతిగా మధ్యమపరిమాణముగల వికృష్టమనబడు నాట్యగృహమును నిర్మింపవలెను.

పునరేవహి వక్ష్యామి చతురశ్రస్య లక్షణమ్
సమంతతశ్చ కర్తవ్యా హస్తా ద్వాత్రింశదేవతు. 86
శుభ భూమి విభాగస్థో నాట్యజ్ఞై ర్నాట్యమండపః
యో విధిః పూర్వముక్తస్తు లక్షణం మంగళానిచ. 87
వికృష్టే తా న్యశేషాణి చతురశ్రేపి కారయేత్

ఇక మధ్యమపరిమాణముగల చతురశ్ర నాట్యగృహముయొక్క లక్షణము చెప్పబడుచున్నది. చతురశ్రమధ్యమమునకు అరువదినాలుమూరలు పొడవు, అంతే వెడల్పు ఉండును. ఇందు ఉత్తరమున, దక్షిణమున పదునారుమూరల వెడల్పుగల భాగములను వదలి శేషించిన ప్రదేశమున నాట్యగృహమును నిర్మించవలెను. కాగా నీ నాట్యగృహమునకు పొడవు అరువదినాలుగు మూరలు, వెడల్పు ముప్పదిరెండు మూరలు రాగలవు. నాట్యజ్ఞులు భూమిని శోధించి, విభజించవలెను. వికృష్ట నాట్యమండపవిషయమున ఏ లక్షణములు, జపములు, శాంతులు మొదలైనవి చెప్పబడినవో వాటి నిక్కడగూడ చెప్పికొనవలయును అక్కడ చెప్పని విషయములేవైన ఇచట చెప్పబడినచో నివికూడ వికృష్ట నాట్యమండపమున వర్తించుకొన వలయునని శాస్త్రమర్యాద.

చతురశ్రం సమంకృత్వా సూత్రేణ ప్రవిభజ్యచ. 88
బాహ్యతః సర్వతః కార్యా భిత్తిః శ్లిష్టేష్టకా దృఢా
కృతాభ్యంతరతః కార్యం రంగపీఠం యథావిధి. 89
దశ ప్రయోక్తృభిః స్తంభాః శక్తా మండపధారణే
స్తంభానాం బాహ్యతశ్చాపి సోపానాకృతి పీఠకమ్. 90
ఇష్టకా దారుభిః కార్యం ప్రేక్షకాణాం నివేశనమ్
హస్తప్రమాణై రుత్సేధై ర్భూమిభాగ సముత్థితైః. 91
రంగపీఠా వలోక్యంతు కుర్యా దాసనజం విధిమ్
షడన్యా నంతరేచైవ పునః స్తంభాన్ యథా దిశమ్. 92
విధినా స్థాపయే త్తజ్జ్ఞో దృఢాన్ మండపధారణే
అష్టౌ స్తంభాన్ పునశ్చైవ తేషా ముపరి కల్పయేత్. 93

కొలతదారముతో చతురశ్రనాట్యగృహమును వెనుక టీవలెనే రెండు సమభాగములు చేయవలెను. వెలుపలివైపున అన్నిప్రక్కల ఇటుకతోను, సున్నముతోను దృఢముగా గోడలను కట్టించవలెను.

'అష్టహస్తంతు కర్తవ్యం రంగపీఠం ప్రమాణతః' (2అ.97శ్లో.) అని ముందుచెప్పబడుటచే రంగపీఠ ప్రమాణము ఎనిమిదిమూరలని వచ్చుచున్నది. చతురశ్రమండపమున రంగపీఠము కూడ చతురశ్రముగానే ఉండును గనుక ఈ రంగపీఠము పొడవు ఎనిమిదిమూరలు, వెడల్పు ఎనిమిదిమూరలు ఉండును.

నాట్యగృహమును రెండుభాగములు చేయవలెను. ఇందు ముప్పదిరెండుమూరల పొడవు, ఇంతే వెడల్పుగల సగభాగము నాట్యమండప మగును. ఈ మండపములో తూర్పుప్రక్కన మధ్యగా ఎనిమిదిమూరల పొడవు, ఎనిమిదిమూరల వెడల్పు గల ప్రదేశము రంగపీఠమగును. కాగా దక్షిణమున పన్నెండుమూరలు, ఉత్తరమున పన్నెండుమూరలు ప్రదేశముండును.

రంగపీఠమునకు వెలుపలగా పది స్తంభములుండుట ప్రశస్తము. ఈ స్తంభములకు వెలుపల నున్న భాగమున ప్రేక్షకులు కూర్చొనుటకు నిచ్చెన మెట్లవలె ఆసనములను ఇటుకతోను, కొయ్యతోను ఏర్పరచవలెను. ముందుమెట్లకన్న వెనుకమెట్లు ఎక్కువ ఎత్తుగా నుంచవలెను. అప్పుడే రంగపీఠమందరకు కన్పించగలదు. ఇది అభినవగుప్తసమ్మతమైన భావము.

నాట్యగృహమున రెండు భూభాగములు కలవని, ఇవి కొండ గుహావలె నుండునని వికృష్టమండపమున చెప్పబడినది. ఈ విధానమంతయు చతురశ్రమునగూడ చెప్పుకొనవలెను.

చతురశ్ర నాట్యగృహమున పదిస్తంభములు విశేషముగా చెప్పబడినవి. తర్వాత ఆరు స్తంభములు, ఎనిమిది స్తంభములు మరల విధించబడుచున్నవి. 'అష్టౌ స్తంభాః పునశ్చైవ తేషా ముపరికల్పయేత్', 'శక్తా మండప ధారణే', 'దృఢాః మండపధారణే', 'భిత్తిః శ్లిష్టేష్టకా దృఢా', అని మొదలగు ప్రయోగములలో 'దృఢ', 'శక్త', 'ఉపరి', అను పదములను విచారించవలెను. ఈవిచారణలో ప్రాచీన నాట్యమండపములలో ఉపరిప్రాసాదము లేక పై అంతస్తు ఉండెడిదని నిర్ణయింప వీలున్నది.

నేపథ్యగృహమునకు ముందుగల రంగశిరస్సున స్తంభములను మండపాకారమున చూపినచో స్వర్గాదిప్రదర్శనార్థము ప్రాసాదము మరియొకటి రాగలదు. ఇట్టి ప్రాసాదము రంగశిరస్సులో నుండును.

ఈ నాట్యమండపమునకు పై అంతస్తుగా, రంగపీఠసమానవిస్తారముగల ప్రాసాదమొకటి యుండును. ఈ ప్రాసాదములోనికి పోవుటకు ఉత్తరమున, దక్షిణమున పదునారేసిమూరలు గల ప్రదేశమును వదలవలయును. ఇది ఎనిమిది స్తంభములతో నిర్మింపబడునది. దక్షిణదిక్కున ఆగ్నేయమూలగా రంగశీర్షమునకు పైన ఒక స్తంభముండును. దీనికి ఉత్తరముగా నాలుగు మూరల దూరమున రెండవ స్తంభముండును. దీనికి నాలుమూరల దూరమున ఉత్తరముగా మూడవ స్తంభముండును. ఈ మూడవదానికి నాలుమూరలదూరమున నాల్గవ స్తంభముండును. ఇట్లే ఉత్తరదిక్కునగూడ నాల్గు స్తంభములు రాగలవు. ఇవి ఎనిమిది స్తంభములు. ఈ స్తంభ ముల మధ్యగల ప్రదేశము ఎనిమిదిమూరలు. ఇది నలుచతురముగా నుండవలెను గనుక,

ఈ స్తంభములకు ఎనిమిది మూరలు పశ్చిమముగా గోడ ఉండును. ఈ స్తంభములను గోడను కలుపుచు వేదికలు రెండు ఉండవచ్చును. ఇట్లు పై అంతస్తున వచ్చు ప్రాసాదము చతురశ్ర మంటపమునగల విశేషము.

ప్రేక్షకులు కూర్చొను ప్రదేశమున పది స్తంభములుండును. గోడలకు పన్నెండుమూరల దూరమున నీ స్తంభములు రావలెను. ఒక్కొక్క స్తంభమునకు మధ్యగల దూరము ఎనిమిది మూరలుండును. కాగా ఉత్తరమున ఐదు స్తంభములు, దక్షిణమున ఐదు స్తంభములు రాగలవు. ఈ స్తంభములకు మధ్యగల ప్రదేశము ఎనిమిదిమూరలుండగలదు. స్తంభములకు గోడలకు గల మధ్యప్రదేశములో ప్రేక్షకులు కూర్చొనుటకు సోపానములవలె ఆసనము లుండును. స్తంభములకు గల మధ్యప్రదేశమున ఉత్తములగు సభాసదులుందురు. ఈ స్తంభములకు ద్వారవేధ కలుగరాదు.

రంగశీర్షము నాలుగుమూరలేయగుటచే గాయకాదులకు నిర్మింపబడు షడ్దారువులిచట రావు. కాగా షడ్దారువులు చతురశ్రమున నేపథ్యగృహములో నుండవలెను. అందుచే "అంతరే" అను శబ్దమునకు నేపథ్యగృహములో అని అర్థము చెప్పుకొనవలెను.

> విధాస్య మష్టహస్తంచ పీఠం తేషు తతో న్యసేత్
> తతః స్తంభాః ప్రదాతవ్యా స్తజ్జ్ఞై ర్మండప ధారణే. 94
> ధారణీ ధారణా స్తేచ శాలస్త్రీభి రలంకృతాః

మండపములో పద్మాదులు చెక్కబడిన ముఖ్య స్తంభములపైన ఎనిమిది మూరల పీఠమును అనగా దూలమును వేయవలెను. ఈ దూలములనబడు తులాదండములను ధరించు స్తంభములపై శాలస్త్రీల ఆకృతులను చెక్కించి అందముకూర్చునట్లు చేయవలెను.

> నేపథ్య గృహకంచైవ తతః కార్యం ప్రయత్నతః. 95
> ద్వారం చైకం భవే త్తత్ర రంగపీఠ ప్రవేశనమ్

రంగశీర్షమునకు పశ్చిమముగా నేపథ్యగృహమును నిర్మించవలెను. ఈ నేపథ్యగృహమునకు నటీనటులు రంగపీఠమును ప్రవేశించుటకు వెనుకటివలెనే ద్వారము లుండవలెను. కాని ఇచట విశేషవిధి కలదు. వికృష్టమండపమున చెప్పబడిన రెండుద్వారములకు మధ్య మరియొక ద్వారముగూడ చతురశ్రమున నుండవలెను. గాయకాద్యుపవేశనార్థము షడ్దారువులు నేపథ్యగృహమున నుండవలెనని చెప్పితిమి. ఈ గాయకులు నటీనటాదికమును చూచుచు వాద్యముల నాలాపించుట ఉత్తమము గనుక మధ్య మూడవ ద్వారము విధింపబడినది. ఈ గాయకులు కూర్చొను ప్రదేశము రంగపీఠమంత ఎత్తుగా నుండవలెను. కావుననే 'ప్రయత్నతః' అని చెప్పినాడు. రంగమధ్యమునకు త్వర త్వరగా ప్రవేశించుటకుగూడ ఈ ద్వారము పయోగించును.

> జనప్రవేశనం చాన్య దాభిముఖ్యేన కారయేత్. 96

సామాజికులు ప్రవేశించుటకు రంగపీఠమున కభిముఖముగా నాట్యగృహమునకు తూర్పున నాల్గవద్వారమును నిర్మించవలెను. కాగా చతురశ్రమున నాలుగుద్వారములుండును.

రెండుప్రక్కలనుకూడా రెండుద్వారములుండవలయునని మొత్తము ఆరుద్వారములు నాట్యగృహమునకుండవలయునను మాట సంప్రదాయవిరుద్ధమైనది.

అష్టహస్తంతు కర్తవ్యం రంగపీఠం ప్రమాణతః
చతురశ్రే సమతలం వేదికా సమలంకృతమ్. 97
పూర్వప్రమాణ నిర్దిష్టా కర్తవ్యా మత్తవారణీ
చతుఃస్తంభ సమాయుక్తా వేదికాయాస్తు పార్శ్వతః. 98
సమున్నతం సమంచైవ రంగశీర్షంతు కారయేత్
వికృష్టే త్వున్నతం కార్యం చతురశ్రే సమంతథా. 99
ఏవ మేతేన విధినా చతురశ్రం గృహం భవేత్

రంగపీఠము తూర్పు పడమరలుగా ఎనిమిదిమూరల వెడల్పుకలిగి యుండును. ఇందు ఒకటిన్నరమూర ఎత్తున సమతలమైన వేదికలను రెండుప్రక్కల నిర్మించవలెను. ఒక్కొక్క వేదిక నాలుగుమూరల వెడల్పుండును. నాట్యవేదికకు రెండుప్రక్కలయందు పూర్వము

చతురశ్ర నాట్య మంటపము




‡‡ మూర = 2 అడుగుల 3 అంగుళములు.

(1) ఖాళీస్థలము 16 మూ. (2) ఉత్తమ సభ్యులు 8 మూ. (3) సోపానాకృతిగల ఆసనములు 12 మూ. (4) రంగపీఠము 8 మూ. పొ; 8 మూ. వె. (5) వేదిక 8—4. (6) మత్తవారణి 8—8. (7) రంగశీర్షం 4—32. (8) షడ్దారుకం 4—8. (9) ద్వారములు. (10) నేపథ్యము 16—32. [o] స్తంభములు.

చెప్పినట్లుగా నాలుగు స్తంభములతో సమాయుక్తములగు రెండు మదపుటేనుగులను స్థాపించవలెను. రంగపీఠమునకు కొంచెము ఎత్తుగా సమతలమైన రంగశీర్షము వికృష్టమండపమునసే ఉండును. ఈ విధముగా చతురశ్రమగు నాట్యమండపమును నిర్మించుట శాస్త్రసమ్మతము.

అతఃపరం ప్రవక్ష్యామి త్ర్యశ్రగేహస్య లక్షణమ్. 100

త్ర్యశ్రః త్రికోణం కర్తవ్యం నాట్యవేశ్మం ప్రయోక్తృభిః
మధ్యే త్రికోణ మేవాస్య రంగపీఠంతు కారయేత్. 101

ద్వారం తేనైవ కోణేన కర్తవ్యం తస్య వేశ్మనః
ద్వితీయంచైవ కర్తవ్యం రంగపీఠస్య పృష్ఠతః. 102

విధిర్య శ్చతురశ్రస్య భిత్తి స్తంభ సమాశ్రయః
సతు సర్వః ప్రయోక్తవ్యః త్ర్యశ్రస్యాపి ప్రయోక్తృభిః. 103

ఇక త్రికోణాకారముగ నుండు నాట్యగృహముయొక్క లక్షణము చెప్పబడుచున్నది. ముక్కోణాకారముగ నుండు నీ నాట్యగృహములో మధ్య కోణాకృతితో రంగపీఠముండును. రంగపీఠమునకు పశ్చిమమున రంగశిరము, దానికి పడమర నేపథ్యగృహము కలవు. నేపథ్య గృహమునుండి పాత్రలు ప్రవేశించుటకు రంగపీఠమునకు పడమరగా నున్న కోణములవద్ద రెండు ద్వారము లుండవలెను. చతురశ్రమండపమునుగూర్చి చెప్పుచు గోడలకు స్తంభములకు ఏ యే లక్షణములు చెప్పబడినవో అవన్నియు ఇక్కడగూడ వర్తించును. వాటిని అన్నింటిని ఇక్కడగూడ యోజించవలెను.

ఏవ మేతేన విధినా కార్యా నాట్యగృహా బుధైః
పునరేషాం ప్రవక్ష్యామి పూజా మేవం యథావిధి. 104

ఇతి శ్రీభారతీయే నాట్యశాస్త్రే మండపవిధానంనామ ద్వితీయోఽధ్యాయః.

ఈ చెప్పబడిన విధుల ననుసరించి నాట్యగృహములను విద్వాంసులు నిర్మింపవలెను. ఇక నీ నాట్యగృహములకు శాస్త్రీయమగు పూజావిధిని భరతముని చెప్పబోవుచున్నాడు.

శ్రీ భరతముని ప్రణీతమగు నాట్యశాస్త్రమున ఆంధ్రభారతియందు
మండపవిధానమను రెండవ అధ్యాయము.

## తృతీయోఽధ్యాయః

సర్వలక్షణ సంపన్నే కృతే నాట్యగృహే శుభే
గావో వసేయుః సప్తాహం సహజప్యపరైర్ద్విజైః. 1

తతోఽధివాసయే ద్వేశ్మ రంగపీఠం తథైవచ
మంత్రపూతేన తోయేన ప్రోక్షితాంగో నిశాగమే. 2

యథాస్థానాంతరగతో దీక్షితః ప్రయతః శుచిః
త్రిరాత్రోపోషితో భూత్వా నాయకోఽహతవస్త్రధృక్. 3

నాట్యమండపనిర్మాణమైన తర్వాత రంగదైవతపూజనము చేయవలసియున్నది. అందుకై సమస్త లక్షణములతో కూడిన శుభమగు నాట్యగృహమున జపములనుచేయుచున్న బ్రాహ్మణులతో బాటు ఆవులుకూడ ఏడుదినములు నివసించవలెను. అప్పుడు మంత్రముచే పవిత్రమైన ఉదకములను శరీరముపై ప్రోక్షించుకొని రంగపీఠమును నాట్యాచార్యుడు ప్రవేశించవలెను. తన నివాసగృహమునుండి వచ్చి, శుచియై, నియమబద్ధుడై, మూడురాత్రులుపవసించినవాడై, నిర్మలమైనవస్త్రములను ధరించి, దీక్షితుడైన నాట్యాచార్యుడు నాట్యమండపమును ప్రవేశించి దేవతానమస్కారము చేయ నారంభింపవలెను.

నమస్కృత్య మహాదేవం సర్వలోకోద్భవం భవమ్
జగత్పితామహంచైవ విష్ణు మింద్రం గుహం తథా. 4

సరస్వతీంచ లక్ష్మీంచ సిద్ధిం మేధాం ధృతిం మతిమ్
సోమం సూర్యంచ మరుతో లోకపాలాం స్తథాశ్వినౌ. 5

మిత్ర మగ్నిం సురాన్ వర్ణాన్ రుద్రాన్ కాలం కలిం తథా
మృత్యుంచ నియతిం చైవ కాలదండం తథైవచ. 6

విష్ణుప్రహరణం చైవ నాగరాజంచ వాసుకిమ్
వజ్రం విద్యు త్సముద్రాంశ్చ గంధర్వా ప్సరసో మునీన్. 7

తథా నాట్యకుమారీశ్చ మహాగ్రామణ్య మేవచ
యక్షాంశ్చ గుహ్యకాం శ్చైవ భూతసంఘాం స్తథైవచ. 8

ఏతా నన్యాంశ్చ వై సర్వాన్ ప్రణిపత్య కృతాంజలిః
యథా స్థానాంతరగతాన్ సమావాహ్య తతో వదేత్. 9

సకలలోకములను సృష్టించిన శివుని, లోకపితామహుడగు బ్రహ్మను, విష్ణువును, ఇంద్రుని, గుహుని, సరస్వతిని, లక్ష్మిని, సిద్ధిని, మేధను, ధృతిని, మతిని, సోమును, సూర్యుని, మరుత్తులను, లోకపాలురను, అశ్వినులను, మిత్రుని, అగ్నిని, దేవతలను, బ్రాహ్మణాదివర్ణముల అధిష్ఠానదేవతలను, రుద్రులను, కాలమును, కలిని, మృత్యువును, నియతిని, కాలదండమును, సుదర్శనచక్రమును, నాగరాజగు వాసుకిని, వజ్రమును, విద్యుత్తును, సముద్రములను,

గంధర్వులను, అప్సరసలను, మునులను, నాట్యమాతృకలను, విఘ్నేశ్వరుని, యక్షులను, గుహ్యకులను, భూతసంఘములను, తదితరులగు రాక్షస పిశాచ మహోరగములను కృతాంజలియై నమస్కరించి, వారిని ఆవాహనజేసి ఈ క్రిందివిధముగా పలుకవలెను.

'భవద్భి ర్నో నిశాయాంతు నః కర్తవ్యః సంపరిగ్రహః
సాహాయ్యం చైవ దాతవ్య మస్మి న్నాట్యే సహానుగైః.' 10

"ఈ రాత్రివేళ ఆవాహనాది పూజాకృత్యమును స్వీకరించి, మీ అనుచరులతో నీ నాట్యగృహమున మీరు సహాయపడవలెను" అని ప్రార్థించవలెను.

సంపూజ్య సర్వానేకత్ర కుతపం సంప్రయుజ్యచ
జర్జరాయ ప్రయుంజీత పూజాం నాట్యప్రసిద్ధయే. 11
'త్వం మహేంద్రప్రహరణ సర్వదానవసూదన
నిర్మిత స్త్వం సర్వదేవైః సర్వవిఘ్న నిబర్హణ. 12
నృపస్య విజయం శంస రిపూణాంచ పరాజయమ్
గోబ్రాహ్మణ శివం చైవ నాట్యస్యచ వివర్ధనమ్.' 13
ఏవం కృత్వా యథాన్యాయ ముపాస్యం నాట్యమండపే
నిశాయాంతు ప్రభాతాయాం పూజనం ప్రక్రమేదిహ. 14
ఆర్ద్రాయాంవా మఘాయాంవా యామ్యే పూర్వేషుచ త్రిషు
ఆశ్లేషా మూలయో ర్వాపి కర్తవ్యం రంగపూజనమ్. 15

దేవతల నందరను ఒకచో పూజించి, మంగళవాద్యముల నొక స్థలమునకు దెచ్చి, నాట్యము ప్రసిద్ధినొందుటకు జర్జరపూజ నారంభించవలెను. జర్జరమనబడు ఇంద్రధ్వజము నాట్యగృహమునకున్న తూర్పుద్వారమువద్ద ఉండును. "మహేంద్రుని ఆయుధము, సకలరాక్షసులను చంపునదియు నగు జర్జరమా! సమస్తవిఘ్నములను పారద్రోలుటకు నీవు దేవతలందరచేత నిర్మింపబడినావు. రాజునకు విజయమును, శత్రువుల ఓటమిని, గోబ్రాహ్మణుల శుభమును, నాట్యాభివృద్ధిని ఆశంసన చేయుము" అని ధ్వజమును ప్రార్థించి విధియుక్తముగా నాట్యమండపమున పూజ చేయవలెను: రాత్రివేళ ఈ ప్రక్రియను సాగించి, ప్రాతఃకాలము రాగానే ఆర్ద్ర, మఘ, భరణి, పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, ఆశ్లేష, మూలానక్షత్రములలో నొకనక్షత్రమున చంద్రుడుండగా రంగపూజను చేయవలెను.

ఆచార్యేణతు యుక్తేన శుచినా దీక్షితేనచ
రంగ స్యోద్యోతనం కార్యం దేవతానాంచ పూజనమ్. 16
దినాంతే దారుణే ఘోరే ముహూర్తే భూతదైవతే
ఆచమ్యతు యథాన్యాయం దేవతా వై నివేశయేత్. 17
రక్తాః ప్రతిసరాః సూత్రం రక్తగంధాశ్చ పూజితాః
రక్తాః సుమనసశ్చైవ యచ్చ రక్తం ఫలం భవేత్. 18

యవై స్సిద్ధార్థకై ర్లాజై రక్షతైః శాలితండులైః
నాగపుష్పస్య మూలేన వితుషాభిః ప్రియంగుభిః. 19

ఏతై ర్ద్రవ్యై ర్యుతం కుర్యా ద్దేవతానాం నివేశనమ్

శుచి, దీక్షితుడు నగు నాట్యాచార్యుడు రంగమండపము నధిరోహించి, దేవతాపూజ కుపక్రమించుచు దారుణము, ఘోరము నగు రౌద్రముహూర్తమున యథాశాస్త్రమాచమన మాచరించి దేవతల నాహ్వానించవలెను. ఎర్రని దారములతో చేయబడిన కంకణములతోను, ఎర్రని గంధములతోను, ఎర్రని పూవులతోను దేవతలను పూజించిన అనురక్తమగు ఫలము కలుగగలదు. యవలు, తెల్ల ఆవాలు, పేలాలు, బియ్యముతో చేయబడిన అక్షతలు, కొర్రబియ్యము ఈ ద్రవ్యములతో నాగదంతముయొక్క క్రిందభాగమున దేవతలను ఆవాహన చేసి అధివసింపజేయ వలెను.

ఆలిఖే న్మండలం పూర్వం యథాస్థానం యథావిధి. 20
సమంతతశ్చ కర్తవ్యం హస్తాః షోడశమండలమ్
ద్వారాణి చాత్ర కుర్వీత విధానేన చతుర్దిశమ్. 21
మధ్యే చైవాత్ర కర్తవ్యే ద్వే రేఖే తిర్యగూర్ధ్వగే
తయోః కక్ష్యావిభాగేన దైవతాని నివేశయేత్. 22

మొట్టమొదటనే పదునారు మూరలు వ్యాసముగల వర్తులమగు మండలమును విధి పూర్వకముగా నేర్పరచి, అందు నలుదిక్కుల నాలుగుద్వారముల నమర్చి, ఈ మండల ములో నడ్డముగాను నిలువుగాను రెండు రేఖలను గీయవలెను. ఇట్టి మండలభాగములయందు ఆ యా దేవతలను వినివేశింప జేయవలెను.

పద్మోపవిష్టం బ్రహ్మాణం తస్య మధ్యే నివేశయేత్
ఆదా నివేశ్యో భగవాన్ సార్ధం భూతగణై ర్భవః. 23
నారాయణో మహేంద్రశ్చ స్కందః సూర్యోఽశ్వినా శశీ
సరస్వతీచ లక్ష్మీశ్చ శ్రద్ధా మేధా చ పూర్వతః. 24

ఈ మండలమధ్యభాగమున నవదళపద్మోపవిష్టుడగు బ్రహ్మను, ఈశాన్యమున భూత గణములతో నున్న శివుని, తర్వాత తూర్పుదిక్కున నారాయణుని, ఇంద్రుని, స్కందుని, సూర్యుని, అశ్వినీదేవతలను, చంద్రుని, సరస్వతిని, లక్ష్మిని, శ్రద్ధను, మేధాదేవతను ప్రతిష్ఠించవలెను.

పూర్వదక్షిణతో వహ్ని ర్నివేశ్యః స్వాహయాసహ
విశ్వేదేవాః సగంధర్వా రుద్రాః సర్పగణా స్తథా 25
దక్షిణేన నివేశ్యస్తు యమో మిత్రశ్చ సానుగః
పితౄన్ పిశాచా నురగాన్ గుహ్యకాంశ్చ నివేశయేత్. 26

ఆగ్నేయమున స్వాహాదేవితోగూడిన అగ్నిని ప్రతిష్ఠించి, దక్షిణమున క్రమముగా విశ్వేదేవతలు, గంధర్వులు, రుద్రులు మొదలగు సకలగణములు, యముడు, అనుచరులతో

కూడికొనియున్న మిత్రుడు, పితృదేవతలు, పిశాచములు, నాగములు, గుహ్యకులు అనువారిని స్థాపించ వలెను.

నైరృత్యాం రాక్షసాంశ్చైవ భూతానిచ నివేశయేత్
పశ్చిమాయాం సముద్రాంశ్చ వరుణం యాదసాం పతిమ్. 27

వాయవ్యాం వై దిశితథా సప్తవాయూ న్నివేశయేత్
తత్రైవ వినివేశ్యస్తు గరుడః పక్షిభిఃసహ. 28

ఉత్తరస్యాం దిశి తథా ధనదం సంనివేశయేత్
నాట్యస్య మాతౄశ్చ తథా యక్షానథ సగుహ్యకాన్. 29

తథైవోత్తర పూర్వాయాం నంద్యాద్యాంశ్చ గణేశ్వరాన్
బ్రహ్మర్షి భూతసంఘాంశ్చ యథాభాగం నివేశయేత్. 30

నైఋతిమూలన రాక్షసులను, భూతములను స్థాపన చేయవలెను. పడమరదిక్కున సముద్రములను, ఉదకముల కధిపతియగు వరుణుని ప్రతిష్ఠించవలెను. వాయవ్యమున సప్త వాయువులను, పక్షులతో గరుడుని ఉంచవలెను. ఉత్తరమున కుబేరుని, సప్తనాట్యమాతృకలను, యక్షులను, గుహ్యకులను ఆవాహన చేయవలెను. ఈశాన్యమున నంది మొదలుగాగల ప్రమథగణములను, బ్రహ్మర్షులను, భూతసంఘములను ప్రతిష్ఠించవలెను.

స్తంభే సనత్కుమారంతు దక్షిణే దక్షమేవచ
గ్రామణ్య ముత్తరే స్తంభే పశ్చిమే స్కందమేవచ. 31

అనేనైవ విధానేన యథాస్థానం యథావిధి
సుప్రసాదాని సర్వాణి దైవతాని నివేశయేత్. 32

స్థానేస్థానే యథాన్యాయం వినివేశ్యతు దేవతాః
తాసాం ప్రకుర్వీత తతః పూజనంతు యథార్హతః. 33

తూర్పునగల స్తంభమందు సనత్కుమారుని, దక్షిణ స్తంభమున దక్షుని, ఉత్తర స్తంభమున విఘ్నేశ్వరుని, పశ్చిమ స్తంభమున స్కందుని ప్రతిష్ఠించవలెను. ఇదేక్రమము ననుసరించి, తత్తదుచితస్థానములలో ప్రసన్నులగు దేవతలను ప్రతిష్ఠించి, విధిపూర్వకముగా యథార్హమగు పూజాక్రమము నారంభించవలెను.

దేవతాభ్యస్తు దాతవ్యం సితమాల్యానులేపనమ్
వహ్ని గంధర్వ సూర్యేభ్యో రక్తమాల్యానులేపనమ్. 34

గంధమాల్యాంశ్చ ధూపంచ యథావ దనుపూర్వశః
దత్వా తతః ప్రకుర్వీత బలిం పూజాం యథావిధి. 35

దేవతలకు తెల్లని పూలదండను గంధమును ఇవ్వవలెను. వహ్ని, గంధర్వ సూర్యులకు ఎర్రని పూలదండను, గంధమును అర్పించవలెను. ముందు గంధము, తర్వాత పూలదండ, ఆపై ధూపము అనుక్రమము ననుసరించి యథావిధిగా బలులను, పూజను చేయవలెను.

బ్రహ్మాణం మధుపర్కేణ పాయసేన సరస్వతీమ్
శివ విష్ణు మహేంద్రాద్యాః సంపూజ్యా మోదకై రథ. 36
ఘృతౌదనేన హుతభుక్ సోమార్కౌతు గుడౌదనైః
విశ్వేదేవాః సగంధర్వా మునయో మధుపాయసైః. 37
యమ మిత్రౌచ సంపూజ్యా వపూపై ర్మోదకై స్తథా
పితౄన్ పిశాచా నురగాన్ సర్పిః క్షీరేణ తర్పయేత్. 38
పక్వాన్నేనతు మాంసేన సురా సీధు ఫలాసవైః
అర్చయే ద్భూతసంఘాంశ్చ చణకైః పలలాప్లుతైః. 39
అనేనైవ విధానేన సంపూజ్యా మత్తవారణీ
పక్వాన్నేనతు మాత్స్యేన సంపూజ్యా రక్షసాంగణాః. 40

మధుపర్కముతో బ్రహ్మను; పాయసముచే సరస్వతిని; మోదకములతో శివ విష్ణు మహేంద్రాది దేవతలను; అగ్నిని నేయికలిపిన అన్నముతోను; రవిచంద్రులను బెల్లముకలిపిన అన్నముతోను; మధుపాయసములతో మునులను, గంధర్వులను, విశ్వేదేవతలను; గారెల తోను మోదకములతోను మిత్రుని, యముని; నేతితోను పాలతోను పితృదేవతలను, పిశాచోరగములను; బాగుగా ఉడికినఅన్నములో మాంసముకలిపి కల్లుతో, పండ్లరసముతో, శనగలతో, భూతసంఘములను అర్చించవలెను. ఇదేవిధముగా మత్తవారిణినికూడ పూజించ వలెను. బాగుగా ఉడికినఅన్నములో చేపలను కలిపి రాక్షసగణములకు పూజచేయవలెను.

సురా మాంస ప్రదానేన దానవాన్ ప్రతి పూజయేత్
శేషాన్ దేవగణాం స్త్వజ్ఞః సాపూపో త్కారికౌదనైః. 41
మత్స్యైశ్చ పిష్టభక్ష్యైశ్చ సాగరాన్ సరిత స్తథా
సంపూజ్య వరుణంచాపి దాతవ్యో ఘృతపాయసః. 42
నానామూల ఫలైశ్చాపి మునీన్ సంప్రతి పూజయేత్
వాయూంశ్చ పక్షిణశ్చైవ విచిత్రై ర్భక్ష్య భోజనైః. 43
మాతౄ ర్నాట్యస్య సర్వాస్తా ధనదంచ సహానుగైః
అపూపై ర్లిపికామిశ్రై ర్భక్ష్య భోజ్యైః ప్రయత్నతః. 44
ఏవ మేషాం బలిః కార్యో నానాభోజన సంశ్రయః
పున ర్మంత్రవిధానేన బలికర్మచ వక్ష్యతే. 45

కల్లుతోను, మాంసముతోను దానవులను; శేషించిన దేవగణములను గారెలతోను, భోజనములతోను; నదీసముద్రములను చేపలతోను, పిండివంటలతోను; వరుణుని నేతితోకలసిన పాయసముతోను; నానామూలఫలాదులతో మునులను; విచిత్రములగు భక్ష్యభోజనములతో వాయువులను, పక్షులను; అనుచరులతోకూడిన కుబేరుని, నాట్యమాతృకలను గారెలతోను, భక్ష్యభోజ్యములతోను పూజించి ఈరీతిగా భోజనముతో కలసిన బలులనుచేయవలెను. ఇక మంత్ర పూర్వకమగు బలుల నెట్లు చేయవలెనో చెప్పదలచి దేవతాస్తుతిశ్లోకములను చెప్పుచున్నాడు.

"దేవదేవ మహాదేవ సర్వలోక పితామహ
మంత్రపూత మిదం సర్వం ప్రతిగృహ్ణీష్వ మే బలిమ్. 46
పురందరామరపతే వజ్రపాణే శతక్రతో
ప్రగృహ్యతాం బలిర్దేవ విధిమంత్ర పురస్కృతః. 47
దేవసేనాపతే స్కంద భగవన్ శంకరప్రియ
బలిః ప్రీతేన మనసా షణ్ముఖ ప్రతిగృహ్యతామ్. 48
నారాయణా మితగతే పద్మనాభ సురోత్తమ
ప్రగృహ్యతాం బలిర్దేవ మంత్రపూతో మయార్పితః. 49
దేవదేవ మహాదేవ గణేశ త్రిపురాంతక
ప్రగృహ్యతాం బలిర్దేవ మంత్రపూతో మయోద్యతః. 50
దేవదేవ మహాయోగిన్ దేవదేవ సురోత్తమ
సంప్రగృహ్య బలిం దేవ రక్ష విఘ్నా త్సదోత్థితాత్. 51
దేవదేవి మహాభాగే సరస్వతి హరిప్రియే
ప్రగృహ్యతాం బలి ర్మాత ర్మయా భక్త్యా సమర్పితః. 52
నానా నిమిత్త సంభూతాః పౌలస్త్యాః సర్వఏవ తే
రాక్షసేంద్రా మహాసత్త్వాః ప్రతిగృహ్ణీత మే బలిమ్. 53
లక్ష్మీః సిద్ధి ర్మతి ర్మేధా సర్వలోక నమస్కృతాః
మంత్రపూత మిమం దేవ్యః ప్రతిగృహ్ణంతు మే బలిమ్." 54

"దేవతలకు దేవుడవు, మహాదేవుడవు, సకలజగత్తుకు పితామహుడవగు బ్రహ్మ! ఈ బలి మంత్రముచే పవిత్రము చేయబడినది. దీనిని స్వీకరించుము."

"పురందర, అమరపతి, వజ్రపాణి, శతక్రతుడవు నగు ఇంద్రుడా! విధిపూర్వకముగా మంత్రములచే పరిష్కరింపబడిన ఈ బలిని గ్రహించుము."

"శంకరునకు ప్రియుడవు, దేవసేనాపతి, భగవానుడవు, షణ్ముఖుడవు నగు కుమారస్వామీ! ప్రీతిపూర్వకమగు మనస్సుతో నీ బలిని గైకొనుము."

"త్రివిక్రముడవు, పద్మనాభుడవు, దేవతలలో శ్రేష్ఠుడవు నగు విష్ణుదేవా! మంత్రపూతమై నాచే నీయబడు బలిని గ్రహించుము."

"దేవదేవుడవు, మహాదేవుడవు, త్రిపురాంతకుడవు, ప్రమథగణనాయకుడవు నగు నో శివా! మంత్రపూతమై నాచే నర్పింపబడు బలిని స్వీకరింపుము."

"దేవదేవ! మహాయోగీ! సురోత్తమ! బలిని స్వీకరించి, విఘ్నములనుండి నీ నాట్యగృహమును రక్షింపుము."

"దేవదేవి, హరిప్రియ, సౌభాగ్యవతి, మాతృదేవియు నగు నో సరస్వతీ! నాచే [illegible] సమర్పింపబడిన బలిని గైకొనుము."

"వివిధకారణములచే పులస్త్యబ్రహ్మవంశమున జన్మించి అమితబలముగలిగిన సమస్త రాక్షసులారా! నా బలులను గ్రహింపుడు."

"సమస్తజగత్తుచేత నమస్కరింపబడు లక్ష్మి, సిద్ధి, మతి, మేధా యను దేవతలారా! మంత్రపూతమైన ఈ బలిని స్వీకరింపుడు."

"సర్వభూతానుభావజ్ఞ లోకజీవనమారుత
ప్రగృహ్యాతాం బలిర్దేవ మంత్రపూతో మయోద్యతః. 55
దేవవక్త్ర సురశ్రేష్ఠ ధూమకేతో హుతాశన
భక్త్యా సముద్యతో దేవ బలిః సంప్రతిగృహ్యతామ్. 56
సర్వగ్రహాణాం ప్రవర తేజోరాశే దివాకర
భక్త్యా మయోద్యతో దేవ బలిః సంప్రతిగృహ్యతామ్. 57
సర్వగ్రహపతే సోమ ద్విజరాజ జగత్ప్రియ
ప్రగృహ్యతా మేష బలి ర్మంత్రపూతో మయోద్యతః. 58
మహాగణేశ్వరాః సర్వే నందీశ్వర పురోగమాః
ప్రగృహ్యాతాం బలి ర్భక్త్యా మయా సంప్రతిచోదితః. 59
నమః పితృభ్యః సర్వేభ్యః ప్రతిగృహ్ణ న్త్విమం బలిమ్
భూతేభ్యశ్చ నమోనిత్యం యే షా మేష బలిఃప్రియః. 60
కామపాల నమోనిత్యం యస్యాయం తే విధిః కృతః
నారద స్తుంబురుశ్చైవ విశ్వావసు పురోగమాః. 61
ప్రతిగృహ్ణంతు మే సర్వే గంధర్వా బలిముద్యతమ్
యమో మిత్రశ్చ భగవాన్ ఈశ్వరౌ లోకపూజితౌ. 62
ఇమం మే ప్రతిగృహ్ణీతాం బలిం మంత్రపురస్కృతమ్
రసాతలగతేభ్యశ్చ పన్నగేభ్యో నమోనమః. 63
దిశంతు సిద్ధిం నాట్యస్య పూజితాః పాపనాశనాః"

"సకలప్రాణులచే ననుభవింపబడునది, లోకమునకు జీవముపోయునది యగు నో మారుతమా! మంత్రపూతమగు నీ బలిని గైకొనుము."

"దేవతాముఖము, దేవతలలో శ్రేష్ఠుడు, ధూమకేతువు, హుతాశనుడవు నగు అగ్నిదేవుడా! భక్తితో నర్పింపబడు ఈ బలిని పుచ్చుకొనుము."

"సకలగ్రహములలో శ్రేష్ఠుడవు, తేజోరాశివి, దివాకరుడవు నగు సూర్యభగవానుడా! భక్తితో నర్పింపబడిన ఈ బలిని గ్రహించుము."

"సకలగ్రహములకు నాయకుడవు, ద్విజరాజువు, జగత్ప్రియుడవు నగు చంద్రుడా! మంత్రపూతమై నాచే నర్పింపబడు ఈ బలిని తీసికొనుము."

"నందీశ్వరుడు నాయకుడుగా గల మహాగణేశ్వరులారా! భక్తితో నాచే నివేదింపబడు బలిని స్వీకరింపుడు."

"సకల పితృదేవతలకు నమస్కారములు. వారీ బలిని స్వీకరింతురు గాక!"

"ఈ బలి యనిన ప్రీతిగల భూతగణములకు సదా నమస్కారములు."

"ఎవనికొరకై ఈ బలివిధానము చేయబడినదో అట్టి కామపాలునకు సదా నమస్కారము"

"విశ్వావసువు నాయకుడుగా గల గంధర్వులారా! తుంబుర నారదులారా! నా బలిని స్వీకరింపుడు."

"ఈశ్వరులు, లోకపూజితులు నగు యమమిత్ర దేవతలారా! మంత్రపురస్కృతమైన ఈ నా బలిని గ్రహింపుడు."

"రసాతలమున వసించు పన్నగములకు నమస్కారములు. పాపమును నశింపజేయు ఈ పన్నగములు నాచే పూజింపబడినవై నాట్యమునకు సిద్ధిని చేకూర్చు గాక!"

"సర్వాం భసాం పతిర్దేవో వరుణో హంసవాహనః. 64
పూజితః ప్రీతిమానస్తు స సముద్ర నదీ నదః
వైనతేయ మహాసత్త్వ సర్వపక్షిపతే విభో. 65
ప్రగృహ్యాతాం బలిర్దేవ మంత్రపూతో మయోద్యతః
ధనాధ్యక్షో యక్షపతి ర్లోకపాలో ధనేశ్వరః. 66
సగుహ్యక స్సయక్షశ్చ ప్రతిగృహ్ణాతు మే బలిమ్
నమోఽస్తు నాట్యమాతృభ్యో బ్రాహ్మ్యాద్యాభ్యో నమోనమః. 67
సుముఖీభిః ప్రసన్నాభి ర్బలి స్సంప్రతిగృహ్యాతామ్
రుద్రప్రహరణం సర్వం ప్రతిగృహ్ణాతు మే బలిమ్. 68
విష్ణుప్రహరణంచైవ విష్ణుభక్త్యా మయోద్యతమ్
తథా కృతాంతః కాలశ్చ సర్వప్రాణి వధేశ్వరా. 69
మృత్యుశ్చ నియతిశ్చైవ ప్రతిగృహ్ణాతు మే బలిమ్
యాశ్చాస్యాం మత్తవారణ్యాం సంశ్రితా వాస్తుదేవతాః. 70
మంత్రపూత మిమం సమ్యక్ ప్రతిగృహ్ణంతు మే బలిమ్
అన్యే యే దేవ గంధర్వా దిశో దశ సమాశ్రితాః. 71
దివ్యాంతరిక్ష భౌమాశ్చ తేభ్య శ్చాయం బలిః కృతః"

"సమస్త ఉదకముల కధిదైవతము, హంస వాహనముగా కలవాడు నగు వరుణదేవుడు పూజింపబడినవాడై నదీనద సముద్రములతో సహా ప్రీతుడగు గాక!"

"సకల పక్షిజాతికి ప్రభువు, మహాబలము గలవాడు, వైనతేయుడు నగు గరుడుడా! మంత్రపూతమై నాచే సర్పింపబడిన బలిని గ్రహింపుము."

"యక్షుల ప్రభువు, లోకపాలుడు, ధనాధిపతి, ధనేశ్వరుడు నగు కుబేరుడు యక్ష గుహ్యకులతో కలసి నా బలిని స్వీకరించు గాక!"

"బ్రాహ్మీ మొదలగు నాట్యమాతలకు నమస్కారములు. సుముఖులై, ప్రసన్నులై వీరు బలులను గైకొందురు గాక!"

"రుద్రుని ఆయుధములన్నియు నా బలులను గ్రహించుగాక!"

"కృతాంతుడు, కాలము, సకలజీవుల ప్రాణముల తీసికొనిపోవు మృత్యువు, నియతి నా బలిని గ్రహింతురు గాక!"

"మత్తవారిణిని నాశ్రయించుకొనియున్న వాస్తుదేవతలు మంత్రపూతమగు నా బలిని స్వీకరింతురు గాక!"

"పదిదిక్కులలోను, ద్యులోకభూలోకాంతరిక్షలోకములలోను గల శేషించిన దేవతలు గంధర్వులుకూడ నా బలులను గ్రహించెదరు గాక!"

కుంభం సలిలసంపూర్ణం పుష్పమాలా పురస్కృతమ్. 72
స్థాపయే ద్రంగమధ్యేతు సువర్ణంచాత్ర దాపయేత్
ఆతోద్యానితు సర్వాణి కృత్వా వస్త్రోత్తరాణితు. 73
గంధమాల్యైశ్చ ధూపైశ్చ భక్ష్యై ర్భోజ్యైశ్చ పూజయేత్

ఆవాహిత దేవతాస్తుతులైన తర్వాత ఉదకముతో నిండిన కలశములో బంగారము వేసి, కలశమును పూలమాలతో అలంకరించి రంగమధ్యమున స్థాపించవలెను. వాద్యములకన్నిటికి వస్త్రములను కప్పి గంధమాల్యధూపములతోను, భక్ష్యభోజ్యములతోను పూజించవలెను.

పూజయిత్వాతు సర్వాణి దైవతాని యథాక్రమమ్. 74
జర్జర స్త్వభిసంపూజ్యః స్యాత్తతో విఘ్నజర్జరః
శ్వేతం శిరసి వస్త్రంస్యా న్నీలం రౌద్రేచ పర్వణి. 75
విష్ణుపర్వణివై పీతం రక్తం స్కందస్య పర్వణి
మూలపర్వణి చిత్రంతు దేయం వస్త్రం హితార్థినా. 76
సదృశంచ ప్రదాతవ్యం ధూపమాల్యానులేపనమ్
ఆతోద్యానిచ సర్వాణి వాసోభి రవగుంఠయేత్. 77
గంధై ర్మాల్యైశ్చ ధూపైశ్చ భక్ష్య భోజ్యైశ్చ పూజయేత్

ఒకరితర్వాత నొకరిని వరుసగా దేవతలనందరిని పూజించి, విఘ్నములు నశించుటకై తదుపరి జర్జరమనబడు ధ్వజమును పూజించవలెను. ఈ ధ్వజముయొక్క అగ్రపర్వమున తెల్లనివస్త్రమును, రెండవపర్వమున నీలవస్త్రమును, మూడవపర్వమున పసుపువస్త్రమును, నాల్గవపర్వమున ఎర్రనివస్త్రమును, అన్నిటికన్న క్రిందగల ఐదవపర్వమున చిత్రవస్త్రమును ఉంచవలెను. ఆ యా పర్వములకు సదృశమగు ధూప మాల్యానులేపనముల నర్పించవలెను. తర్వాత ఆతోద్యాదివాద్యములపై కప్పబడిన వస్త్రములను తొలగించవలెను. ఆపై గంధ మాల్య ధూపములతోను, భక్ష్యభోజ్యములతోను పూజించవలెను.

సర్వమేవం విధిం కృత్వా గంధమాల్యానులేపనైః. 78
విఘ్నజర్జరణార్థంతు జర్జరం త్వభిమంత్రయేత్
"అత్ర విఘ్నవినాశార్థం పితామహముఖై స్సురైః. 79

నిర్మిత స్త్వం మహావీర్యో వజ్రసారో మహాతనుః
శిర స్తే రక్షతు బ్రహ్మా సర్వై ర్దేవగణైస్సహ. 80
ద్వితీయంతు హరః పాతు తృతీయంచ జనార్దనః
చతుర్థంచ కుమారశ్చ పంచమం పన్నగోత్తమాః. 81
నిత్యం సర్వేఽపి పాంతు త్వాం పున స్త్వంచ శివోభవ
నక్షత్రేఽభిజితి శ్రేష్ఠే జాత స్త్వ మరిషూదనః. 82
జయంచాభ్యుదయంచైవ పార్థివస్య సమావహ"

ఈ విధానము ననుసరించి గంధమాల్యానులేపనములతో ధ్వజమును పూజించి, విఘ్న వినాశముకొరకై ధ్వజము నీ క్రిందిరీతిగా నభిమంత్రించవలెను— "విఘ్నములను నశింపజేయుటకు బ్రహ్మ ఆదేశానుసారము దేవతలచే నిర్మింపబడితివి. మహాబలముకలిగి, వజ్రసారమైన మహాశరీరము కలిగియున్నావు. నీ శిరమును దేవతాగణములతోసహ బ్రహ్మ, రెండవపర్వమును శివుడు, మూడవపర్వమును విష్ణువు, నాలుగవపర్వమును కుమారస్వామి, ఐదవపర్వమును పన్నగశ్రేష్ఠులు, ఎల్లప్పుడు నిన్ను అందరు దేవతలు రక్షించుదురుగాక! నీవు శుభప్రదుడవు కమ్ము. శ్రేష్ఠమగు అభిజిన్నక్షత్రమున శత్రుసంహారకర్తవై జన్మించితివి. రాజునకు జయమును, అభివృద్ధిని సంపాదించుము."

జర్జరం పూజయిత్వాచ బలిం సర్వాం నివేద్యచ. 83
అగ్నౌ హోమం తతః కుర్యా న్మంత్రాహుతి పురస్కృతమ్
హుత్వా సవవ దీప్తాభి రుల్కాభిః పరిమార్జనమ్ 84
నృపతే ర్నర్తకీనాంచ కుర్యా ద్దీప్త్యభి వర్ధనమ్,
అభిద్యోత్య సహాతోద్యై ర్నృపతిం నర్తకీంతథా. 85
మంత్రపూతేన తోయేన పునరభ్యుక్ష్య తా వదేత్
"మహాకులే ప్రసూతాః స్థ గుణౌఘై శ్చాప్యలంకృతాః. 86
య ద్వో జన్మగుణోపేతం తద్వై భవతు నిత్యశః"
ఏవముక్త్వా తతో వాక్యం నృపతే ర్యాత్రయే బుధః. 87
నాట్యయోగప్రసిద్ధ్యర్థ మాశిష స్సంప్రయోజయేత్

ధ్వజమును పూజించి, బలులను నివేదనలను సమర్పించి, మంత్రాహుతులతో అగ్నియందు హోమము చేయవలెను. అప్పుడు ప్రదీపించుచున్న అగ్నిజ్వాలలతో ధ్వజమునకు పరిమార్జనము గావించి, రాజునకు, నర్తకురాండ్రకు ప్రదీప్తమగు నభివృద్ధికల్గునట్లు చేయించవలెను. రాజునకు, నర్తకికి వాద్యములను చూపెట్టి, మంత్రపూతములగు ఉదకములను వాటిపై మరల చల్లి ఇట్లనవలెను—"మహావంశమున జన్మించినవి; సద్గుణసమూహములచే నలంకరింపబడినవియు నగు వాద్యములివి. మీ రేవిధమగు సద్గుణసంపన్నమైన వంశమున జన్మించినారో, అట్టి గుణములతో నెల్లపుడు ఉండెదరుగాక!" రాజునకు సంపద నభిలషించి ఈ రీతిగా పలికి, నాట్యయోగమ్ము ప్రసిద్ధిచెందుటకు తర్వాత ఆశీర్వాదవాక్యముల నుచ్చరించవలెను.

"సరస్వతీ ధృతి ర్మేధా హ్రీః శ్రీ ర్లక్ష్మీ స్మతి స్తథా. 88
పాంతు వో మాతరః సౌమ్యా స్సిద్ధిదాశ్చ భవంతు వః"

"సరస్వతి, ధృతి, మేధా, హ్రీ, శ్రీ, లక్ష్మీ, మతి అనబడు నేడుగురు సౌమ్యలు, కార్యసిద్ధిని చేకూర్చువారు నగు నాట్యమాతృకలు మిమ్ములను రక్షించెదరుగాక!"

హోమంకృత్వా యథాన్యాయం హవి ర్మంత్రపురస్కృతమ్. 89
భింద్యా త్కుంభం తతశ్చైవ నాట్యాచార్యః ప్రయత్నతః
అభిన్నేతు భవేత్కుంభే స్వామినః శత్రుతో భయమ్. 90
భిన్నేత్వైవతు విజ్ఞేయః స్వామినః శత్రుసంక్షయః
భిన్నే కుంభే తతశ్చైవ నాట్యాచార్యః ప్రయత్నతః. 91
ప్రగృహ్య దీపికాం దీప్తాం సర్వం రంగం ప్రదీపయేత్
క్ష్వేడితైః స్ఫోటితైశ్చైవ వల్గితైశ్చ ప్రధావితైః. 92
రంగమధ్యేతు తాం దీప్తాం సశబ్దాం సంప్రయోజయేత్

మంత్రములతోను, ఆహుతులతోను శాస్త్రప్రకారము హోమముచేసి మధ్యనుంచిన కుంభమును నాట్యాచార్యుడు ప్రయత్నముతో పగులగొట్టవలెను. కుంభము పగులనిచో ప్రభువునకు శత్రువులనుండి భయము, పగిలినచో శత్రునాశనము జరుగగలవు. ప్రయత్నముతో కుంభమును పగులగొట్టినతర్వాత ప్రజ్వరిల్లుచున్న దీపికను తీసికొని నాట్యరంగమునంతట దీపములను వెలిగించవలెను. త్వరత్వరగా నొకదివ్వెనుండి మరొక దివ్వెవద్దకు పోవుచు వివిధ ధ్వనులను చేయుచు చివరకు రంగమధ్యమున దీపిక నుంచవలెను.

శంఖ దుందుభి నిర్ఘోషై ర్మృదంగ పణవై స్తథా. 93
సర్వాతోద్యైః ప్రణదితై రంగే యుద్ధాని కారయేత్
తత్రి ఛిన్నంచ భిన్నంచ దారితంచ సశోణితమ్. 94
క్షతం ప్రదీప్త మాయస్తం నిమిత్తం సిద్ధిలక్షణమ్
సమ్య గిష్టస్తు రంగోవై స్వామినః శుభమావహేత్. 95
పున స్సబాలవృద్ధస్య తథా జనపదస్యచ
దురిష్టస్తు తథా రంగో దేవతై ర్దురధిష్ఠితః. 96
నాట్యవిధ్వంసనం కుర్యా న్నృపస్యచ తథాశుభమ్
య ఏవం విధిముత్సృజ్య యథేష్టం సంప్రయోజయేత్. 97
ప్రాప్నో త్యపచయం శీఘ్రం తిర్యగ్యోనించ గచ్ఛతి

శంఖ దుందుభులు, మృదంగపణవాది వాద్యవిశేషములు మ్రోగుచుండగా నాట్యరంగమున సంతోషప్రదమగుయుద్ధముల నాడవలెను. అనగా శివమెత్తినట్లు నర్తించవలెను. రక్తము కారుట, గీకబడుట, గాయములు తగులుట, ఛిన్నమగుట, భిన్నమగుట మొదలగునవి నాట్యరంగమున బయలుదేరి రంగమంతయు ప్రదీప్తమై [illegible] నాట్యగృహమునకు కార్యసిదిని చేకూర్చగలవు. ప్రజలకు నీ కృత్యము ఇష్టమై సంతోషమును గల్గించిన నాట్యాచార్యునకు,

ప్రిభువునకు. శుభమగు నాట్యగృహము కాగలదు. బాలురకు, వృద్ధులకు, జానపదులకు నిది సంతోషము కల్పించకపోయినను, సక్రమముగా దేవతలు ప్రతిష్ఠింపబడనిచో నాట్యవిధ్వంసనము జరుగును. రాజునకు అశుభముకూడ కలుగును. ఈ పై విధానమును వదలి యథేష్టముగా నాట్యగృహమును నిర్మించినచో నాట్యాచార్యుడు క్షీణదశకుపోయి, పశువై జన్మించగలడు.

యజ్ఞేన సంమతం హ్యేత ద్రంగదైవత పూజనమ్. 98
అపూజయిత్వా రంగంతు నైవప్రేక్షాం ప్రయోజయేత్
పూజితాః పూజయ న్త్యేతే మానితా మానయంతిచ. 99
తస్మాత్సర్వప్రయత్నేన కర్తవ్యం రంగపూజనమ్
న తథాశు దహత్యగ్నిః ప్రభంజన సమీరితః. 100
యథా హ్యాపప్రయోగస్తు ప్రయుక్తో దహతిక్షణాత్
శాస్త్రజ్ఞేన వినీతేన శుచినా దీక్షితేనచ. 101
నాట్యాచార్యేణ శాంతేన కర్తవ్యం రంగపూజనమ్

ఈ రంగదైవతపూజనము యజ్ఞముతో తుల్యమైనది. అందుచే రంగపూజ లేకయే నాట్యప్రయోగమును చేయరాదు. రంగదైవతములను పూజించి గౌరవించినచో వారుకూడ నాట్యమునకు పూజాగౌరవములు వచ్చునట్లు చేయుదురు. అందుచే సర్వప్రయత్నములనుచేసి రంగపూజనమును తప్పక సలుపవలెను. నాట్యప్రయోగము అప్రయోగమైనచో నొక్క త్రుటికాలములో నది దహించగలదు. వాయువుచే ప్రేరేపింపబడిన అగ్నికూడా అంత త్వరగా దహించలేదు. అందుచే శాస్త్రజ్ఞుడు, వినీతుడు, శుచి, దీక్షితుడు, శాంతుడు నగు నాట్యాచార్యుడు రంగదైవతపూజను చేసితీరవలయును.

స్థానభ్రష్టంతు యో దద్యా ద్బలి ముద్విగ్న మానసః. 102
మంత్రహీనో యథా హోతా ప్రాయశ్చిత్తీ భవేత్తు సః
ఇత్యయం యో విధిర్దృష్టో రంగదైవతపూజనే. 103
నవే నాట్యగృహే కార్యః ప్రేక్షాయాంచ ప్రయోక్తృభిః. 104

ఇతి శ్రీభారతీయే నాట్యశాస్త్రే రంగదైవతపూజనంనామ తృతీయోఽధ్యాయః.

అవహితమనస్కుడుగాని నాట్యాచార్యుడు బలులను సక్రమముగుస్థానములలో నొసగనిచో మంత్రహీనుడైన హోతవలె యగును. అందుచే ప్రాయశ్చిత్తము చేసికొనవలెను.

రంగదైవతపూజయందీరీతిగా నే యే విధులు చెప్పబడినవో అవన్నియు క్రొత్త నాట్యగృహమున ప్రప్రథమనాట్యప్రయోగమునకు ముందుగా చేయబడవలసియున్నవి.

శ్రీ భరతముని ప్రణీతమగు భారతీయ నాట్యశాస్త్రమున ఆంధ్రభారతియందు రంగదైవతపూజన మనబడు మూడవ అధ్యాయము.

## చతుర్థోఽధ్యాయః

# తాండవలక్షణమ్

ఏవంతు పూజనం కృత్వా మయా ప్రోక్తః పితామహః
"ఆజ్ఞాపయ విభో క్షిప్రం కః ప్రయోగః ప్రయుజ్యతామ్."

## ఆంధ్రభారతి

రంగదైవతపూజ యైనతర్వాత "ఏ నాట్యప్రయోగమును ప్రయోగించవలెనో వెంటనే ఆజ్ఞాపింపుడు" అని బ్రహ్మను భరతు డడిగెను. రంగపూజ కాగనే నాట్యప్రయోగము జరుగ వలెను. మధ్య విలంబ మేమాత్రము తగదు.

తతోఽస్మ్యుక్తో భగవతా యోజయా మృతమంథనమ్
ఏత దుత్సాహజననం సురప్రీతికరం తథా. 2

యోఽయం సమవకారస్తు ధర్మకామార్థ సాధకః
మయా ప్రగథితో విద్వన్ స ప్రయోగః ప్రయుజ్యతామ్. 3

"అమృతమంథన మను సమవకారమును ప్రయోగించుము. ఇది దేవతలకు ప్రీతిప్రద మని, ఉత్సాహకరమని, ధర్మార్థకామములకు సాధకమని దీనిని నేనే కూర్చితిని. నాట్యముతో నీ సమవకారమును ప్రయోగించుము" అని భరతుని ఆదేశించెను.

నాలుగు విధముల నాయకులకు స్థాయిభావ మగు ఉత్సాహమును సంపాదింపజేయు వీరరసాత్మకమైన దీ సమవకారము. సాక్షాత్కారకల్పత్వమును తీసికొనివచ్చుటకు తగినట్లు గావించబడిన ఈ ప్రయోగమున రసచర్వణ గలుగగలదు. ఇది దృశ్యము, శ్రవ్యము నగు ప్రయోగవిశేషము. ప్రఖ్యాతమైన ఉదాత్తనాయకులతో దేవాసురవిషయక మగు కథను చెప్పు సమవకారము అర్థమును పూర్తి వ్యక్తపరుచునది. ఇచట ఒక అంకమునకు మరొక అంకమునకు సంబంధము చక్కగా లేకపోవుటచే అవకీర్ణముగా నుండును గనుక సమవకార మని చెప్పబడుచున్నది.

తస్మిన్ సమవకారేతు ప్రయుక్తే దేవదానవాః
హృష్టాః సమభవన్ సర్వే కర్మభావానుదర్శనాత్. 4

ఈ సమవకారము ప్రయోగింపబడగా కర్మభావములు వ్యక్తములైనవి. అపుడు దేవతలు దానవులు సంతోషించిరి.

కస్యచి త్త్వథ కాలస్య మామాహాంబుజసంభవః
"నాట్యం సందర్శయామోఽద్య త్రినేత్రాయ మహాత్మనే." 5

తతః సార్థం సురైర్గత్వా వృషభాంక నివేశనమ్
సమభ్యర్చ్య శివం పశ్చా దువాచేదం పితామహః, 6

"మయా సమవకారస్తు యోఽయం సృష్టః సురోత్తమ
శ్రవణే దర్శనే చాస్య ప్రసాదం కర్తు మర్హసి." 7

"పశ్యామ" ఇతి దేవేశో ద్రుహిణం వాక్య మబ్రవీత్
తతో మామాహ భగవాన్ "సజ్జో భవ మహామతే". 8

కొంతకాలము గడచిన తర్వాత "మహాత్ముడగు శివునకీ నాట్యమును చూపించెదము" అని బ్రహ్మ భరతునితో పల్కెను. అప్పుడు శివుని నివాసగృహమునకు దేవత లందరితో నేగి, శివుని పూజించి బ్రహ్మ ఇట్లనెను — "నాచే సృష్టింపబడిన సమవకారమును చూచుటకు, వినుటకు మీ రనుగ్రహింపవలెను." ఈ మాటలకు "అట్లే చూచెదము" అని శివుడా బ్రహ్మతో పల్కగా, "నీవు సిద్ధము గావలసినది" అని భరతుని బ్రహ్మ ఆదేశించెను.

నాట్యప్రయోగమును మొట్టమొదట నాట్యము తెలిసినవారికే చూపవలెను. గనుక నటరాజగు శివుని సభాపతిగా చేసినారు. కాని ఒకసారి ప్రయోగించిన విషయమును సభాపతి ముందు ప్రయోగించరాదు గనుక సమవకారముతోబాటు డిమమును గూడ ప్రయోగించినా రని తర్వాత చెప్పబడుచున్నది. నాట్యమును పరీక్షించుటకు వచ్చువారికి కవియే మొదట కావ్యమును వినుపింపవలెను గనుక బ్రహ్మయే స్వయముగా వచ్చినాడు.

తతో హిమవతః పృష్ఠే నానానగసమాకులే
బహు చూతద్రుమాకీర్ణే రమ్యకందర నిర్ఝరే 9

పూర్వరంగే కృతే పూర్వం తత్రాయం ద్విజసత్తమాః
తథా త్రిపురదాహశ్చ డిమసంజ్ఞః ప్రయోజితః. 10

వివిధపర్వతములతో సమాకీర్ణమై, అనేక మామిడిచెట్లతో నిండి, అందమగు నదులు ప్రవహించు లోయవద్ద, హిమవత్పర్వతముపై పూర్వరంగమును గావించి, అమృతమంథన మను సమవకారమును, త్రిపురదాహ మను డిమమును భరతుడు ప్రయోగింపజేసెను. పరీక్షకుడగు శివుని సంతోషపరచుటకై త్రిపురదాహమును ప్రయోగించిరి.

తతో భూతగణాహృష్టాః కర్మభావానుకీర్తనాత్
మహాదేవశ్చ సుప్రీతః పితామహ మథాబ్రవీత్. 11
"అహో నాట్య మిదం సమ్యక్ త్వయా సృష్టం మహామతే
యశస్యంచ శుభార్థంచ పుణ్యాం బుద్ధివివర్ధనమ్. 12
మయాపీదం స్మృతం నృత్యం సంధ్యాకాలేషు నృత్యతా
నానాకరణ సంయుక్తై రంగహారై ర్విభూషితమ్. 13
పూర్వరంగవిధా వస్మిం స్త్వయా సమ్యక్ ప్రయోజ్యతామ్
మహాగీతేషు చైవార్థాన్ సమ్యగే వాభినేష్యసి. 14
యశ్చాయం పూర్వరంగస్తు త్వయా శుద్ధః ప్రయోజితః
ఏత ద్విమిశ్రితశ్చాయం చిత్రో నామ భవిష్యతి". 15

ఈ ప్రయోగములందలి కర్మభావముల అనుకీర్తనచే ప్రమథాది భూతగణములు సంతోషింపగా శివుడుగూడ ప్రీతుడై బ్రహ్మతో నిట్లనియె: "మహామతివైన నీచే నీనాట్యప్రయోగము చక్కగా సృష్టించ బడినది. ఇది కీర్తిప్రదము, శుభార్థముతో కూడినది, పుణ్యమైనది. బుద్ధిని వృద్ధిచేయునది, సంధ్యాకాలముల యందు నృత్యము చేయుచున్న నాచే గూడ నీ నృత్యమే స్మరించబడినది. నూటఎనిమిది కరణములతోను, ముప్పదిరెండు అంగహారములతోను అలంకరింప బడిన పూర్వరంగవిధిని ప్రయోగించవలెను. అప్పుడే మహాగీతములలోని అర్థమును చక్కగా అభినయింపగలవు. ఇప్పుడు నీచే శుద్ధపూర్వరంగమే ప్రయోగింపబడినది. దీనిని కరణాంగహారములతో కలిపిచేసిన చిత్రపూర్వరంగము కాగలదు."

ఈ నృత్యమును శివుడు సంధ్యాకాలమున స్మరించినాడు. నృత్య మనాదికాలము నుండి వచ్చుచున్న దని భావము. నృత్యము శివుని ఆదరాభిమానముల నందిన దని తెల్పుటకే సంధ్యాకాలములయం దని చెప్పబడినది.

అంగహారముల ద్వారా నృత్తఫలము సిద్ధించును. వీటి అంగములను కరణము లందురు. ప్రత్యాహారము మొదలుగా గల తొమ్మిది అంతర్యవనికాంగములతోను, గీతక మహాగీతక రచనాంతకమైన పది అంగములతోను, నృత్తము లేకుండా భరతునిచే ప్రయోగింపబడిన పూర్వరంగము శుద్ధ మని పిలువబడును. ఉద్ధతమైన చిత్ర పూర్వరంగమున శివుని తాండవవిధిలో చెప్పబడు కరణాంగహారము లుండగలవు. సుకుమారమైన చిత్ర పూర్వరంగమున దేవీకృతములగు అనుద్ధతములైన అంగహారములే ఉండగలవు. గీతకవర్ధమానాది రూపమున మహాగీత ముండును.

శ్రుత్వా మహేశ్వరవచః ప్రత్యుక్తంతు స్వయంభువా
"ప్రయోగ మంగహారాణా మాచక్ష్వ సురసత్తమ" 16
తత స్తణ్డుం సమాహూయ ప్రోక్తవాన్ భువనేశ్వరః
"ప్రయోగ మంగహారాణా మాచక్ష్వ భరతాయవై". 17
తతో యే తండునా ప్రోక్తా స్త్వంగహారా మహాత్మనా
నానాకరణ సంయుక్తాన్ వ్యాఖ్యాస్యామి సరేచకాన్. 18

మహేశ్వరుని వాక్యముల నాలకించి "అంగహారముల ప్రయోగమును చెప్పవలసినది" అని బ్రహ్మ ప్రార్థించెను. శివుడు నందీశ్వరుడగు తండుని పిలచి "అంగహారముల ప్రయోగమును భరతునకు నేర్పుము" అని ఆజ్ఞాపించెను. వివిధకరణములతో కూడిన అంగహారములను, రేచకములను మహాత్ముడగు నందీశ్వరునిచే చెప్పబడిన రీతిగా నిక భరతుడు చెప్పుచున్నాడు.

నందీశ్వరుడగు తండునిచే చెప్పబడుటచే నిది తాండవ మనబడుచున్నది.

స్థిరహస్తోఽంగహారస్తు తథా పర్యస్తకః స్మృతః
సూచీవిద్ధస్తథా చైవ హ్యపవిద్ధస్తథైవచ. 19
ఆక్షిప్తకస్తు విజ్ఞేయస్తథా చోద్ఘట్టితః స్మృతః.
విష్కంభశ్చైవ సంప్రోక్తస్తథా చై వాపరాజితః. 20
విష్కంభాపసృతశ్చైవ మత్తాక్రీడస్తథైవ చ
స్వస్తికో రేచితశ్చైవ పార్శ్వస్వస్తిక ఏవ చ. 21
వృశ్చికశ్చైవ సంప్రోక్తో భ్రమరశ్చ తథాపరః
మత్తస్ఖలితకశ్చైవ మదాద్విలసిత స్తథా. 22
గతిమండల ఏవాథ పరిచ్ఛిన్నస్తథైవ చ
పరివృత్తరేచితః స్యాత్తథా వైశాఖరేచితః. 23
పరావృత్తోఽథ విజ్ఞేయస్తథా చైవా ప్యలాతకః
పార్శ్వచ్ఛేదోఽథ సంప్రోక్తో విద్యుద్భ్రాంతస్తథైవచ 24
ఊరూద్వృత్తస్తథా చైవ స్యాదాలీఢస్తథైవ చ
రేచితశ్చాపి విజ్ఞేయస్తథైవాచ్ఛురితః స్మృతః. 25
ఆక్షిప్తరేచితశ్చైవ సంభ్రాంతశ్చ తథాపరః
అపసర్పస్తు విజ్ఞేయస్తథా చార్ధనికుట్టకః. 26
ద్వాత్రింశ దేతే సంప్రోక్తా అంగహారాస్తు నామతః
ఏతేషాంతు ప్రవక్ష్యామి ప్రయోగం కరణాశ్రయమ్. 27

స్థిరహస్త, పర్యస్తక, సూచీవిద్ధ, అపవిద్ధ, ఆక్షిప్తక, ఉద్ఘట్టిత, విష్కంభ, అపరాజిత, విష్కంభాపసృత, మత్తక్రీడ, స్వస్తికరేచిత, పార్శ్వస్వస్తిక, వృశ్చికాపసృత, భ్రమర, మదస్ఖలిత, మదవిలసిత, గతిమండల, పరిచ్ఛిన్న, పరివృత్తరేచిత, వైశాఖరేచిత, పరావృత్త, అలాతక, పార్శ్వచ్ఛేద, విద్యుద్భ్రాంత, ఉద్వృత్తక, ఆలీఢ, రేచిత, ఆచ్ఛురిత, ఆక్షిప్తరేచిత, సంభ్రాంత, అపసర్పిత, అర్ధనికుట్టక మను ముప్పదిరెండును అంగహారముల పేర్లు. కరణముల కలయికచే అంగహారము లేర్పడును గాన కరణముల లక్షణములు ముందు చెప్పబడుచున్నవి.

కరణములు నూటయెనిమిది గలవు. వీటి సంయోగముచే ననేకాంగహారములు సిద్ధించగలవు. కాని వీటిలో అరువదినాలుగు కరణముల సంయోగముచే సిద్ధించువానిలో నతి ముఖ్యమైన అంగహారములు ముప్పదిరెండు. అంగములకు కరణముల సముచిత పరిణామము వలన

కలుగు రూపముల కంగహారము లందురు. పరమేశ్వరునిచే ప్రయోగింపబడి అంగములచే నిర్వర్తింపబడునదియునైనది అంగహారము.

హస్త పాద ప్రచారశ్చ యథా యోజ్యః ప్రయోక్తృభిః
అంగహారేషు వక్ష్యామి కరణేషు చ వై ద్విజాః. 28
సర్వేషా మంగహారాణాం నిష్పత్తిః కరణైర్యతః
తాన్యతః సంప్రవక్ష్యామి నామతః కర్మత స్తథా. 29

కరణాంగహారములయందు ప్రయోగించవలసిన హస్త పాదముల విన్యాసము లిక చెప్పబడు చున్నవి. అంగహారములు కరణముల సంయోగముచే నిష్పన్న మగుచున్నవి గనుక మొదట కరణములపేర్లనుజెప్పి, తర్వాత వాటి లక్షణ ప్రయోజనములను భరతుడు చెప్పబోవుచున్నాడు.

హస్త పాద సమాయోగో నృత్యస్య కరణం భవేత్.

కరణ మనగా హస్త పాద సమాయోగములను తెలుపు నృత్తక్రియ. హస్త శబ్దమునకు పూర్వకాయమని, పాదశబ్దమునకు అపరకాయ మని అర్థము చెప్పకొనవలెను. హస్తములు, శిరోగ్రీవాదులు పూర్వకాయములోనివి. అపరకాయమున పార్శ్వములు, ఊరువులు, కటి, జంఘలు, చరణములు మొదలైనవి కలవు. ఈ హస్త పాద సమాయోగములతో కలుగు కరణముల ద్వారా సవిలాసత్వ మనబడు సౌందర్యము నృత్తమున రాగలదు. కావున నృత్తమను శబ్దమునకు నృత్తకరణ మని, కరణమునకు కూడ నృత్తకరణమే యని అర్థమును చెప్పవలెను.

ద్వే నృత్తకరణే చైవ భవతో నృత్తమాతృకా. 30
ద్వాభ్యాం త్రిభి శ్చతుర్భి ర్వా ప్యంగహారస్తు మాతృభిః
త్రిభిః కలాపకం చైవ చతుర్భిః షండకం భవేత్. 31
పంచైవ కరణాని స్యుః సంఘాతక ఇతి స్మృతః
షడ్భిర్వా సప్తభిర్వాపి అష్టభి ర్నవభి స్తథా. 32
కరణైరిహ సంయుక్తా అంగహారాః ప్రకీర్తితాః
ఏతేషా మేవ వక్ష్యామి హస్త పాద వికల్పనమ్. 33

కరణమునకు సామాన్య లక్షణమును చెప్పి అంగహారమునకు విశేషలక్షణమును చెప్ప దలచి మొదట పీఠబంధమును చెప్పుచున్నాడు. అంగహారాత్మక మగు నృత్తము నుత్పత్తి చేయునవి రెండు కరణములు. కరణము నృత్తమునకు మాతృక. రెండు కరణములతోనే అభినయ మారంభ మగును. ఒక కరణముతో అంగహారము సిద్ధించదు. కనీసము రెండు కరణములు కావలెను. అప్పుడే అంగహారాత్మకమగు పిండీబంధమను ఆకృతి విశేషము రాగలదు.

నాలుగు, ఆరు, ఎనిమిది కరణములతో గూడ అంగహారములు రాగలవు. ఆరుకరణము లున్న కలాపక మనియు, ఎనిమిది కరణములున్న షండకమనియు, ఐదుకరణములున్న సంఘాతక మనియు, పిండీబంధముల నందురు. ఆరు మొదలు తొమ్మిది వరకు గూడ కరణము లంగహారమున నుండగలవు. ఈ కరణములకు హస్తపాద వికల్పనము చెప్పబోవుచు ముందు కరణముల పేర్లను చెప్పుచున్నాడు. ఈ కరణాంగహారములు ముఖ్యముగా నాట్యమున ఆంగికాభినయ మందే ఉపయోగించు చుండును.

తలపుష్పపుటం పూర్వం వర్తితం వలితోరు చ
అపవిద్ధం సమనఖం లీనం స్వస్తికరేచితమ్. 34
మండలస్వస్తికం చైవ నికుట్టక మథాపి చ
తథైవార్ధనికుట్టం చ కటిచ్ఛిన్నం తథైవ చ 35
అర్ధరేచితకం చైవ వక్షఃస్వస్తికమేవ చ
ఉన్మత్తం స్వస్తికం చైవ పృష్ఠస్వస్తికమేవ చ. 36
దిక్స్వస్తిక మలాతం చ తథైవ చ కటీసమమ్
ఆక్షిప్తరేచితం చైవ విక్షిప్తాక్షిప్తకం తథా. 37
అర్ధస్వస్తిక ముద్దిష్ట మంచితం చ తథా పరమ్
భుజంగత్రాసితం ప్రోక్త మూర్ధ్వజాను తథైవ చ 38
నికుంచితం చ మత్తల్లి త్వర్ధమత్తల్లి చైవ హి
స్యాద్రేచితనికుట్టం చ తథా పాదాపవిద్ధకమ్. 39
వలితం ఘూర్ణితం చైవ లలితం చ తథా పరమ్
దండపక్షం తథా చైవ భుజంగత్రస్తరేచితమ్. 40
నూపురం చైవ సంప్రోక్తం తథా వైశాఖరేచితమ్
భ్రమరం చతురం చైవ భుజంగాంచిత మేవ చ. 41
దండరేచితకం చైవ తథా వృశ్చికకుట్టనమ్
కటిభ్రాంతం తథా చైవ లతావృశ్చిక మేవ చ. 42
ఛిన్నం చ కరణం ప్రోక్తం తథా వృశ్చికరేచితమ్
వృశ్చికం వ్యంసితం చైవ తథా పార్శ్వనికుట్టకమ్. 43
లలాటతిలకం క్రాంతం కుంచితం చక్రమండలమ్
ఉరోమండల మాక్షిప్తం తథా తలవిలాసితమ్. 44
అర్గలం చాథ విక్షిప్త మావర్తం డోలపాదకమ్
వివృత్తం వినివృత్తం చ పార్శ్వక్రాంతం నిశుంభితమ్. 45
విద్యుద్భ్రాంత మతిక్రాంతం వివర్తితక మేవ చ
గజక్రీడితకం చైవ తలసంస్ఫోటితం తథా. 46
గరుడప్లుతకం చైవ గండసూచి తథా పరమ్
పరివృత్తం సముద్దిష్టం పార్శ్వజాను తథైవ చ. 47
గృధ్రావలీనకం చైవ సన్నతం సూచ్యథాపి చ
అర్ధసూచీతి కరణం సూచీవిద్ధం తథైవ చ. 48
అపక్రాంతం చ సంప్రోక్తం మయూరలలితం తథా
సర్పితం దండపాదం చ హరిణప్లుతమేవ చ. 49
ప్రేంఖోలితం నితంబం చ స్ఖలితం కరిహస్తకమ్
ప్రసర్పితక ముద్దిష్టం సింహవిక్రీడితం తథా. 50

సింహాకర్షిత ముద్వృత్తం తథోపసృత మేవ చ
తలఘట్టితకం చైవ జనితం చావహిత్థకమ్. 51
నివేశ మేలకాక్రీడ మూరూద్వృత్తం తథైవ చ
మదస్ఖలితకం చైవ విష్ణుక్రాంత మథాపి చ. 52
సంభ్రాంత మథ విష్కంభ ముద్ఘట్టిత మథాపి చ
వృషభక్రీడితం చైవ లోలితం చ తథా పరమ్. 53
నాగాపసర్పితం చైవ శకటాస్యం తథైవ చ
గంగావతరణం చైవే త్యుక్త మష్టాధికం శతమ్. 54
అష్టోత్తరశతం హ్యేతత్ కరణానాం మయోదితమ్.

తలపుష్పపుట, వర్తిత, వలితోరుక, అపవిద్ధ, సమనఖ, లీన, స్వస్తికరేచిత, మండల స్వస్తిక, నికుట్టన, అర్ధనికుట్టన, కటిచ్ఛిన్న, అర్ధరేచిత, వక్షఃస్వస్తిక, ఉన్మత్త, స్వస్తిక, పృష్ఠ స్వస్తిక, దిక్స్వస్తిక, అలాత, కటీసమ, ఆక్షిప్తరేచిత, విక్షిప్తాక్షిప్తక, అర్ధస్వస్తిక, అంచిత, భుజంగత్రాసిత, ఊర్ధ్వజాను, నికుంచిత, మత్తల్లి, అర్ధమత్తల్లి, రేచితనికుట్టిత, పాదాపవిద్ధక, వలిత, ఘూర్ణిత, లలిత, దండపక్ష, భుజంగత్రస్తరేచిత, నూపుర, వైశాఖరేచిత, భ్రమరక, చతుర, భుజంగాంచితక, దండకరేచిత, వృశ్చికకుట్టిత, కటిభ్రాంత, లతావృశ్చిక, ఛిన్న, వృశ్చికరేచిత, వృశ్చిక, వ్యంసిత, పార్శ్వనికుట్టిత, లలాటతిలక, క్రాంతక, కుంచిత, చక్రమండల, ఉరోమండల, ఆక్షిప్త, తలవిలసిత, అర్గల, విక్షిప్త, ఆవర్త, డోలాపాద, వివృత్త, వినివృత్త, పార్శ్వక్రాంత, నిశుంభిత, విద్యుద్భ్రాంత, అతిక్రాంత, వివర్తిత, గజక్రీడిత, తలసంస్ఫోటిత, గరుడప్లుత, గండసూచి, పరివృత్త, పార్శ్వజాను, గృధ్రావలీనక, సన్నత, సూచి, అర్ధసూచి, సూచీవిద్ధ, అపక్రాంత, మయూరలలిత, సర్పిత, దండపాద, హరిణప్లుత, ప్రేంఖోలిత, నితంబ, స్ఖలిత, కరిహస్త, ప్రసర్పితక, సింహవిక్రీడిత, సింహాకర్షిత, ఉద్వృత్త, ఉపసృత, తలసంఘట్టిత, జనిత, అవహిత్థక, నివేశ, ఏలకాక్రీడిత, ఊరూద్వృత్త, మదస్ఖలిత, విష్ణుక్రాంత, సంభ్రాంత, విష్కంభ, ఉద్ఘట్టిత, వృషభక్రీడిత, లోలిత, నాగాపసర్పిత, శకటాస్య, గంగావతరణ మను నూటఎనిమిది కరణముల పేర్లు ఇవ్వబడినవి.

నృత్తే యుద్ధే నియుద్ధేచ తథా గతిపరిక్రమే. 55
గతిచారే ప్రవక్ష్యామి యుద్ధచారీవికల్పనమ్
యత్ర తత్రాపి సంయోజ్య మాచార్యైః నాట్యశక్తితః. 56
ప్రాయేణ కరణే కార్యో వామో వక్షః స్థితః కరః
చరణ స్యానుగశ్చాపి దక్షిణస్తు భవేత్కరః. 57
హస్తపాదప్రచారంతు కటి పార్శ్వోరు సంయుతమ్
ఉరః పృష్ఠోదరోపేతం వక్ష్యమాణం నిబోధత. 58

అభినయమున మధ్య కాలయాపనకు, శస్త్రాదియుద్ధమున, బాహుయుద్ధమున, గతిపరిక్రమమున కూడ ప్రయోగసౌష్ఠవమునకై ఈ కరణాంగహారము లుపయోగింపబడును. యుద్ధచారీ వికల్పనము మొదలైనవి ముమ్ముందు చెప్పబడగలవు. ఏకరణము నెప్పుడు ప్రయోగించవలెనో నాట్యాచార్యులచే నాట్యశక్తి ననుసరించి తెలియబడవలెను. సామాన్యముగా కరణము లన్నిటి

లోను ఎడమచేయి వక్షమున మొట్టమొదట ఉండగలదు. పాదము ననుసరించి తదనుగుణముగా కుడిచేతిని పట్టవలెను. నడుము, ప్రక్కలు, తొడలు, వక్షము, పృష్ఠము, ఉదరము మొదలగు వాటితో కలసియున్న హస్తపాదప్రచారము కరణములయందు వివరింపబడగలదు.

యాని స్థానాని యాశ్చార్యో నృత్తహస్తాస్తథైవ చ
సా మాతృకేతి విజ్ఞేయా తద్యోగాత్కరణం భవేత్. 59
కటీ కర్ణసమాయత్ర కోర్పరాంస శిరస్తథా
సమున్నత మురశ్చైన సౌష్ఠనంనామ తద్భవేత్. 60

మహాసామాన్యరూపమగు కరణము నిల చెప్పుచున్నాడు. ప్రతికరణమున అవస్థానము, గతి అను రెండును నిర్వర్తింపబడవలెను. అవస్థానమునకు కరణోపయోగియైనది స్థానకములు. గతియం దుపకరించునది చారీ. ఈ చారీలు, స్థానకములు ముందు పదవ అధ్యాయమున చెప్పబడును. పూర్వకాయమున చేయబడునవి నృత్తహస్తములు, దృష్టులు. స్థితియందు వచ్చునవి పతాకాదిహస్తములు. స్థానము, చారీ, నృత్తహస్తము అనునవి కరణమునకు మాతృకవంటివి. వీటి సంయోగముతో కరణము సిద్ధించును. కరణములను పట్టునప్పుడు సౌష్ఠవాంగముండవలెను. కటిప్రదేశము, చెవితో సమరేఖ, భుజములమధ్య వంపులేని శిరము నుంచవలెను. అపుడు వక్షము సమున్నతమైన సౌష్ఠవాంగ మనిపించుకొనును. ఇట్టి కరణములతో సిద్ధించునవి అంగహారములు.

ఇరువది యైదవదియగు చిత్రాభినయాధ్యాయమున నీకరణములకు విశేషవినియోగములను చెప్పుచు, ఇవిగాక అనేక నృత్తవిషయములు గలవని, వాటిని లోకానుశీలనముచేసి గ్రహించవలె నని భరతుడు చెప్పుచున్నాడు. లోకము, వేదము, అధ్యాత్మము అను మూడు ప్రమాణములు గలవు. ఈ మూటిని ఆశ్రయించుకొని నాట్యము బయలుదేరుచున్నది. "లోక సిద్ధాని ప్రత్యక్షా నుమానాగమ ప్రమాణాని లోకశబ్దేనోచ్యన్తే" అని అభినవగుప్తుడు లోకశబ్దమునకు చిత్రాభిన యాధ్యాయమున అర్థము చెప్పినాడు. ప్రత్యక్షము, అనుమానము, ఆగమము అను ప్రమాణముల ద్వారా సిద్ధమైననాట్యము లోకప్రసిద్ధము. వేదమనగా "యథా స్వ నియతరూపో లోకప్రసిద్ధోఽ ప్యాగమో యథా న్యాయేషు ధనుర్వేదః స్వర తాలాదా గాంధర్వవేద ఇత్యాది" అని ఆ అధ్యా యముననే నిర్వచించుచు, వేదశబ్దమునకు గాంధర్వాద్యుపవేదము లను అర్థమును అభినవగుప్తుడు చెప్పియున్నాడు. అధ్యాత్మ మనగా స్వసంవేదనము. ఈమూటిలోను లోకసిద్ధమైనది ప్రధానము. లోకసిద్ధమగు నాట్యమును పరిత్యజించ వీలులేదు గనుక చిత్రాభినయాధ్యాయమున "నహి లోకప్రసిద్ధి మపహ్నోతుం కశ్చిత్సమర్థః, సుప్రతి పన్నస్యాపి తదపహ్నవే కాష్ఠ పాషాణతాపత్తి ప్రసంగాత్" అని అభినవగుప్తు డనినాడు.

ఇట్లుసిద్ధించు కరణములు, తద్వినియోగములయం దనేకవిధముల కన్పించగలవు. భిన్నభిన్న నాట్యాచార్యు లధికవినియోగములను చెప్పియున్నారు. ఈ అధికపాఠములను చెప్పినవారిలో కోహల, రాహుల, కీర్తిధరులు ప్రధానులు. వీరి పాఠములను అప్రమాణికము లని త్రోసివేయ రాదు. చిత్రాభినయాధ్యాయమున "కోహలాది శాస్త్రలక్ష్య ప్రవాహసిద్ధ మపి చిత్రాభినయం సూచయతి. తతశ్చోదాహరణాన్ సందర్శయామో మాభూత్ సంప్రదాయ ప్రవాహ విచ్ఛేదః" అని అభినవగుప్తు డనినాడు. కోహలాదులు పఠించిన విశేషవిధులు గూడ సాంప్రదాయకములే.

నని అంగీకరించుచు తన్మతానుసారములగు శ్లోకములను కూడ చెప్పియున్నాడు. ఈ విషయము లన్నియు ఇరువదియైదవ అధ్యాయమున వివరించ బడగలవు.

ఇక క్రమముగా కరణముల లక్షణప్రయోజనములు నిర్వచింప బడుచున్నవి.

### 1. త ల పు ష్ప పు ట మ్

వామే పుష్పపుటః పార్శ్వపాదోఽగ్రతల సంచరః
తథా చ సన్నతం పార్శ్వం తలపుష్పపుటం భవేత్.　　61

ఎడమవైపున పుష్పపుటహస్తమును పట్టవలెను. చేతివ్రేళ్ళను ఎడములేకుండా ఉంచి. సర్పశీర్షహస్తముయొక్క అరచేతిని రెండవచేతి ప్రక్కగా కలిపిన పుష్పపుటహస్తము వచ్చును. 9అ. 127 శ్లో. పాదము అగ్రతలసంచరముగా మడమను ఎత్తి, కాలివ్రేళ్ళను అంచితములుగా చేసి, బొటనవ్రేలిని ప్రసరించిన అగ్రతలసంచర మగును. 9అ. 23½ శ్లో. పార్శ్వము సన్నతముకావలెను. ప్రక్కభాగము, నడుము, వ్యాభుగ్నములై, భుజము జారినట్లుగా నుంచిన ప్రక్కభాగము వంగిన ట్లుండును. 9అ. 202 శ్లో. ఈ మూడును కలసిన తలపుష్పపుట మను కరణము వచ్చును.

సమపాదతల హస్తద్వయ పూర్వకముగా తలసంచరము జరుగును. కుడిపాదము ఎడమ వెనుకగా, ఎడమపాదము నుంచి, కుడిపాదముతో అడుగువేయుచు 10అ. 16 శ్లో చేతులను వ్యావర్తింపజేసి, కుడిప్రక్కనుండి పరివర్తనము చేయుచు ఎడమప్రక్కకు తీసికొనిరావలెను. అప్పుడు ఎడమవక్షమున పుష్పపుటహస్తబంధమును పట్టవలెను. అగ్రతలపాదమును, పుటపుష్పముతో సంయోజించుటచే నీ కరణము తలపుష్పపుట మనబడుచున్నది. ఈ రీతిగా కరణముల పేర్లకు అర్థము కుదురగలదు.

వాక్యార్థాభినయమును ప్రధానముగా ప్రదర్శించునపుడు కరణముల కీ ప్రాధాన్యము నొసగవలెను. పదార్థాభినయములను చూపునపుడు అందలివాక్యమున కొకదానికే ప్రాధాన్యము చూపవలసినచో వాక్యాదిలో గాని, వాక్యమధ్యమున గాని, వాక్యాంతమున గాని ఉచితానుచిత ములను గమనించి కరణమును ప్రయోగించవలెనని ముఖ్యసూత్రము. నృత్తమున ప్రధానమైనది అభినయము. అభినయము నాల్గు విధములు. అందు ఆంగికాభినయమున అంగహారములతో నిష్పన్న మగును. ఈ అంగహారములు కరణముల నాశ్రయించి యుండునినవి.

హస్తములకు వ్యావృత్త పరివృత్తము లుండును. అరచేతికి అభిముఖముగా కనిష్ఠికాది వ్రేళ్ళను సాచుట వ్యావృత్తమనబడును. ఈ వ్రేళ్ళనే క్రమముగా బయటకు తెరచుట పరివృత్త మనబడును. 9అ. 185-186 శ్లో. తర్జన్యాదిగా వ్రేళ్ళను లోపలికిసాచిన ఆవేష్టితమని, బయటకు తెరచిన ఉద్వేష్టితమని యందురు. 9అ. 183-184 శ్లో.

### 2. వ ర్తి త మ్

కుంచితౌ మణిబంధేతు వ్యావృత్త పరివర్తితౌ
హస్తౌ నిపతితౌ చోర్వోర్వర్తితం కరణంతు తత్.　　62

వక్షమున తెల్పరుగానున్న చేతులను (పతాకలను) ఒకదానినొకటి తాకకుండ స్వస్తికవలె మణికట్టుతో పట్టవలెను. తర్వాత చేతులను తీసి, ఆవృత్తపరివృత్తములను చేసి, ఉత్తానములుగా

కొండలవద్ద నుంచవలెను. అసూయను తెలుపు వాక్యార్థము నభినయించునపుడు హస్తములను ఉత్తానపతాకలుగా పట్టవలెను. ఇవి తర్వాత అధోముఖపతాక లగును. రోషము నభిన యించునపుడుగూడ నీకరణ ముపకరించును. అభినయించుభావము ననుసరించి ఖటకాముఖ, శుకతుండము మొదలగు హస్తములను యోజించవలెను. కావుననే భరతుడు హస్తవిశేషమును నిరూపించలేదు. హస్తముయొక్క ఔచిత్యము ననుసరించి పాదమును నిరూపించవలెనని నృత్త సంప్రదాయము. అందుచే "చరణస్యానుగశ్చాపి దక్షిణస్తు భవేత్కరః"అని కొన్ని నాట్యశాస్త్ర ములలో గల శ్లోకము నాట్యసంప్రదాయమునకు విరుద్ధమగుటచే ప్రక్షిప్తమని యెంచవీలున్నది.

### 3. వ లి తో రు క మ్

శుకతుండౌ యదా హస్తౌ వ్యావృత్త పరివర్తితౌ
ఊరూచ వలితౌ యస్మిన్ వలితోరుక ముచ్యతే. 63

తర్జనియను చూపుడువ్రేలిని విల్లువలె వంచి, మిగిలినవ్రేళ్ళను దీనికి వెనుకగా సాచి, బొటనవ్రేలిని కుంచించినచో అరాలహస్త మగును. 9 అ. 35 శ్లో. అరాలహస్తమున అనామిక వంగియున్నచో శుకతుండహస్తము వచ్చును. 9 అ. 45 శ్లో. రెండు శుకతుండహస్తములను వక్షమువద్ద నుంచి వ్యావర్తితములుగా చేయవలెను. అప్పుడు ఆక్షిప్తమనుచారీతో హస్తములను పరివర్తనమున వక్షమువద్దకు తెచ్చి అధోముఖ శుకతుండములుగా నుంచవలెను.

కుంచించబడినపాదమును పైకియెత్తి శరీరమునకు ముందు త్రితాలదూరమున ప్రక్కగా పిక్కలవరకు తీసికొనివెళ్ళి, మడమను స్వస్తికగా భూమియందుంచిన ఆక్షిప్తమను చారీ సిద్ధిం చును. 10 అ. 35 శ్లో. వ్యావృత్తమున నీ చారీప్రయోగము చేయవలెను. స్థితియందు బద్ధా అను చారీ రావలెను. ఒకపిక్కను మరొక పిక్కతో కలిపి స్వస్తికనుపట్టి ఊరువలనముచేసిన బద్ధాచారీ రాగలదు. 10 అ. 20 శ్లో. ముగ్ధనాయికావిషయకామైన దీకరణము.

### 4. అ ప వి ద్ధ మ్

ఆవర్త్య శుకతుండాఖ్య మూరుపృష్ఠే నిపాతయేత్
వామహస్తశ్చ వక్షస్థోఽప్యపవిద్ధంతు తద్భవేత్. 64

వక్షస్థలమున ఎనిమిదివ్రేళ్ళ ఎడముగా రెండుచేతుల నుంచిన చతురశ్రస్థితియేర్పడును. ఈ చేతులలో కుడిహస్తమగు శుకతుండమునకు ఆవర్తముచేసి, శుకతుండమును పొగొట్టి, అదే సమయమున ఆక్షిప్తచారీని ప్రయోగించవలెను. తర్వాత నదేచేతిని శుకతుండముచేసి ఊరువుల క్రిందుగా నుంచవలెను. వక్షముయందు ఎడమచేతిని ఖటకాముఖముగా నుండవలెను. అసూయ కోపముల తెలియజేయు వాక్యార్థముల నభినయించుటకీ కరణ ముపకరించును.

### 5. స మ న ఖ మ్

శ్లిష్టౌ సమనఖౌ పాదౌ కరౌ చాపి ప్రలంబితౌ
దేహః స్వాభావికో యత్ర భవేత్ సమనఖంతు తత్. 63

చేతులను లతాహస్తములుగా నుంచవలెను. అడ్డముగా ప్రక్కలకు ప్రసరించబడిన పతాకహస్తములను లతాహస్తములందురు. 9 అ.168 శ్లో. పాదములను కలుపుచు, లతాహస్త

ములనుపట్టి, దేహమును సహజరూపమున నుంచుటయే సమనఖము. నృత్తమున ప్రవేశించు నపుడు మొదటనే యిది కన్పించగలదు.

## 6. లీ న మ్

పతాకాంజలి వక్షఃస్థం ప్రసారిత శిరోఽధరమ్
నిహంచితాంసకూటంచ తల్లీనం కరణం స్మృతమ్. 66

పతాకహస్తముల వ్రేళ్ళను బాగుగా కలిపినచో అంజలి ఏర్పడును. 9 అ. 111 శ్లో. సహజముగానుండునట్లు వ్రేళ్ళనుప్రసారించి, బొటనవ్రేలిని కుంచించిన పతాకమువచ్చును. 9 అ. 18 శ్లో. బాహుశిఖరములనెత్తి, కంఠమును కుంచించి, నికుంచితశిరస్సు భుజములతో సంధించిన నిహంచితత్వము సిద్ధించును. వక్షస్థలమునుండి వ్యావర్తితముగా లలాటమునకు, ప్రక్కలకు, మండలమువలె తిరుగు ప్రసారిత పతాకహస్తములను ఊర్ధ్వమండలము లందురు. 9 అ.173 శ్లో. ఈ నృత్తహస్తములను ముందు ప్రయోగించి, హస్తచలనములలో వక్షస్థలమున అంజలిని చేయ వలెను. నలినీపద్మకోశములనుండి హస్తము రాగూడదు గనుక పతాకహస్తములనే స్వీకరించ వలెను. ఊర్ధ్వమండలగమనమున పతాకహస్తములకు స్ఫుటమైన ప్రయోగోత్పత్తి గలదు. ప్రియ ప్రార్థనను తెలుపు వాక్యార్థాభినయమున నీ కరణమును ప్రయోగించవలెను. దేవతాప్రణామ మున శిరస్సుపై అంజలి ఉండవలెను గనుక వక్షఃస్థమగు అంజలిని విధించరా దని, ప్రియప్రార్థ నలో వినియోగము చెప్పబడినది.

## 7. స్వ స్తి క రే చి త మ్

స్వస్తికౌ రేచితా విద్ధా విశ్లిష్టౌ కటిసంశ్రితౌ
యత్ర తత్కరణం జ్ఞేయం బుధైః స్వస్తికరేచితమ్. 67

ఈ కరణమున ఆరు నృత్తహస్తములు వచ్చుచున్నవి. మొదట రేచితహస్తములు. ప్రస రింపబడిన ఉత్తానతలములు గలిగిన హంసపక్షహస్తములు వేగముతో కంపించిన రేచితము లగును. 9 అ. 163 శ్లో. మూడు వ్రేళ్ళను సమానముగా ప్రసారించి, చిటికెనవ్రేలిని సాచిపట్టి బొటనవ్రేలిని కుంచించిన హంసపక్షము రాగలదు. 9అ. 92 శ్లో. తర్వాత వీటిని ఆవిద్ధవక్రములు చేయవలెను. భుజాగ్రములతోను, మోచేతులతోను పతాకహస్తములను సవిలాసముగా వ్యావ ర్తింపజేసి, నాగలినిపట్టినట్లుగ అరచేతులను క్రిందకు ఎమరుగ నుంచినచో ఆవిద్ధవక్రములగును. 9 అ.161 శ్లో. హస్తములను వక్షమున స్వస్తికగా చేయవలెను. తలముఖములను మణిబంధమున స్వస్తికగా పట్టవలెను. తర్వాత నీస్వస్తికనువిడదీసిన హస్తములు విప్రకీర్ణము లగును. 9అ.159శ్లో. త్రిపతాకహస్తములను నడుమువద్ద ఎగబట్టిన పక్షవంచితహస్తము లగును. 9 అ. 170 శ్లో. వీటినే పరావృత్తములుగా మరికొంచెము ఎగబట్టిన పక్షప్రద్యోతము లగును 9 అ. 171 శ్లో. రేచితహస్తములను ప్రయోగించినతర్వాత వ్యావర్తితకరణమున శిరస్సునుండి క్రిందకు, పైకి చేతులను తెచ్చుచు, ఆవిద్ధవక్రహస్తవర్తనతో వక్షమువద్ద స్వస్తికను విధించవలెను. ఈ స్వస్తిక హస్తములను విచ్యుతిచేసి పక్షవంచితములుగను, పక్షప్రద్యోతములుగను చేయగా స్వస్తిక

రేచితము సిద్ధించును. నృత్తమునే ప్రధానముగా అభినయించ వలసివచ్చినచోట ప్రహర్షాది యోగమం దీ కరణమును ప్రయోగించవలెను.

8. మండలస్వస్తికమ్

స్వస్తికౌతు కరౌ కృత్వా ప్రాఙ్ముఖోర్ధ్వతలౌ సమౌ
తథాచ మండలం స్థానం మండలస్వస్తికంతు తత్. 68

స్వస్తికహస్తములను ప్రాఙ్ముఖములుగా పట్టి చతురశ్రములుగా నుంచవలెను. నృత్తాంగమునకు జీవితమైనది చాతురశ్ర్యము. వక్షమునకు ఎనిమిదివ్రేళ్ళదూరముగ, సముఖముగా ఖటకాముఖముల నుంచవలెను. భుజములు, చేతులు తులాదండమువలె సమముగా నున్నచో చతురశ్రము లనబడును. 9 అ. 156 శ్లో. ఖటకాముఖములను ఊర్ధ్వమండలము గలవానినిగా జేయుచు రెండుపాదములమధ్య నాలుగుతాళముల అవధి నుంచి, నడుమును జానువుతో సమముగ చేసిన మండలస్థానకము సిద్ధించును 10 అ. 61 శ్లో.

చతురశ్ర హస్తములతో నుండి, స్వస్తికనుచూపి, విచ్యవాప్రయోగము చేయుచు ఉద్వేష్టితవర్తనతో ఊర్ధ్వమండలముగ స్వస్తికను పట్టవలెను. మండలస్థానకముచు చూపవలె నని భావము. అగ్రతలసంచర పాదముతో భూమిని ఘట్టించుచు సమపాదములను చూపిన విచ్యవా యనబడును 10 అ. 18 శ్లో. మోసమును తెలుపు వాక్యార్థాభినయమున నీకరణ ముపకరించును.

9. నికుట్టనమ్

నికుట్టితౌ యదాహస్తౌ స్వబాహు శిరసోఽన్తరే
పాదౌ నికుట్టితౌచైవ జ్ఞేయం తత్తు నికుట్టనమ్. 69

శరీరమును పైకిఎత్తి క్రిందకుదించుటయే నికుట్టనమని కోహలుని మతము. అందుచే అలపల్లవహస్తములోని చిటికెనవ్రేలితో చూపు పతనోత్పతనములను (ఆవర్త పరివర్తనములను) నికుట్టన మందురు. అరకాలి ముందుభాగముపై నిలచి మడమను క్రిందవేయుట ఉదఘట్టితమందురు. 9 అ. 231 శ్లో. బాహు శిరస్సున నికుట్టితములుగా జేసి అలపల్లవహస్తములను ప్రయోగించవలెను. కుడిచేతితో కుడిపాదమునకు, ఎడమచేతితో ఎడమపాదమునకు ప్రయోగవిధిని చెప్పుకొనవలెను. మండలస్థానకమున నిలచి, ఉద్వేష్టితకరణమున కుడిచేతిని భుజశిరస్సున నికుట్టనముచేయవలెను. అప్పుడు కుడిపాదమును ఘట్టించి ఆవిద్ధవక్రవర్తనలో ఎడమచేతిని చతురశ్రముగా కుడివైపునకు నికుట్టితము చేయవలెను.

ఆత్మగౌరవమును, స్వోత్కర్షను మాటిమాటికి చెప్పు వాక్యార్థము నభినయించునపు డీ కరణమును ప్రయోగించవలెను.

10. అర్ధనికుట్టకమ్

కుంచితౌ బాహు శిరసి హస్తస్త్వభిముఖాంగులిః
నికుంచితార్ధయోగేన భవే దర్ధనికుట్టకమ్. 70

అభిముఖముగా అలపల్లవహస్తమును భుజశిరస్సున అంచితముచేయవలెను. చిటికెనవ్రేలు మొదలు క్రమముగా అరచేయిలో ఆవర్త పరివర్తనములు చేయుచున్న వ్రేళ్ళు ప్రత్యేకముగ వచ్చి

వికీర్ణములైన అలపల్లవ మగును 9 అ. 79 శ్లో. ఈ అలపల్లవహస్తము సగము నికుంచితమై ఉన్నమన, వినమనములను గల్గియున్నచో అర్ధనికుట్టక మగును. ఆత్మగౌరవము, స్తోత్కర్షల విషయమందు, ప్రరూఢ మగు వాక్యార్థము నభినయించుచో నిది ప్రయోగింపబడును.

## 11. కటిచ్ఛిన్నమ్

పర్యాయశః కటిశ్ఛిన్నా బాహూ శిరసి పల్లవౌ
పునఃపునశ్చ కరణం కటిచ్ఛిన్నంతు తద్భవేత్. 71

నడుము వంపుతిరిగినట్లున్న ఛిన్నకటి అందురు 9 అ. 212 శ్లో. ఊర్ధ్వవ్యావర్తిత కరణముతో బాహువులను ప్రసరించి, పరివర్తనమున మణికట్టువద్ద స్వస్తికాకృతి గల పతాకములను పట్టినచో పల్లవహస్తములు రాగలవు 9 అ. 166 శ్లో. దీనికి భ్రమరికాచారీతో రెండువైపుల భ్రమణమును చూపవలెను. కుంచితమైన పాదమునుయెత్తి ముందుకు బాగుగా ప్రసారించి. నాలుగుతాళముల ఎత్తుగా అగ్రతలముతో అడుగువేసిన అతిక్రాంతచారీ సిద్ధించును 10అ.29శ్లో. ఈ అతిక్రాంతచారిలో చెప్పబడిన కుంచితపాదమును ఎత్తి భుజంగత్రాసితమువలె త్రికోణాకృతితో నున్న ఊరువును వివర్తింపజేసి, ద్వితీయపాదతల భ్రమణమున శరీరము నంతయు పరివర్తింపజేసిన భ్రమరీచారీ రాగలదు 10 అ. 44 శ్లో.

ఈ చారీప్రయోగ మైనతర్వాత మండలస్థానకమ్మున నిలచి బాహుశిరస్సున పల్లవహస్తమును ప్రయోగించవలెను. ఇదేరీతిగా కుడి, ఎడమలకు మూడు నాలుగు పర్యాయములు దీని నభినయించవలెను. విస్మయప్రధానము నభినయించుటలో నీ కరణము ప్రయోగింప బడవలెను.

## 12. అర్ధరేచితమ్

అపవిద్ధః కరః సూచ్యా పాదశ్చైవ నికుట్టితః
సన్నతం యత్ర పార్శ్వం చ తద్భవే దర్ధరేచితమ్. 72

వ్రేళ్ళ నన్నింటిని శిథిలములుగా చేసి బొటనవ్రేలిని కుంచించి, అరచేయి పల్లముగానుండు నట్లు జేసిన సర్పశిరస్సు వచ్చును 9 అ. 73 శ్లో. చతురశ్రస్థానమునందు సర్పశీర్షహస్తములలోని బొటనవ్రేలు మధ్యవ్రేలియందుండగా చేతిని ప్రక్కకు ప్రసారించి, చూపుడువ్రేలిని బాగుగా కన్పడునట్లు చేయవలెను. అట్టి బాహుప్రసారమును పర్యాయశః చేయగా సూచీముఖములు రాగలవు 9 అ. 162 శ్లో.

మండలస్థానకమున నిలచి, ఒకచేతిని ఖటకాముఖముగా వక్షమందుంచి, రెండవదానిని సూచీముఖముగా చేయవలెను. ఈసూచీముఖహస్తమును అపగమపూర్వకముగా దగ్గరకుతీసికొని బయటకు సాచునపుడు పార్శ్వము సౌష్ఠవాకృతితో వంగియుండగా పాదమునికుట్టితముకావలెను. పృష్ఠభాగము బయటకుపోవుటచే అర్ధరేచిత మగుచున్నది. అసమంజసమైన చేష్టమ ప్రధానముగా తెలుపు వాక్యార్థాభినయమున నీ కరణమునకు వినియోగము కలుగును.

### 13. వ క్షః స్వ స్తి క మ్

స్వస్తికౌ చరణౌ యత్ర కరౌ వక్షసి రేచితౌ
నికుంచితం తథా వక్షో వక్షఃస్వస్తిక మేవ తత్. 73

వక్షమువద్ద చతురశ్రములుగానున్న పతాకలను రేచితములుగచేసి, వ్యావృత్త కరణముతో ఆభుగ్నమగు వక్షమువద్ద స్వస్తికమును పట్టవలెను. స్వస్తికను ప్రయోగించినటులనే జంఘాగుల్ఫ వలనముగల పాదములతో స్వస్తికను చూపవలెను. అప్పుడది వక్షఃస్వస్తిక మగును.

వక్షస్థలము నిమ్నమై, వీపు ఎత్తుగానుండి, మధ్యమధ్య నిరవష్టంభమై, జారుచున్న భుజములతోనున్న ఉరఃప్రదేశమును ఆభుగ్నము, లేక నికుంచితము, అందురు 9 అ. 192 శ్లో. దీనికి నృత్తముతో సంయోగముకలిగిన సౌష్ఠవము రాగలదు. సిగ్గు, పశ్చాత్తాపము అనువానిని ప్రధానముగా తెలుపు వాక్యార్థాభినయమున దీనికి వినియోగము కలుగగలదు.

### 14. ఉ న్మ త్త క మ్

అంచితేనతు పాదేన రేచితౌ తు కరౌ యదా
ఉన్మత్తం కరణం తత్తు విజ్ఞేయం నృత్తకోవిదైః 74

మడమను భూమిపైనిలిపి, అరికాలిముందుభాగమును పైకిఉంచి, వ్రేళ్ళను ప్రసృతముచేసిన అంచితపాద మగును 9 అ. 237 శ్లో. అంచితపాదముతో. రేచితహంసపక్షహస్తములను ఆవిద్ధచారీ సహితముగ ప్రయోగించవలెను. స్వస్తికగానున్న పాదములలో కుడిపాదమును కుంచించి, ప్రసారించి, ఆవిద్ధముచేసి, ఎడమకాలి మడమవద్ద కుడికాలిమడమను వేసిన ఆవిద్ధచారీ యగును 10 అ. 37 శ్లో. దీనిని అంగపర్యాయముగా ప్రయోగించవలెను. అతిసౌభాగ్యము మొదలగు వానివలన కలిగిన గర్వమును తెలుపు వాక్యాభిధానయమున నీ కరణమును ప్రయోగింపవలెను.

### 15. స్వ స్తి క మ్

హస్తాభ్యా మథ పాదాభ్యాం భవతః స్వస్తికౌ యదా
తత్స్వస్తిక మితి ప్రోక్తం కరణం కరణార్థిభిః. 75

ఉద్వేష్టితవర్తనమున ఎడమచేతిని నిష్క్రమింపచేసి, వ్యావర్తితకరణమున హస్తములకు పాదములకు ఒకేసమయమున స్వస్తికను పట్టవలెను. వాక్యార్థాభినయ లక్షణములు, నృత్తాంగ హారరూపములు, గతిపరిక్రమాది స్వభావములునగు క్రియలను తెలిసినవారికే కరణము లుపకరించగలవు. అన్యులకు కాదని తెల్పుటకు కరణార్థులచే నీ కరణము చెప్పబడినదని భరతు డనుచున్నాడు. యుక్తాయుక్త వివేచనచేసి ద్వేషమును, నిషేధమును తెలుపు వాక్యార్థమున నీ కరణము నుపయోగించవలెను.

### 16. పృ ష్ఠ స్వ స్తి క మ్

విక్షిప్తాక్షిప్తబాహుభ్యాం స్వస్తికౌ చరణౌ యదా
అపక్రాంతార్ధసూచిభ్యాం తత్పృష్ఠస్వస్తికం భవేత్. 76

కుంచితమైనపాదమును ఎత్తి, ముందుకు బాగుగ ప్రసారించి, నాలుగుతాళముల ఎత్తుగా అగ్రతలముతో భూమిపై వేసిన అపక్రాంతచారి సిద్ధించును 10 అ. 29 శ్లో. కుంచితపాదమును జానుపర్యంతము జంఘను ప్రసారించి, అగ్రతలముతో భూమిపై నుంచిన సూచీచారి రాగలదు 10 అ. 33 శ్లో. ఉద్వేష్టితక్రియతో రెండుచేతులను విక్షేపించుచు అపక్రాంతచారీని ప్రయోగించ వలెను. అపవేష్టిత కరణము నాడుచు రెండవ పాదముతో సూచీచారీని ఆడి, హస్తములతోను పాదములతోను స్వస్తికను పట్టవలెను. కుడికాలివెనుక ఎడమకాలి నుంచి, త్రికవలనముతో పరాఙ్ముఖమగుచు, స్వస్తికను పట్టగా పృష్ఠస్వస్తిక మగుచున్నది. స్వస్తికకు చెప్పిన వినియోగ మునే ఇచటగూడ చెప్పికొనవలెను.

## 17. దిక్స్వస్తమ్

పార్శ్వయో రగ్రతశ్చైవ యత్ర శ్లిష్టగతో భవేత్
స్వస్తికో హస్తపాదాభ్యాం తద్దిక్స్వస్తిక ముచ్యతే. 77

ప్రక్కలకు, ముందు, వెనుకలకు త్రుటితమగు బొటనవ్రేలితో హస్తములకు, పాదములకు స్వస్తికను పట్టిన దిక్స్వస్తికయగును. గీతపరివర్తములయం దీ కరణమును ప్రయోగించవలెను.

## 18. అలాతకమ్

అలాతం చరణం కృత్వా వ్యంసయే ద్దక్షిణం కరమ్
ఊర్ధ్వజాను క్రమం కుర్యా దలాతక మితి స్మృతమ్. 78

అలాతచారీని మొదట ప్రయోగించవలెను. కుడికాలిని వెనుకకు ప్రసారించి వలనముతో లోనికి తెచ్చి, రెండవతొడ కీ యరికాలిని అభిముఖము చేయవలెను. తర్వాత మడమతో దీనిని క్రిందవేసిన అలాతచారీ యగును 10 అ. 40 శ్లో. భుజములనుండి విచిత్రతతో ఉత్తానత్వాధోముఖత్వ పర్యాయత్వమున నిష్క్రమించు పతాకలను నితంబ పర్యంతమునకు వర్తింపజేయగా నితంబహస్తము లగును 9 అ. 166 శ్లో. వీనిని ఊర్ధ్వజానుచారీతో చూపవలెను. కుంచితపాదమును జానుస్తన సమముగా ఎత్తి స్తబ్ధముగా నుంచవలెను. ఇట్లే రెండవ పాదమునకు గూడ చేయగా ఊర్ధ్వజానుచారీ రాగలదు. 10 అ. 32 శ్లో.

కుడిపాదముతో అలాతచారీని చూపుచు, కుడిచేతిని నితంబహస్తముగా చేసి, చతురశ్రముగా చూపవలెను. ఎడమపాదముతో ఊర్ధ్వజానుచారీని చూపి, ఎడమచేతిని పైవిధముగా చేయవలెను. ఇట్లు వచ్చు నీ కరణమును లలితనృత్తవిషయమున ప్రయోగించవలెను.

## 19. కటీసమమ్

స్వస్తికాపసృతః పాదః కరౌ నాభి కటి స్థితౌ
పార్శ్వ ముద్వాహితం చైవ కరణం తత్కటీసమమ్. 79

పాదములతో స్వస్తికనుపట్టి వాటిని వేరుజేయవలెను. వేరుజేయుటలో ఆక్షిప్తచారీ, అపక్రాంతచారీలు ప్రయుక్తము లగును. కుంచితపాదమును పైకి త్రితాళదూరముగా ఎత్తి పిక్కల వరకు తీసికొనివెళ్ళి మడమను స్వస్తికగ భూమియందుంచిన ఆక్షిప్తచారీ రాగలదు. 10అ.36శ్లో.

ఊరువలనము గావించి, కుంచితపాదమును ఎత్తి ప్రక్కగా వేసిన అపక్రాంతచారి వచ్చును 10 అ. 30 శ్లో. చేతులతో గూడ స్వస్తికనుపట్టి, చేతులను విడదీయగా, ఒక చేయి ఖటకాముఖమై నాభివద్ద నుండును. రెండవ చేయి అర్ధచంద్రమై నడుమువద్ద నుండును. ఇట్లు చేయగా ఒక ప్రక్క వంగిన ట్లుండి రెండవప్రక్క ఉద్వాహిత మగును.

కపిత్థహస్తమందలి అనామికను చిటికెనవ్రేలితో కూడ పైకి ఎత్తి వంచిన ఖటకాముఖము రాగలదు 9 అ. 53 శ్లో. నాలుగువ్రేళ్ళను బాణమువలె ఉంచిన అర్ధచంద్రహస్తము వచ్చును. 9 అ. 35 శ్లో. ఉరః ప్రదేశ మెత్తుగా నున్నట్లు చూపుటయే ఉద్వాహితము. 9 అ. 198 శ్లో. ఈ కరణప్రయోగమున వైష్ణవస్థానకమును చూపవలెను. రెండుపాదములకు మధ్య రెండున్నర తాళములదూర ముంచి, ఒకపాదమును త్రికోణముగా పైకి ఎత్తి, రెండవదానిని పార్శ్వాభిముఖము లగు వ్రేళ్ళు కలదానినిగా చేయవలెను. అప్పుడు జంఘములను కొంచెము వంచగా సౌష్ఠవాంగ పురస్కృతమైన వైష్ణవస్థానక మగును. 10 అ. 51-52 శ్లో.

## 20. ఆక్షిప్తరేచితమ్

హస్తో హృది భవే ద్వామః సవ్య శ్చాక్షిప్త రేచితః
రేచిత శ్చాపవిద్ధశ్చ తత్ స్యా దాక్షిప్త రేచితమ్. 80

హృదయమువద్ద హంసపక్షములను ఉంచవలెను. అప్పుడు కుడిచేతిని రెండుప్రక్కలకు పైకి వ్యావర్తిత కరణమునచాచుచు రేచితముగా హంసపక్షహస్తములను చూపవలెను. ఇట్లు ఆక్షిప్తమైన హంసపక్షహస్తమును కుడివక్షమువద్దకు అధోముఖముగా తెచ్చి అంచితము చేయవలెను. ప్రక్కలకు, పైకి, క్రిందకు అంచితముచేసిన అపవిద్ధ మనబడును. అంచితమై రేచితమగు శరీరమునుండి బయటకు పోయినచో ఆక్షిప్త రేచితమగును. అంచిత సూచీరూపముగా పాదములను నుంచవలెను. త్యాగము, ఉపాదానము, అన్యోన్యతను తెలుపు వాక్యార్థము నభినయించుటలో దీనిని ప్రయోగింపవలెను.

## 21. విక్షిప్తాక్షిప్తకమ్

విక్షిప్తం హస్తపాదంచ తస్యై వాక్షేపణం పునః
యత్ర తత్కరణం జ్ఞేయం విక్షిప్తాక్షిప్తకం ద్విజాః 81

ఒకహస్తమును వ్యావర్తనము చేయునపుడు పాదము బయటకు పంపబడినచో విక్షేపమందురు. రెండవచేయి చతురశ్రముగా నుండును. పరివర్తనమున హస్తపాదముల నాక్షిప్తములుగాచేసి రెండవ హస్తపాదములతో విక్షేప గమనాగమనముల నభినయించవలెను. ప్రధాన వాక్యార్థమున నీకరణమునుపయోగింపవలెను. అభినయాంతరాళముల యందు, గతిపరిక్రమమున, తాలాంతరసంధానమున, యుద్ధనియుద్ధ చారీస్థానమున, సంచారమున నీ కరణ ముపకరింపగలదు.

## 22. అర్ధస్వస్తికమ్

స్వస్తికౌ చరణౌ కృత్వా కరిహస్తం చ దక్షిణమ్
వక్షస్థానే తథా వామ మర్ధస్వస్తిక మాదిశేత్. 82

రెండుప్రక్కలకు అడ్డముగా ప్రసరింపబడు పతాకలు లతాహస్తములగును. 9అ. 168శ్లో. ఈ లతాహస్తములను ఒక ప్రక్కనుండి మరొకప్రక్కకు ఊయలవలె నూపుచు, రెండవ చేతిని త్రిపతాకగా చెవివద్ద నుంచిన కరిహస్తము వచ్చును 9 అ. 169 శ్లో. పాదములను స్వస్తికగా నుంచి, కుడిచేతితో కరిహస్తమునుపట్టి, ఎడమచేతిని ఖటకాముఖముగా వక్షస్థలమున నుంచవలెను. ఇచట కేవలము పాదములతోనే స్వస్తిక రాగలదు గనుక అర్ధస్వస్తిక మనబడినది.

## 23. అంచితమ్

వ్యావృత్త పరివృత్తస్తు స ఏవ తు కరో యదా
అంచితో నాసికాగ్రేతు తదంచిత ముదాహృతమ్. 83

అర్ధస్వస్తిక కరణమున నేచేతిని కరిహస్తముగా నుంచవలెనో ఆహస్తమునే వ్యావర్తిత కరణమున ముక్కుదగ్గరకు తీసికొనిరావలెను. అలపల్లవాకృతి గలిగి అంచితో దంచిత సారణాను నారి యగుటచే అంచితకరణమను పిలువబడుచున్నది. ఆత్మగతవిషయము తాను చెప్పుకొనునపుడు, స్వాతిశయ కౌతుకము గలిగినపుడు, నిర్వాణప్రధానమైన వాక్యార్థమున నీ కరణము నభిన యించవలెను.

## 24. భుజంగత్రాసితమ్

కుంచితం పాద ముత్క్షిప్య త్ర్యశ్రే మూరుం వివర్తయేత్
కటి జాను నివృత్యాచ భుజంగత్రాసితం భవేత్. 84

కుంచిపాదమునుఎత్తి ఊరువుత్రికోణాకృతిలో నుంచవలెను. కటిజానువులను వివర్తింప జేయవలెను. పాదవిన్యాసవశమున చేతులనుగూడ వ్యావర్తిత పరివర్తితములుగా చేయవలెను. కుడిచేయిడోలాహస్తము, ఎడమచేయి ఖటకాస్యము. ఈకరణమున భుజంగత్రాసితమనబడు చారీని ప్రయోగించవలెను. కుంచితపాదమును రెండవఊరుమూలము వరకుఎత్తి కటిజానువుల నివర్తనద్వారా పిరుదకెదురుగా మడమ నుండునట్లుచేసిన త్రికోణాకృతిగల ఊరువు సిద్ధించగలదు. దీనిని వివర్తింపజేయగా భుజంగత్రాసిత చారీవచ్చును 10 అ. 41 శ్లో. సర్పభయమువలన కలుగు గతిని పోలియుండున దీకరణము.

## 25. ఊర్ధ్వజాను

కుంచితం పాదముత్క్షిప్య జానుస్తన సమం న్యసేత్
ప్రయోగవశగౌ హస్తౌ ఊర్ధ్వజాను ప్రకీర్తితమ్. 85

మడమనుఎత్తి కాలివ్రేళ్ళనుకుంచించి మధ్యభాగమునుకూడ కుంచితముచేయగా పాదము కుంచితమగును. 9 అ. 239 శ్లో. ఇట్టి కుంచిత కుడపాదమును జానుస్తనసమముగ ఉంచవలెను. అదేసమయమున కుడిచేయిఊర్ధ్వముఖమైన అలపల్లవముగాగాని, అరాలముగాగాని ఉండవలెను. ఎడమచేయి ఖటకాముఖమై ఎడమరొమ్మువద్దనుండగా ఊర్ధ్వజానువురాగలదు. 10 అ. 32 శ్లో.

## 26. నికుంచితమ్

వృశ్చికం కరణం కృత్వా కరం పార్శ్వే నికుంచయేత్
నాసాగ్రే దక్షిణం చైవ జ్ఞేయం తత్తు నికుంచితమ్. 86

వెనుకప్రక్కగా శిరోభాగమువరకు పాదమును సాచినచో వృశ్చికపాదము 4 అ. 105 శ్లో. రాగలదు. కుడిపాదమును వృశ్చికపాదముగాచాచి ఎడమచేతిని అరాలముగా పార్శ్వమునకు ప్రసారించవలెను. ఈవిధముగా చాచునపుడు ఎడమచేయి తలకు ప్రక్కభాగమునుండి రావలెను. కుడిచేయి నాసాగ్రమునుండి బయలుదేరి అరాలముగా రొమ్మువద్దకు చేరవలెను. అకాశగమనమునకు బయలుదేరునపుడు సందేహమును ప్రణిధానమును తెలుపునపుడు ఈ కరణము నభినయించవలెను.

## 27. మత్తల్లి

వామ దక్షిణ పాదాభ్యాం ఘూర్ణమానోపసర్పణైః
ఉద్వేష్టితాపవిద్ధైశ్చ హస్తైర్మత్తల్ల్యుదాహృతమ్. 87

జంఘాస్వస్తిక యోగముతో అర్ధత్రికోణాకారమున నున్న ఊరువులను ఘూర్ణింపజేయుచు, విడదీయుచు, ఉద్వేష్టితాపవిద్ధములగు నితంబ హస్తములను చూపగా సిద్ధించు మత్తల్లి యను చారీ విధానము నిచ్చట ప్రయోగించవలెను. 10 అ. 27 శ్లో. రెండవపాదము మడమను వేరుజేయుటకు ముందు నితంబహస్తములను ఉద్వేష్టితములుగా చేసి, వేరుచేయు సమయమున అపవిద్ధోపవేష్టనములుగా జేయవలెను. ఇట్లు అంగపర్యాయముగా అనేక పర్యాయములు చేయ మత్తల్లి యను కరణము రాగలదు. ఇది అగాధ వాదవిషయమున ప్రయోగింపబడు కరణము.

## 28. అర్ధమత్తల్లి

స్ఖలితాపసృతౌ పాదౌ వామహస్తశ్చ రేచితః
సవ్యహస్తః కటిస్థః స్యాదర్ధమత్తల్లి తత్స్మృతమ్. 88

మొదట పాదములనువేసి తర్వాత వేరుజేసి ఎడమ హంసపక్షహస్తమును రేచితముచేయవలెను. కుడిచేతిని నడుమువద్దకు తేవలయును. ఈ అర్ధమత్తల్లి కరణము యౌవనమదమును తెలియబరచు వాక్యార్థముల నభినయించుటలో నుపయోగింపబడును.

## 29. రేచితనికుట్టితమ్

రేచితో దక్షిణో హస్తః పాదః సవ్యో నికుట్టితః
దోలాచైవ భవేద్వామ స్తద్రేచిత నికుట్టితమ్.

పాదము ముందుభాగముపై నిలిచి మడమను భూమిపై ఘట్టించిన నికుట్టిత మగును. ఇట్లు కుడిపాదమును ఉద్ఘట్టిత క్రియతో నికుట్టితముగా చేయుచు కుడి హంసపక్షహస్తమును ద్రుతభ్రమాత్మకము చేయవలెను. ఎడమచేయి దోలాహస్తమువలె నుండవలెను. భుజములు జారువారినట్లు పతాకహస్తములను వ్రేలాడవేసిన దోలాహస్తములందురు. 9 అ. 125 శ్లో.

దోలాహస్తమగు ఎడమచేతిని ఊపుచునుండవలెను. ఇట్లు చూపుటచేనది గమనాగమనముల నెరుకపరచు రేచిత నికుట్టితమను కరణమగును.

### 30. పాదాపవిద్ధకమ్

కాన్త్యా నాభితటే హస్తౌ ప్రాఙ్ముఖౌ ఖటకాముఖౌ
సూచీవిద్ధా వపక్రాంతౌ పాదౌ పాదాపవిద్ధకే. 90

నాభివద్ద ప్రాఙ్ముఖములుగా ఖటకాముఖములను చూపవలెను. కపిత్థహస్త మందలి చూపుడువ్రేలిని, నడిమవ్రేలిని బొటనవ్రేలితో జేర్చిన ఖటకాముఖహస్తము వచ్చును 9అ. 53శ్లో మడమను పైకి ఎత్తి బొటనవ్రేలితో నిలచిన సూచీపాదము రాగలదు. 9 అ. 241 శ్లో. ఈసూచీ పాదముతో ఎడమపాదమును విద్ధముగా చేయునపుడు సూచీపాదము అపక్రాంతచారీతో కూడి యుండవలెను. ఊరువలనము చేసి కుంచితపాదమును పైకి ఎత్తి ప్రక్కగా వేసిన అపక్రాంత చారీ రాగలదు 10 అ. 30 శ్లో. ఇట్లు చేయగా పాదాపవిద్ధక మను కరణము సిద్ధించును.

### 31. వలితమ్

అపవిద్ధో భవే ద్ధస్తః సూచీపాద స్తథైవ చ
తథా త్రికం వివృత్తం చ వలితంనామ తద్భవేత్. 91

సర్పశీర్షహస్తమందలి చూపుడువ్రేలిని సాచి, నడిమివ్రేలియందు బొటనవ్రేలిని ఉంచిన సూచీముఖహస్తములు వచ్చును. వీనిని ఎదుటనుండిపార్శ్వములకు బాహుప్రసారము లతో పట్టినసూచీముఖము లగును 9 అ. 162 శ్లో. ఈ సూచీముఖహస్తమును దేహమునుండి బయటకు వచ్చునట్లు జేయుచు, సూచీపాదమును గూడ అపసృతము జేయవలెను.

భ్రమరికా చారితో నీకరణమును ప్రయోగించవలెను. అతిక్రాంత చారీలోచెప్పబడిన కుంచితపాదమును పైకి ఎత్తి భుజంగత్రాసితము వలె ఊరువృతో కాలిని త్రికోణాకారమున నుంచి త్రిప్పవలెను. ద్వితీయ పాదతల భ్రమణముతో శరీరమంతయు బండి ఇరుసు వలె గిర్రున తిరుగ గలదు. అప్పుడు భ్రమరీచారీ సిద్ధించును. 10 అ. 44 శ్లో.

### 32. ఘూర్ణితమ్

వలితౌ ఘూర్ణితః సవ్యో హస్తో వామశ్చ దోలితః
స్వస్తికాపసృతః పాదః కరణం ఘూర్ణితంతు తత్. 92

ప్రక్కభాగము నుండి ఊర్ధ్వావ్యావర్తితమును అధోముఖపరివర్తితమును గావించి ఎడమ చేతితో దోలాహస్తమును చూపిన ఘూర్ణితము రాగలదు. పాదములతో స్వస్తికను పట్టి తర్వాత విడదీయవలెను.

### 33. లలితమ్

కరిహస్తో భవే ద్వామో దక్షిణ శ్చాపవర్తితః
బహుశః కుట్టితః పాదో జ్ఞేయం తల్లలితం బుధైః 93

ఎడమచేతితో కరిహస్తమునుచూపవలెను. సమున్నతమైన లతాహస్తమును ఒకప్రక్క నుండి మరియొకప్రక్కకు చాచుచు త్రిపతాకగల ఎడమచేయి చెవిపద్ద నుండగా కరిహస్తము వచ్చును. 9 అ. 169 శ్లో. భుజశిరస్సునుండి కేశదేశము నుండి బయటకువచ్చుచు, ప్రక్కభాగమున ఎత్తబడినట్లు చూపుచు కుడిచేతిని అపవర్తితము చేయవలయును. హస్తగతిని అనుసరించి పాదమును నికుట్టితము చేయవలయును. ఇట్లు మాటిమాటికి అంగపర్యాయము చేయగా లలిత మను కరణము వచ్చును. విలాసముతో కూడిన నృత్తమున దీనిని ప్రయోగించవలయును.

## 34. దండపక్షమ్

ఊర్ధ్వజాను విధాయాథ తస్యోపరి లతాం న్యసేత్
దండపక్షంతు తత్ ప్రోక్తం కరణం నృత్తవేదిభిః. 94

ఇరువదియొదవ కరణమున చెప్పబడిన ఊర్ధ్వజానుచారీని 10 అ. 32 శ్లో. ప్రయోగించుచు లతాహస్తములను పట్టవలెను. పతాకహస్తములను అడ్డముగా చాచి దోలాకారముగ పట్టిన లతాహస్తము రాగలదు 9 అ. 168 శ్లో. లతాహస్తములలో కుడిచేతిని కుడిజానువుపై నుంచవలెను. ఇట్లే రెండవ ప్రక్కన గూడ అభినయించ వలయును. ఇట్లు చేయగా ఒకప్రక్క దండము వలె బాహుసమవస్థానము సిద్ధించుటచే దండపక్షమని ఈ కరణమును పిలుతురు.

## 35. భుజంగత్రస్తరేచితమ్

భుజంగత్రాసితం కృత్వా యత్రోభావపి రేచితౌ
వామపార్శ్వస్థితౌ హస్తౌ భుజంగ త్రస్తరేచితమ్. 95

ఇరువదినాల్గవ కరణమగు భుజంగత్రాసితమును చేసి, రెండుచేతులను హంసపక్షములుగ నుంచి వేగముతో కంపించునట్లు చేయుచు, చేతులను ఎడమప్రక్కకు తీసికొని వచ్చినచో భుజంగత్రస్తరేచిత మను కరణము వచ్చును.

## 36. నూపురమ్

త్రికం సువలితం కృత్వా లతారేచితకౌ కరౌ
నూపురం చ తథా పాదం కరణే నూపురే న్యసేత్. 96

మడమను భూమిపై నుంచి, పాదముయొక్క అగ్రతలమును పైకి ఎత్తి, వ్రేళ్ళ నంచితముగా చేయ అంచితపాద మగును 9 అ. 237 శ్లో. ఈ పాదమును వెనుకకు తీసికొనివెళ్ళి పిరుద నంటునట్లు జేయవలయును. అప్పుడు అగ్రతలముతో అంచితమగు పిరుదను కుంచించి, పాదమును వేగముగా క్రిందవేయుగా నూపురపాదికా యను చారీ వచ్చును 10 అ. 34 శ్లో. ఈ చారీని ప్రయోగించి, భ్రమరికా చారీతో త్రికవలనమునుగావించి, ఏప్రక్కన గల పాదముతో నూపురపాదిక చేయబడినదో ఆప్రక్కనగల హస్తమును రేచితము చేయవలెను. హంసపక్షహస్తము ద్రుతభ్రమము కలదియైన రేచిత మగును. రెండవచేయి లతాహస్తముగ నుండును.

థిక్యము సిద్ధించగలదు. అప్పుడు పాదతలాగ్రమున నిలచి కుడిమడమను భూమిపైఘట్టించవలెను. కశ్చిన్న్యముతో కూడినవిషయము నభినయించునపుడీ చతురకరణ ముపకరించును.

## 40. భుజంగాంచితకమ్

భుజంగత్రాసితః పాదో దక్షిణో రేచితః కరః
లతాఖ్యశ్చ కరో వామో భుజంగాంచితకం భవేత్. 100

ఇరువదినాల్గవ కరణమున చెప్పబడిన భుజంగత్రాసిత చారీతో పాదమును చూపి కుంచిత పాదమును రెండవ ఊరుమూలము వరకు ఎత్తి కటి జానువుల నివర్తనద్వారా పిరుదు కెదురుగా మడమ నుండునట్లు జేసిన త్రికోణాకారముగల ఊరువు రాగలదు. దీని నావర్తింపజేయగా భుజంగత్రాసిత చారీవచ్చును. 10 అ. 41 శ్లో. కుడి హంసపక్షహస్తమును ద్రుతభ్రమముకలదిగా చేయుచు, ఎడమచేతితో లతాహస్తమును చూపగా భుజంగాంచితక మను కరణమురాగలదు.

## 41. దండకరేచితమ్

విక్షిప్తం హస్తపాదంతు సమంతాద్యత్ర దండవత్
రేచ్యతే తద్ధి కరణం జ్ఞేయం దండకరేచితమ్. 101

దండములె చేతిని విక్షేపము చేసి వేగముతో కంపించు దండపక్ష, హంసపక్షహస్తములను పట్టవలెను. పాదవిక్షేపముగూడ నిట కలదు గనుక దండపాదా యను చారీని ప్రయోగించవలయును. హంసపక్షహస్తములను వ్యావృత్త పరివర్తితములుగా చేసి భుజములను ప్రసారించిన దండపక్షములు రాగలవు. 9 అ. 172 శ్లో. నూపురపాదికలోని కుంచిత పాదమును రెండవకాలి మడమ వెనుక నుంచి ముందుకు చాచవలయును. దేహక్షేత్రమున కెదురుగా నుండునట్లు జాన్వగ్రమునుండి త్వరగా చాచగా, ఊరు జాను జంఘములు స్తబ్ధములై దండాకారముగ నుండగలవు. అప్పుడది దండపాద చారీ యగును. 10 అ. 43 శ్లో.

## 42. వృశ్చికకుట్టితమ్

వృశ్చికం చరణం కృత్వా ద్వావప్యథ నికుట్టితౌ
విధాతవ్యౌ కరౌ తత్తు జ్ఞేయం వృశ్చికకుట్టితమ్. 102

వెనకప్రక్కగా జంఘభాగమును రేచితము గావించి, అరికాలిని ఊర్ధ్వానతలముగ చేసిన వృశ్చికమనబడు పాదము రాగలదు. ఈ పాదమును చూపి, రెండుచేతులను ఆయాభుజశిరస్సుల యందు అలపల్లవములుగా చేసి, నికుట్టితములుగా అంగపర్యాయము గావించవలయును. ఈ విధమున సిద్ధించు వృశ్చికకుట్టిత మను కరణము విస్మయమును, ఆకాశగమనేచ్ఛను తెలుపు సందర్భమున ప్రయోగించవలయును.

## 43. కటిభ్రాంతమ్

సూచీం దత్త్వాఽపవిద్ధంచ దక్షిణం చరణం న్యసేత్
రేచితా చ కటి ర్యత్ర కటిభ్రాంతం తదుచ్యతే. 103

కుంచితపాదమును జానువు వరకు పైకిసాచి, పాదము ముందుభాగమునకు పడునట్లు వేసిన సూచీపాదము లభించగలదు. 10 అ. 33 శ్లో. ఎడమపాదము నిట్లుచేసి, త్వరగా అపసృతముచేసి, ప్రక్కన కుడిపాదము నుంచవలెను. అదేసమయమున పృష్ఠపరావర్తనక్రమముతో నడుమును రేచితముగా జేయవలెను. భ్రమరికా చారితో నైనను నడుమును రేచితముగా చేయవచ్చును. కటిభ్రమణ కాలమున ప్రయోగవశము ననుసరించి, వ్యావర్తన పరివర్తనము లైన తర్వాత చేతులను చతురశ్రములుగా నుంచిన కటిభ్రాంత మనబడు కరణము సిద్ధించగలదు. గతిపరిక్రమమున, తాళాంతరాళమున, యతిపరిపూరణమున నీ కరణమును ప్రయోగించవలయును.

## 44. లతావృశ్చికమ్

అంచితః పృష్ఠతః పాదః కుంచితోర్ధ్వతలాంగులిః
లతాఖ్యస్తు కరో వామస్తల్లతావృశ్చికం భవేత్. 104

పైకి యెత్తబడి, కుంచితములయిన వ్రేళ్ళుగల ఎడమపాదమును వృశ్చికచరణముగా చూపుచు, ఎడమచేతిని లతాహస్తముగ పట్టినచో లతావృశ్చిక మనబడు కరణము రాగలదు. ఆకాశమునుండి భూమికి దిగునపు డీ కరణమును ప్రయోగించవలయును.

## 45. ఛిన్నమ్

అలపద్మః కటీదేశే ఛిన్నా పర్యాయశః కటీ
వైశాఖస్థానకే నేహ తచ్ఛిన్నం కరణం భవేత్. 105

మడమను మాటిమాటికి క్రిందకు వేయుచు, పైకి యెత్తుచు నున్నచో ఊరుకంపనము కలుగును. 9 అ. 218 శ్లో. అదేసమయమున నడుమును ప్రక్కకు త్రిప్పినచో కటిభాగము ఛిన్నమైనట్లు కన్పించును. 9 అ. 212 శ్లో. ఈ నడుమువద్ద అలపద్మహస్తము నుంచవలయును. అరచేతిలోనికి వ్రేళ్ళను ఆవర్తనము చేయుచు, ప్రక్కకు తిరుగుచో అలపద్మహస్తము వచ్చును. 9 అ. 79 శ్లో. ఈ అలపద్మమును అంగపర్యాయముగా రెండుచేతులతోను చూపవలయును. ఈ ప్రక్రియను వైశాఖస్థానకములో జేయగా ఛిన్నమను కరణము రాగలదు. 37 వ కరణమునందలి వైశాఖస్థానకము చేయవలెను. అంగప్రతిసారణ, తాలభంజనాది విషయములలో నీ కరణము ప్రయోగింప బడవలయును.

## 46. వృశ్చికరేచితమ్

వృశ్చికం చరణం కృత్వా స్వస్తికేచ కరావుభౌ
రేచితౌ విప్రకీర్ణాచ కరౌ వృశ్చికరేచితమ్. 106

రెండుపతాకహస్తముల మణికట్టులను జేర్చి పట్టినచో స్వస్తికహస్త మగును. ఈ స్వస్తికను వేరుచేసి హంసపక్షహస్తములను వేగముతో కంపించునట్లు జేయుచు, వృశ్చికపాదమును పట్టినచో వృశ్చికరేచిత మను కరణము వచ్చును. దీనిని ఆకాశగమనము నభినయించుటకు ప్రయోగింప వలయును.

### 47. వృశ్చికమ్

బాహుశీర్షాంచితౌ హస్తౌ పాదః పృష్ఠాంచిత స్తథా
దూర సన్నత పృష్ఠంచ వృశ్చికం తత్ప్రకీర్తితమ్. 107

భుజశిరస్సున కరిహస్తములు పట్టవలయును. సమున్నతము లగు లతాహస్తములు ఒకప్రక్కనుంచి మరొకప్రక్కకు ఊపుచు, ప్రసారితమగు రెండవచేతిని చెవివద్దనుంచిన కరిహస్తము రాగలదు. 9 అ. 139 శ్లో. కుడికాలిని వెనుకగా తలవద్దకు చాచిన వృశ్చికచరణము రాగలదు. వృశ్చికచరణమును ప్రయోగించిన తర్వాత ఆ పాదమును దూరముగ నుండునట్లు పృష్ఠభాగమునకు చాచగా వృశ్చికకరణము సిద్ధించును. ఆకాశగమనమున, ఐరావతాదివిషయమున దీనిని ప్రయోగింపవలయును.

### 48. వ్యంసితమ్

ఆలీఢం స్థానకం యత్ర కరౌ వక్షసి రేచితౌ
ఊర్ధ్వాధో విప్రకీర్ణౌ చ వ్యంసితం కరణం తు తత్. 108

నిషణ్ణోన్నతముతో, త్ర్యశ్రక్రమముగా కాలినుంచి కుడిపాదము సంపతాలాంతరముల వరకు ప్రసారించగా ఆలీఢస్థానకము వచ్చును. 10 అ. 69 శ్లో. వక్షమునకు దగ్గరనున్న హంసపక్షహస్తములను రేచితములుగా చేయవలయును. కుడిచేతి మూడు వ్రేళ్లతో ఉద్వేష్టిత కరణమున అధోముఖముగా విప్రకీర్ణము గావించవలయును. ఎడమచేతి మూడు వ్రేళ్లతో పరావృత్తకరణము, ఊర్ధ్వగమనమును గావించవలయును. కాగా హంసాస్యహస్తము ప్రదేశభ్రమణము కలదై రేచిత మగును. రెండవది అధోముఖ మగును. ఆశ్చర్యముతో గూడిన పరిక్రమవిషయమున నీ వ్యంసితకరణము చూపవలయును.

### 49. పార్శ్వనికుట్టితమ్

హస్తౌతు స్వస్తికౌ పార్శ్వే తథా పాదో నికుట్టితః
యత్ర తత్కరణం జ్ఞేయం బుధైః పార్శ్వనికుట్టితమ్. 109

రెండు పతాకహస్తముల మణికట్టులను జేర్చి ప్రక్క భాగమున నికుట్టితములుగ జేయవలెను. ఇట్లు జేయగా వరుసగ ఊర్ధ్వముఖత్వము, అధోముఖత్వము లభించ గలవు. అప్పుడు పాదము కూడ నికుట్టితము గావలయును. పార్శ్వమున నున్న హస్తనికుట్టిత యోగముచే నీ కరణము పార్శ్వనికుట్టిత మని పిలువబడుచున్నది. ప్రకాశన సంచరణాభ్యాస ప్రధానమైన వాక్యార్థము నభినయించు నపు డీ కరణమును ప్రయోగించవలెను.

### 50. లలాటతిలకమ్

వృశ్చికం చరణం కృత్వా పాదస్యాంగుష్ఠకేనతు
లలాటే తిలకం కుర్యా ల్లలాటతిలకంతు తత్. 110

వృశ్చిక కరణమున చెప్పబడిన వృశ్చికచరణమును చూపి, పాదముయొక్క బొటన వ్రేలితో లలాటమున తిలకమును బెట్టగా లలాటతిలక మను కరణము వచ్చును. కాని శిరస్సు వెనుకనుంచి వచ్చు కాలి బొటనవ్రేలితో తిలకధారణ చేయబడుట కష్టమగుటచే, ఆ పాదమును

ఎడమ చేతితో పుచ్ఛుకొని, బొటనవ్రేలిని లలాటమునకు తాకునట్లు చేయవలయునని భావము. విద్యాధర గమనమును తెలుపునపుడిది ప్రయోగింపబడవలయును.

51. క్రాంతకమ్

పృష్ఠతః కుంచితం కృత్వా వ్యతిక్రాంతక్రమం తతః
ఆక్షిప్తౌ చ కరౌ కార్యౌ క్రాంతకే కరణే ద్విజాః.　　　　111

కుంచితపాదమును పైకి ఎత్తి ముందుకు సాచి, మరల పైకి ఎత్తి భూమిపై వేయగా వచ్చు అతిక్రాంతాచారి 10 అ. 29 శ్లో. విధిని గావించి క్రింద నున్న పాదమును కుంచితముగా నుంచవలెను. ఈ కుంచిత పాదమును వెనుకగా తీసికొనవచ్చి క్రమాంతర పరిక్రమముతో సాచవలెను. హస్తములను చలింపజేయుచు వ్యావర్తిత కరణమున [illegible]ము నుంచి బయటకు వచ్చునట్లు చేయవలెను. అప్పుడు పరివర్తిత కరణముతో ఆక్షిప్తములుగా జేసి వక్షమునద్ద ఖటకాముఖము లుగా నుంచవలయును. ఇట్లు అంగపర్యాయ మొనర్పగా క్రాంతకమను కరణము రాగలదు. ఉద్ధతపరిక్రమమున దీనిని ప్రయోగించవలయును.

52. కుంచితమ్

ఆద్యః పాదో నతః కార్యః సవ్యహస్తశ్చ కుంచితః
ఉత్తానో వామపార్శ్వస్థ స్తత్కుంచిత ముదాహృతమ్.　　　　112

కుడిమోకాలిపై నిలచి, పాదమును అగ్రతల సంచరముగా చేయవలెను. కుంచింపబడిన కుడిచేతిని ఉత్తాన అలపల్లవరూపముగా ఎడమప్రక్క నుంచవలెను. అప్పుడు కుంచితమను కరణము వచ్చును. అపరిమితము, అలౌకికము నగు ఆనందముతో నిండియున్న దేవత నభిన యించుటలో నీ కరణము ప్రయోగించవలెను.

53. చక్రమండలమ్

ప్రలంబితాభ్యాం బాహుభ్యాం యద్గాత్రేణా నతేనచ
అభ్యంత రాపవిద్ధః స్యా త్తజ్జ్ఞేయం చక్రమండలమ్.　　　　113

చక్రమండలకరణమున అడ్డితా అను చారీ ప్రయోగింపబడవలెను. సమముగానున్న ఒక పాదమునకు ముందు, వెనుక గూడ అగ్రతలసంచరపాదమును ఘట్టించుచు, శ్లిష్టముగా చేయుచు, అంగపర్యాయము గావింపగా అడ్డితాచారి రాగలదు. 10 అ. 22 శ్లో.

బాహువులు వ్రేలాడుచు శరీరముదగ్గరకు తీసికొనిరాబడి అభ్యంతరాపవిద్ధము లైనచో చక్రమండల కరణము వచ్చును. ఉద్ధతపరిక్రమ పరిష్కరణాది విషయమున నీ కరణమును ప్రయోగించ వలయును.

54. ఉరోమండలమ్

స్వస్తికాపసృతౌ పాదా వపవిద్ధక్రమౌ యదా
ఉరోమండలకౌ హస్త ఉరోమండలికంతు తత్.　　　　114

అగ్రతలసంచరపాదముతో భూమిని ఘట్టించుచు, ఆ పాదమును రెండవకాలి జానువుతో స్వస్తికగా పట్టిన అభ్యంతరమండలము రాగలను. ఇట్లు అంగపర్యాయము చేయగా వచ్చు స్థితావర్తా చారీని 10 అ. 14 శ్లో. ప్రయోగించవలెను. స్వస్తికలోనున్న పాదముల నీ చారీతో వేరుచేయవలెను. అపై బద్ధాచారీని 10 అ. 20 శ్లో. ఆడవలెను. స్వస్తికాపసరణముతో పాద తలాగ్రములు మండలభ్రమణపూర్వకముగా ఇయా ప్రక్కలకు రాగా ఊరుబంధము కలిసి అపవిద్ధ మగును. అప్పుడు ఉరోమండలహస్తములు ప్రయోగింపగా ఉరోమండల కరణము వచ్చుచున్నది. ఉద్వేష్టితముగా కుడిచేయి, అపవేష్టితముగా ఎడమచేయి, వక్షమువద్ద భ్రమిం చగా వచ్చునవి ఉరోమండలహస్తములు 9 అ. 174 శ్లో.

## 55. ఆ క్షి ప్త మ్

ఆక్షిప్తం హస్త పాదంచ క్రియతే యత్ర వేగతః
ఆక్షిప్తం నామ కరణం విజ్ఞేయం త ద్ద్విజోత్తమాః. 115

కుంచితపాదమును ఎత్తి, ఆక్షిప్తముగా చేసి, అంచితముగా ముందునకు ఉంచవలయును. తర్వాత అర్ధమండలముగా ప్రక్కకు తీసికొనివచ్చి జంఘా స్వస్తికను పట్టి మడమను భూమిపై వేయగా వచ్చు ఆక్షిప్తాచారితో 10 అ. 36 శ్లో. ప్రక్కకు వంగవలెను. అప్పుడు చతురము గాని ఖటకాముఖముగాని వేగముగా నాక్షిప్తము చేయవలెను. ఇట్లు చేయగా వచ్చునది ఆక్షిప్తకరణము. దీనిని విదూషకగతి విషయమున ప్రయోగించవలెను గావున నీ కరణము స్త్రీలచే ప్రయోగింపబడరాదు.

## 56. త ల వి లా సి త మ్

ఊర్ధ్వాంగులితలః పాదః పార్శ్వే నోర్ధ్వ ప్రసారితః
ప్రకుర్యా దంచిత తలౌ హస్తౌ తలవిలాసితే. 116

అరికాలు, (వేళ్ళు) పైకి ఉన్నపాదమును ప్రక్కగా పైకి సాచవలెను. పాదమును పైకి సాచునపుడు అరచేతితో సంశ్లేష మొనర్పవలెను. పతాకహస్తములు పరస్పరము చక్కగా సంశ్లిష్టము లగుటచే పాదతలమునకు, హస్తతలమునకు దూరముగా సంశ్లేషణము జరుగవలెను. ఇట్లు అంగపర్యాయము చేయగా తలవిలాసితమను కరణము రాగలదు. నాట్యాచార్యు లీ కరణమును సూత్రధారాది విషయమున పాదోద్ధార మను పేరుతో ప్రయోగింతురు.

## 57. అ ర్గ ల మ్

పృష్ఠతః ప్రసృతః పాదో ద్వౌ తాలా వర్ధమేవచ
తస్యైవ చానుగో హస్తః పురత స్త్వర్గలంతు తత్. 117

రెండుజంఘలకు మధ్యదూరము రెండున్నరతాళము లుండునట్లుగా చేసి పాదమును వెనుకకు సాచవలెను. ఇదేసమయమున అలపల్లవమగు కుడిచేతిని ప్రక్కగా ఎడమవైపుకు సాచి, లోపల నున్న నీటిని క్రిందకు పోయునట్లుగా అధోముఖము చేయవలెను. అర్గలవలె దేహమును నియంత్రించుటచే నీకరణమునకు అర్గలమను పేరు వచ్చినది. అంగదుడు మొదలగువారి గతి పరిక్రమమున దీనిని ప్రయోగించ వలసియున్నది.

### 58. విక్షిప్తమ్

విక్షిప్తం హస్తపాదంచ పృష్ఠతః పార్శ్వతోఽపివా
ఏకమార్గగతం యత్ర తద్విక్షిప్త ముదాహృతమ్. 118

హస్తపాదములను వెనుకకు ప్రక్కకు గూడ విక్షేపము చేయవలెను. అనగా విద్యుద్భ్రాంతా, దండపాదా అను చారీలను ప్రయోగించవలెనని భావము. ప్రక్కనుండి వెనుకకు పాదమును త్రిప్పి శిరఃసంశ్లేషముద్వారా అన్నివైపుల (పైకి, క్రిందకు, ప్రక్కలకు) మండలము వలె తిరిగి ప్రసారించగా విద్యుద్భ్రాంతాయను చారి వచ్చును. 10 అ. 39 శ్లో.

నూపురపాదికలోని కుంచితపాదమును రెండవకాలి మడమవెనుక నుంచి ముందుకు చాచి దేహక్షేత్రమునకు అభిముఖముగా నుండునట్లు జాన్వగ్రము నుండి త్వరగా చాచగా, ఊరు, జాను, జంఘలు స్తబ్ధములై దండాకారమున నుండ గలవు. అప్పుడది దండపాదాచారి యగును. 10 అ. 43 శ్లో. ఉద్ధతగతి పరిక్రమ సూచనాది విషయమున నీకరణమును ప్రయోగించ వలెను.

### 59. ఆవర్తమ్

ప్రసార్య కుంచితం పాదం పున రావర్తయే ద్ద్రుతమ్
ప్రయోగవశగా హస్తా తదావర్త ముదాహృతమ్. 119

కుడిపాదము ముందునకు ఒక అడుగు ప్రసారించి, వెనుకకు తీసికొని ఎడమ పాదముతో గంతువేసి అపసర్పణము చూపవలెను. ఇట్లు భయమును తెల్పు అపసర్పణక్రియ గల చాషగతి యను చారీని 10 అ. 18 శ్లో. ప్రయోగించవలెను. కుంచిత పాదమును ప్రసారించి, వేగముతో వెనుకకు తీసికొని రావలెను. ఉద్వేష్టితాపవేష్టిత రూపము లగు దోలాహస్తములను ఈ ఆవర్త కరణమున చూపవలెను. నాయకోపసర్పణమున, పాశబంధాద్యవసరమున, ఈ కరణము ప్రియోగింపబడవలయును.

### 60. దోలాపాదమ్

కుంచితం పాదముత్క్షిప్య పార్శ్వాత్ పార్శ్వంతు దోలయేత్
ప్రయోగవశగా హస్తా దోలాపాదం తదుచ్యతే. 120

మొదట ఊర్ధ్వజాను చారీని, తర్వాత దోలాపాదా చారీని అభినయించవలెను. కుంచిత మగు కుడిపాదమును పైకిఎత్తి మోకాలు స్తనములతోను, పాదము జానువుతోను సమముగా నుండునట్లుంచి, రెండవపాదమును స్తబ్ధముగా నుంచి, అంగపర్యాయము చేయగా ఊర్ధ్వజాను చారీ రాగలదు 10 అ, 32 శ్లో. కుంచిత పాదమును ఎత్తి ఒకప్రక్క నుంచి మరొకా ప్రక్కకు ఊగునట్లు చేసి, అంచితముగా క్రిందకు వేసిన దోలాపాదా చారి వచ్చును 10 అ. 35 శ్లో. ఈచారీలతో దోలాహస్తములను పట్టినచో దోలపాద మను కరణము సిద్ధమగును.

### 61. నివృత్తమ్

ఆక్షిప్తం హస్త పాదంచ త్రికంచైవ వివర్తయేత్
రేచితౌ చ తదా హస్తౌ నివృత్తే కరణే ద్విజాః. 121

దేహక్షేత్రము నుండి ఎడమపాదమును దూరముచేసి మరల దగ్గరకు తేవలెను. ఇట్లే చేతిని కూడ వ్యావర్తిత పరివర్తితముగా చేయవలయును. ఎడమచేతిని ఎడమకాలిని ఆక్షిప్తములుగా చేసి భ్రమరికాచారీతో కాలిని త్రిప్పవలెను. అప్పుడు హంసపక్షములు రేచితములగుచు. ఈ విధముగా త్రికవివర్తన యోగ ముండుటచే నీ కరణము నివృత్త మగుచున్నది. ఉద్ధతగతి పరిక్రమమున దీనిని ప్రయోగించవలయును.

## 62. వినివృత్తమ్

సూచీవిద్ధం విధాయాథ త్రికంతు వినివర్తయేత్
కరౌచ రేచితౌ కార్యౌ వినివృత్తే ద్విజోత్తమాః. 122

కుంచితపాదమును ఎత్తి జానుపర్యంతము జంఘా భాగమును ప్రసారించి, పాదముయొక్క ముందుభాగము మొదట క్రింద పడునట్లుగా నుంచిన సూచీయను చారి రాగలదు 10 అ. 33 శ్లో. ఈ చారీ విధానముతో వడమ పద్ద స్వస్తికను పట్టి రెండవపాదము నుంచవలెను. అప్పుడు త్రికోణాకారముగా కుడిపాదమును పట్టి ఒకే ఒక ప్రక్క వివర్తింపజేసి, ప్రత్యావర్తనక్రమముతో నివృత్తిని చూపవలయును. అన్యోన్య జంఘాసంవేధముతో స్వస్తికనుపట్టి ఊరువలనము చేయగా వచ్చు బద్ధాచారీ 10 అ. 20 శ్లో. నైనను ప్రయోగించవచ్చును. ఈ కరణ ప్రయోగావసరమున హంసపక్ష హస్తములను భ్రమత్రభ్రమము కలవిగా నొనర్పవలెను. ఈకరణమును కూడ ఉద్ధతగతి పరిక్రమముననే ప్రయోగింపవలయును.

## 63. పార్శ్వక్రాంతమ్

పార్శ్వక్రాంత క్రమం కృత్వా పురస్తా దథ పాతయేత్
ప్రయోగవశగా హస్తౌ పార్శ్వక్రాంతం తదుచ్యతే. 123

పార్శ్వక్రాంతాచారీతో 10 అ. 31 శ్లో. పాదమును ముందుకు వేయవలెను. చేతులను కూడ పాదముతోబాటు ముందుకు ప్రసారించిన పార్శ్వక్రాంత కరణమగును. రౌద్రప్రధానమైన పరిక్రమమున నీ కరణమును ప్రయోగించవలయును.

## 64. నిశుంభితమ్

పృష్ఠతః కుంచితః పాదో వక్షశ్చైవ సమున్నతమ్
తిలకేచ కరః స్థాప్య స్తన్నిశుంభిత ముచ్యతే. 124

వెనుకకు కుడిపాదమును కుంచించి, వక్షమును నిర్భుగ్నముగా, స్తబ్ధముగా, నిమ్నపృష్ఠముగా నుంచవలెను. ఖటకాముఖ హస్తముయొక్క నడిమివ్రేలితో లలాటమున తిలకమును పెట్టుచున్నట్లు చూపవలెను. ఎడమపాదముతో భూమిని ఘట్టించవలెను. ఈ నిశుంభితకరణము మహేశ్వరాభినయ విషయక మైనది.

## 65. విద్యుద్భ్రాంతమ్

పృష్ఠతో వలితం పాదం శిరో ఘృష్టం ప్రసారయేత్
సర్వతో మండలావిద్ధం విద్యుద్భ్రాంతం తదుచ్యతే. 125

ప్రక్కనుండి వెనుకకు వర్తులము వలె పాదమును ప్రేక్షించు, శిరస్సంశ్లేషము చేయుచు, తద్వారా అన్నివైపుల మండలమువలె తిరిగి పాదమును కుంచించ వలెను. మెరపువలె పాదము భ్రమించుటచే కలుగు విద్యుద్భ్రాంత కరణమును ఉద్ధతగతి పరిక్రమాది విషయమున ప్రయోగించ వలయును.

### 66. అతిక్రాంతమ్

అతిక్రాంత క్రమం కృత్వా పురస్తాత్ సంప్రసారయేత్
ప్రయోగవశగౌ హస్తా వతిక్రాంతే ప్రకీర్తితౌ. 126

ఎడమకాలి మడమవద్ద కుడిపాదమును కుంచించి, ఎత్తి, నాలుగుతాలముల దూరము సాచి, పూర్వకాయము, క్రిందకు పడునట్లు చేయగా వచ్చు అతిక్రాంతా చారీని 10 అ. 29 శ్లో. ప్రయోగించి, ఎడమపాదమును ముందుకు ప్రసరించవలెను. ప్రయోగము ననుసరించి హస్తము లను పట్టవలెను. ఈ అతిక్రాంత కరణము గతిపరిక్రమాది విషయమున ప్రయోగింప బడవలెను.

### 67. వివర్తితకమ్

ఆక్షిప్తం హస్త పాదంచ త్రికంచైవ వివర్తితమ్
ద్వితీయో రేచితో హస్తో వివర్తితక మేవ తత్. 127

కుడిపాదమును, కుడిచేతిని ఆక్షిప్తముచేసి, భ్రమరికాచారీతో త్రికోణాకారమైన కాలిని త్రిప్పవలెను. ఎడమచేతిని హంసపక్షముగా నుంచి వేగముతో కంపింపజేయగా వివర్తితక మను కరణము వచ్చును.

### 68. గజక్రీడితకమ్

కర్ణేఽంచితః కరో వామో లతాహస్తశ్చ దక్షిణః
దోలాపాద స్తథాచైవ గజక్రీడితకం భవేత్. 128

సమున్నతమైన లతాహస్తమగు కుడిచేతిని ఒక ప్రక్కనుండి మరియొక ప్రక్కకు ఊపుచు త్రిపతాకగా నెడమచేతిని చెవివద్ద నుంచగా కరిహస్తము లభించును. 9 అ. 169 శ్లో. ఈ త్రిపతాక హస్తమును అంచిత క్రియావిష్టముగా చేసి దోలాపాదాచారీని ప్రయోగించగా గజ క్రీడితక మను కరణము వచ్చును. అంచిత క్రియావిష్ట మనగా క్షిప్త అంగపర్యాయము కావలెనని అర్థము. గజక్రీడావిషయమున నీ కరణమును ప్రయోగించవలెను.

### 69. తలసంస్ఫోటితమ్

ద్రుత ముత్క్షిప్య చరణం పురస్తా దథ పాతయేత్
తలసంస్ఫోటితౌ హస్తౌ తలసంస్ఫోటితే మతౌ. 129

అతిక్రాంతాచారీతో గాని, దండపాదాచారీతో గాని, పాదమును వేగముతో ఎత్తి, ఆక్షిప్తము చేసి, ముందుకు వేయవలెను. అదేసమయమున పతాక హస్తములను పట్టి రెంటిని కలుపగా తలసంస్ఫోటిత కరణము వచ్చును.

### 70. గరుడప్లుతకమ్

పృష్ఠప్రసారితౌ పాదౌ లతా రేచితకౌ కరౌ
సమున్నత మురశ్చైవ గరుడప్లుతకం భవేత్. 130

వృశ్చికచరణము వలె కుడిపాదమును వెనుకకు ప్రసారించి, కుడిచేతిని లతాహస్తముగ నుంచి, హంసపక్షమగు ఎడమచేతిని వేగముతో కంపింపజేయవలెను. ఇట్లే ఎడమపాదమును వృశ్చికచరణమువలె సాచి, ఎడమచేతిని లతాహస్తముగ నుంచి, హంసపక్షమగు కుడిచేతిని వేగముతో కంపింపజేయవలెను. ఇట్లు చేయునపుడు వక్షము బాగా ఉన్నతముగా నున్నట్లు కన్పించగా గరుడప్లుతక మను కరణము రాగలదు. గరుత్మంతుని ఎగురుటను అభినయించుచో దీనిని ప్రయోగించవలెను.

### 71. గండసూచీ

సూచీపాదోన్నతం పార్శ్వ మేకో వక్షః స్థితః కరః
ద్వితీయ శ్చాంచితో గండే గండసూచీ తదుచ్యతే. 131

బొటనవ్రేలి చివరిభాగమును ముందుకు చూపుచు, కుడిమడమను పైకిఎత్తి, ఎడమ పాదమును స్వాభావికముగా నుంచిన సూచీపాదము రాగలదు. 9 అ. 241 శ్లో. సూచీపాదమును పట్టుటచే కుడిప్రక్క ఎత్తుగానుండగా కుడిచేతిని రొమ్మువద్ద ఖటకాముఖముగానుంచి, ఎడమ అలపల్లవహస్తమును గండస్థలమువద్ద అంచితముగావింప వలెను.

సూచీపాదమే గండస్థలము వద్దకు పోవలెనని కొందరు దురభిప్రాయముబడినారు. సూచీముఖ మగు నృత్తహస్తమును గండస్థలమువద్ద అంచితముగా చేయవలెనని మరికొందరు పొరబడినారు. గండసంశ్రయములగు ప్రధాన భూషణముల నభినయించుటయందే ఈ కరణమును ప్రయోగించవలయును.

### 72. పరివృత్తమ్

ఊర్ధ్వాపవేష్టితౌ హస్తౌ సూచీపాదో వివర్తితః
పరివృత్త త్రికంచైవ పరివృత్తం తదుచ్యతే. 132

వక్షమునుండి వ్యావర్తిత కరణముతో లలాటమునకు పతాకలను తీసికొనిపోయి, ప్రక్కకు తెచ్చి, మండలమువలె త్రిప్పుచు ప్రసారించగా వచ్చు ఊర్ధ్వమండల హస్తములను 9 అ. 173 శ్లో. ప్రయోగించుచు, కుడికాలితో సూచీపాదమును పట్టవలెను. అప్పుడు బద్ధాచారీని 10 అ. 20 శ్లో. ప్రయోగించగా అన్యోన్య జంఘాసంవేధతో స్వస్తిక, ఊరువలనము రాగలవు. ఇది విచిత్రరూపమున ఎడమకాలితో రాగలదు. అప్పుడు భ్రమరికాచారితో త్రికపరివర్తనము చేయగా పరివృత్త మను కరణము సిద్ధించగలదు.

### 73. పార్శ్వజాను

ఏకః సమస్థితః పాద ఊరుపృష్ఠే స్థితోఽపరః
ముష్టిహస్తశ్చ వక్షఃస్థః పార్శ్వజాను తదుచ్యతే. 133

ఒక పాదమును సమముగా నుంచవలెను. రెండవకాలి ఊరు పృష్ఠము ముందుకు వచ్చు నట్లు ప్రక్కకు త్రిప్పవలెను. అప్పుడు ఒకచేతిని హృదయమువద్ద ముష్టిహస్తముగను, రెండవచేతిని నడుమువద్ద అర్ధచంద్ర హస్తముగను ఉంచగా పార్శ్వజాను కరణము రాగలదు.

### 74. గృధ్రావలీనకమ్

పృష్ఠప్రసారితః పాదః కించి దంచిత జానుకమ్
యత్ర ప్రసారితౌ బాహూ తత్ స్యాద్ గృధ్రావలీనకమ్. 134

ప్రక్కనుండి వెనుకకు కాలిని సాచి, బొటనవ్రేలిపై నిలచి, జానువును కొద్దిగా అంచితము చేయవలెను. రెండుప్రక్కల లతాహస్తములను ప్రసరించగా గృధ్రావలీనక మను కరణము వచ్చును. గద్దను నిరూపించునపుడు దీనిని ప్రయోగించవలయును.

### 75. సన్నతమ్

ఉత్ప్లుత్య చరణౌ కార్యా వగ్రతః స్వస్తికస్థితౌ
సన్నతౌ చ తథా హస్తౌ సన్నతం తదుదాహృతమ్. 135

అతిక్రాంతచారిలో చెప్పబడిన కుంచితపాదమును ఎత్తి, ఎగిరి క్రింద పడ వేయవలెను. అప్పుడు అంచితపాదము జంఘాప్రదేశమున ఉంచిన విదూషక గమనమును తెలుపు హరిణప్లుతా చారీ రాగలదు 10 అ. 42 శ్లో. ఈ చారితో ముందునకు ఎగురుచు, పాదములను స్వస్తికగా పట్టి చేతులను డోలాహస్తములుగా నుంచ సన్నతమను కరణము రాగలదు. అధమ పాత్రలు సమీపించుటను తెలుపుట కీ కరణమును ప్రయోగింపవలెను.

### 76. సూచీ

కుంచితం పాదముత్క్షిప్య కుర్యా దగ్రస్థితం భువి
ప్రయోగవశగా హస్తౌ త త్సూచీ పరికీర్తితమ్. 136

కుంచితమైన పాదమును ఎత్తి, జానుపర్యంతము జంఘభాగమును ప్రసారించి, పాదము ముందుభాగము క్రిందబడునట్లుగా వేయవలెను. ప్రయోగము ననుసరించి హస్తములను పట్టగా సూచీ యను కరణము రాగలదు.

### 77. అర్ధసూచీ

అలపద్మః శిరోహస్తః సూచీపాదశ్చ దక్షిణః
యత్ర తత్కరణం జ్ఞేయ మర్ధసూచీతి నామతః. 137

శిరఃక్షేత్రమున కుడిచేతిని అలపద్మముగా నుంచి, కుడికాలితో సూచీ కరణమున చెప్ప బడిన సూచీపాదమును ప్రయోగించగా అర్ధసూచీకరణము వచ్చును.

### 78. సూచీవిద్ధమ్

పాదసూచ్యా యదా పాదో ద్వితీయస్తు ప్రవిధ్యతే
కటి వక్షఃస్థితౌ హస్తౌ సూచీవిద్ధం తదుచ్యతే. 138

కుడిపాదపు మడమవద్ద ఎడమపాదమునుంచి, కుడిపాదమును సూచీపాదముగాజేసి, తర్వాత ఎడమపాదమును గూడ నిట్లే చేయవలెను. అప్పుడు పక్షవంచితక హస్తమునుగాని, అర్ధచంద్రహస్తమునుగాని నడుమువద్ద పట్టి, వక్షమువద్ద ఖటకాముఖ హస్తమును చూపవలెను. రెండు పాదముల అగ్రతలములే భూమిని అని యుండవలెను. ఈ సూచీవిద్ధ కరణమును చింతా విషయమున ప్రయోగించవలెను.

## 79. అపక్రాంతమ్

కృత్వోరువలితం పాద మపక్రాంతక్రమం నయేత్
ప్రయోగవశగా హస్తా వపక్రాంతం తదుచ్యతే. 139

బద్ధాచారిలో 10 అ. 20 శ్లో. చెప్పబడిన ఊరు వలనము గావించి తర్వాత కుంచిత పాదమును పైకిఎత్తి ప్రక్కన వేయగా వచ్చు అపక్రాంతాచారి 10 అ. 30 శ్లో. నిట ప్రయోగించవలెను. తదుపరి అన్యోన్య జంఘాసంయోగముతో స్వస్తికను పట్టి ఊరువలిత బద్ధాచారిని ప్రయోగించవలెను. ప్రయోగము ననుసరించి ఖటకాముఖ హస్తములను చూపగా అపక్రాంత మను కరణము రాగలదు.

## 80. మయూరలలితమ్

వృశ్చికం చరణం కృత్వా రేచితౌ చ తథా కరౌ
తథా త్రికం వివృత్తంచ మయూరలలితం భవేత్. 140

వృశ్చిక పాదమును పట్టి, హంసపక్ష హస్తములను వేగముతో కంపింప జేయవలెను. పాదముయొక్క చివర తొడవద్ద కుంచించి భ్రమరికాచారిని 10 అ. 44 శ్లో. ప్రయోగించగా నెమలి నృత్తము ననుకరించు మయూరలలిత కరణము రాగలదు.

## 81. సర్పితమ్

అంచితాఽపసృతౌ పాదౌ శిరశ్చ పరివాహితమ్
రేచితౌచ తథా హస్తౌ తత్సర్పిత ముదాహృతమ్ 141

మడమను భూమిపైనుంచి, పాదము ముందుభాగమును పైకి ఉండునట్లువేసి, వ్రేళ్ళను సాచినచో పాదము అంచితమగును 9 అ. 237 శ్లో. ఇట్టి అంచితమగు కుడిపాదమును రెండవ పాదమువద్దకు తీసికొని వెళ్ళుచు, కుడివైపునకు తలను వంచి, హంసపక్షమగు కుడిచేతిని వేగముతో కంపింపజేయవలెను. ఇట్లు ఎడమవైపున కూడ చేయగా, క్రమముగా రెండుప్రక్కలకు శిరస్సు వంచబడి, పరివాహిత శిరమగును. ఇట్లు సిద్ధించు సర్పితకరణమును మదోపసర్పణమున ప్రయోగించవలయును.

## 82. దండపాదమ్

నూపురం చరణం కృత్వా దండపాదం ప్రసారయేత్
క్షిప్రావిద్ధకరం చైవ దండపాదం తదుచ్యతే. 142

కుడిపాదమును అంచితముగా జేసి, మడమను పిరుదుకు తాకునట్లుగా తీసికొనిపోయి, కుడిప్రక్క అంచిత జంఘాభాగము క్రింద బడునట్లు వేసినచో నూపురపాదికాచారి రాగలదు.

10 అ. 34 శ్లో. ఈ నూపురచరణమును గావించి దండపాదాచారిని ప్రయోగించవలయును. నూపురపాదికలోని కుంచితపాదమును రెండవకాలి మడమనద్దకు తీసికొనిపోయి, స్వదేహక్షేత్రమున కభిముఖమగునట్లు ముందుకు ప్రసారించగా దండపాదాచారి రాగలదు. 10 అ. 43 శ్లో. ఊరు, జాను, జంఘలు స్తబ్ధములై, దండాకారమున నుండగలవు. పాదమును దండమువలె ప్రసరించు నపుడు, హస్తమునుగూడ చాచవలెను. ఇట్లు ఉద్భవించు దండపాదకరణమును ఆటోపముతో గూడిన పరిక్రమాది విషయమున ప్రయోగించవలెను.

## 83. హరిణప్లుతమ్

అతిక్రాంతక్రమం కృత్వా సముత్ప్లుత్య నిపాతయేత్
జంఘాంచితా పరిక్షిప్తా తద్విద్యాద్ధరిణప్లుతమ్. 143

అతిక్రాంతచారిలోని కుంచితపాదమును ఎత్తి ఎగిరి పాదమును వేయవలెను. తర్వాత జంఘాంచితమగు ఎడమపాదమును వెనుకకు వేయగా లేడి ఎగురుచున్నట్లు కన్పించగలదు. ఇట్లు హారిణప్లుతమను చారితో 10 అ. 42 శ్లో. కూడిన హారిణప్లుతకరణమును విదూషకాది గమనమున ప్రయోగించవలెను.

## 84. ప్రేంఖోలితమ్

దోలాపాదక్రమం కృత్వా సముత్ప్లుత్య నిపాతయేత్
పరివృత్తత్రికం చైవ తత్ ప్రేంఖోలిత ముచ్యతే. 144

కుంచితమైన కుడిపాదమును ఎత్తి ఒకప్రక్కనుండి మరియొక ప్రక్కకు ఊపుచు, అంచితాకృతితో మడమను ముందుకు వేసిన దోలాపాదాచారి రాగలదు 10 అ. 35 శ్లో. ఈ దోలాపాదాచారిని ప్రయోగించి, ఎడమపాదముతో ఎగిరి పాదమును వేయవలెను. భ్రమరికాచారిని ప్రయోగించి త్రికోణాకారమైన ఊరువును పరివర్తితము గావింప ప్రేంఖోలిత కరణము వచ్చును.

## 85. నితంబమ్

భుజా వూర్ధ్వ వినిష్క్రాంతౌ హస్తౌ చా భిముఖాంగులీ
బద్ధాచారీ తథాచైవ నితంబే కరణే భవేత్. 145

ఊర్ధ్వాంగుళములుగా పతాక హస్తములను వ్యావర్తిత కరణమున శిరోదేశమునకు తీసికొనిపోయి, పరివర్తిత కరణముతో ఊర్ధ్వక్షేత్రమున బాహువులను బయటకు పంపవలెను. అప్పుడు భుజములవద్దకు పతాకహస్తములను దెచ్చి, ఒకదాని కొకటి ఎదురుగా నుండునట్లు చేయవలెను. తర్వాత నీ హస్తముల వ్రేళ్ళను దేహమున కభిముఖముగా నుండునట్లు రేచితము జేసి నితంబహస్తములను జూపవలెను. స్కంధక్షేత్రమునుండి ఉత్తానాధోముఖత్వముగా పతాకలను బయటకు పంపుచు నితంబమునకు తెచ్చినచో నితంబహస్తములు రాగలవు 9 అ. 166 శ్లో.

## 86. స్ఖలితమ్

దోలాపాదక్రమం కృత్వా హస్తౌ తదనుగా వుభౌ
రేచితౌ ఘూర్ణితౌ వాపి స్ఖలితం కరణం భవేత్. 146

డోలాపాదాచారీని ప్రయోగించుచు హంసపక్ష హస్తములతో గూడిన బాహువుల గమనాగమనములను తెలుపుచు, అంగపర్యాయము గావింప స్ఖలితమను కరణము రాగలదు.

87. కరిహస్తమ్

నామో వక్షఃస్థితో హస్తః ప్రోద్వేష్టిత తలోஉపరః
అంచిత శ్చరణశ్చైవ ప్రయోజ్యః కరిహస్తకే. 147

సమున్నతమైన లతాహస్తము నొకప్రక్కనుండి మరొకప్రక్కకు ఊపుచు, త్రిపతాకయగు రెండవచేతిని చెవివద్ద నుంచగా కరిహస్తము వచ్చును. ఈ త్రిపతాక హస్తమును ఎడమచేతి లోపలిభాగమున త్రిప్పుచు, కుడిపాదము నంచితముగా ప్రయోగించి నిష్క్రమింపజేయవలెను. అప్పుడు కరిహస్తమను కరణము సిద్ధించును.

88. ప్రసర్పితకమ్

ఏకస్తు రేచితోహస్తో లతాఖ్యస్తు తథాపరః
ప్రసర్పితతలౌ పాదౌ ప్రసర్పితక మేవతత్. 148

హంసపక్షమగు కుడిచేతిని వేగముతో కంపింపజేయుచు, ఎడమచేతిని లతాహస్తముగా నుంచవలెను. కుడిపాదముతో మెల్లిగా భూమిని ఘట్టించుచు అడుగులు వేయవలెను. అప్పుడు వచ్చు ప్రసర్పితక మను కరణమును ఖేచరసంచార విషయమున ప్రయోగించవలెను.

89. సింహవిక్రీడితమ్

అలాతంచ పురః కృత్వా ద్వితీయంచ ద్రుతక్రమమ్
హస్తౌ పాదానుగౌ చాపి సింహవిక్రీడితే స్మృతౌ. 149

మొదట పాదమును వెనుకకు ప్రసారించి, తర్వాత వలనముతో లోనికితెచ్చి, రెండవకాలి తొడ కెదురుగా నుండునట్లు తీసికొనిరావలెను. ఆ పాదమును ప్రక్కగా మడమతో కలుపగా వచ్చు అలాతాచారీని 10 అ. 40 శ్లో. ప్రయోగించవలెను. ఇట్లే రెండవపాదముతో గూడ వేగముగా అలాతచారీని చూపుచు పాదమును ముందుకు వేయవలెను. ప్రయోగక్రమము ననుసరించి చేతిని కూడ ముందుకు వేయగా సింహాకరఘాతమువలె ఆకృతి విన్యాసము రాగలదు. రౌద్రగతి విషయమున నీ కరణమును ప్రయోగించవలయును.

90. సింహాకర్షితమ్

పృష్ఠ ప్రసారితః పాద స్తథా హస్తౌ నికుంచితౌ
పున స్తథైవ కర్తవ్యౌ సింహాకర్షితకే ద్విజాః. 150

వృశ్చికపాదమును వెనుకకు సాచి, నికుంచితములగు పద్మకోశ, ఊర్ణనాభహస్తములతో స్వస్తికను పట్టవలెను. చేతులను వేరుజేసి, రెండవపాదముతో వృశ్చికచరణము నాడి మరల ఆ హస్తములతోనే స్వస్తికను చూపవలెను. ఇట్లు చేయగా వచ్చు సింహాకర్షిత కరణమును సింహాద్యభినయ విషయమున ప్రయోగించవలెను.

### 91. ఉద్వృత్తమ్

ఆక్షిప్తహస్తమాక్షిప్తదేహమాక్షిప్తపాదకమ్
ఉద్వృత్తగాత్ర మిత్యేత దుద్వృత్తం కరణం స్మృతమ్. 151

హస్తపాదములను చాచి వెనుకకు తీసికొని రావలెను. ఇట్లు హస్తపాదముల నాక్షిప్తములుగా జేయుచు సమస్త దేహమునుగూడ ఉద్వృత్తాచారితో ఆక్షిప్తము చేయవలెను. ఆవిద్ధచారిలోని కుంచిత పాదపు మడమను రెండవకాలి తొడవద్దకు తీసికొని, అదేపాదముతో గంతు వేసి పరివర్తితము చేయవలెను. ఇట్లే రెండవపాదముతోగూడ చేయగా ఉద్వృత్తాచారిరాగలదు 10 అ. 39 శ్లో ఈ చారితో గూడిన దగుటచే నీ కరణము ఉద్వృత్తమని చెప్పబడినది.

### 92. ఉపసృతకమ్

ఆక్షిప్త శ్చరణ శ్చైకో హస్తస్యైవ వశానుగః
ఆనతంచ తథా గాత్రం తథో పసృతకం భవేత్. 152

ఆక్షిప్తాచారిని ప్రయోగించి ఎడమ ప్రక్కగా వ్యావర్తింపజేసి, కరపరివర్తనముతో శరీరమును వంచి కుడిచేతిని అరాలముగా చేయవలెను. అప్పుడు వచ్చు ఉపసృతక మను కరణమును వినయముతో సమీపించు సందర్భమున ప్రయోగింపబడవలెను.

### 93. తలసంఘట్టితమ్

దోలాపాదక్రమం కృత్వా తలసంఘట్టితౌ కరౌ
రేచయేచ్చ కరం వామం తలసంఘట్టితే సదా. 153

దోలాపాదాచారిని ప్రయోగించుచు, పతాకహస్తముల నొకదానితో నొకటి ఘట్టించుచు, వైష్ణవస్థానకమునుండి కుడిచేతిని నడుమువద్ద నుంచి, ఎడమచేతిని హంసపక్షముగాచేసి వేగముతో కంపింపజేయగా తల సంఘట్టిత కరణము రాగలదు. అనుకంపా ప్రధానమైన వాక్యార్థము నభినయించుటలో నీ కరణమును ప్రయోగించవలెను.

### 94. జనితమ్

ఏకో వక్షఃస్థితో హస్తో ద్వితీయశ్చ ప్రలంబితః
తలాగ్ర సంస్థితః పాదో జనితే కరణే భవేత్. 154

వక్షమువద్ద కుడిచేతిని ముష్టిహస్తముగానుంచి, ఎడమచేతిని లతాహస్తముగా చూపవలెను. పార్శ్వమున పాదముయొక్క ముందుభాగముపై నిలచియుండ జనిత మను కరణము వచ్చును. అభినయప్రారంభకాలముననే తత్సన్నివేశ జననయోగ్యమైన ఈ కరణమును జనితాచారితో చూపవలెను 10 అ. 24 శ్లో. జనితాచారీ లక్షణము కూడనదియే. సమస్త గీతములీ చారితో జన్మించున వగుటచే నిది జనితా యనబడినది.

### 95. అవహిత్థకమ్

జనితం కరణం కృత్వా హస్తౌ చాభిముఖాంగులీ
శనై ర్నిపతితౌ చైవ జ్ఞేయం త దవహిత్థకమ్. 155

జనితాచారీలోని పాదమును ప్రయోగించి లలాటవక్షః క్షేత్రములయందు అరాల, అల పల్లవ హస్తములను పట్టి నెమ్మదిగా ఉద్వేష్టిత కరణమున చేతులను క్రిందకు పైకి తెచ్చుచు, ప్రక్కలయం దుంచవలెను. మరల అపవేష్టిత కరణమున పరివర్తితములుగాజేసి అరాల, అల పల్లవ హస్తములను ఒకదానికొకటి ఎదురుగానుండునట్లు వక్షమువద్ద నుంచవలెను. ఏవంవిధమైన అవహిత్థక కరణమును గోపనప్రధానమైన నాట్యార్థమున ప్రయోగించవలెను.

అంచితములైన శుకతుండ హస్తములను వక్షమువద్ద ఒకదానికొకటి ఎదురుగానుండునట్లు పట్టి, అధోముఖములుగాచేసి నెమ్మదిగా క్రిందకు పంపగా అవహిత్థహస్తములు రాగలవు 9 అ. 133 శ్లో. ఈ హస్తము లిచట నభిప్రేతములని కొందరి అభిప్రాయము. ఇట్టి వ్యాఖ్యాతల ననుసరించినచో ఏ కరణమును చింతా దౌర్బల్య విషయమున నభినయించవలసి యుండును.

## 96. నివేశమ్

కరౌ వక్షఃస్థితౌ కార్యౌ వురో నిర్భుగ్న మేవచ
మండలస్థానకం చైవ నివేశం కరణం తు తత్. 156

వీపు లోనికవచ్చి, రొమ్ముభాగము ఎత్తుగా నుండగా, భుజములు జారకుండునట్లు స్తబ్ధమగు ఉరమును నిర్భుగ్నమందురు. చేతులను వక్షమువద్దనుంచి, ఉరఃప్రదేశమును నిర్భుగ్నముగా చూపి, మండలస్థానకమున నున్నచో నివేశకరణము రాగలదు. ఐంద్రమండల స్థానకమున పాదముల మధ్య దూరము నాల్గు తాళములు వచ్చును 10 అ. 61 శ్లో. ఈ కరణముతో గజవాహనాది విషయము నభినయించవలెను.

## 97. ఏలకాక్రీడితమ్

తలసంచర పాదాభ్యా ముత్ప్లుత్య పతనం భవేత్
సంనతం వలితం గాత్ర మేలకాక్రీడితం తు తత్. 157

పాదముల అగ్రతలములపై నిలచి, ఎగిరి పాదములను వేయుచు శరీరమును వంచి పాదమును త్రిప్పవలెను. ఈ ప్రక్రియలో ఏలకాక్రీడితచారీని ప్రయోగించవలెను. అగ్రతల సంచర పాదములతో ఎగురునపుడు మడమ పిరుదకు త్రాకవలెను. ఇట్లు అంగపర్యాయముతో పతనోత్ప్లుతులు జరుగగా ఏలకాక్రీడితచారీ రాగలదు 10 అ. 19 శ్లో. ఈ ఏలకాక్రీడిత కరణమును అధమ పాత్రలగతిని నిరూపించునపు డుపయోగించవలెను.

## 98. ఊరూద్వృత్తమ్

కర మావృత్తకరణ మూరుపృష్ఠేఽంచితం న్యసేత్
జంఘాంచితా తథోద్వృత్తా హ్యూరూద్వృత్తంతు తద్భవేత్. 158

అగ్రతలసంచర పాదముయొక్క మడమను రెండవ పాదముయొక్క వెనుక అనభిముఖముగా నుంచవలెను. జానువు వంగుటచే జంఘభాగము కుంచితమై రెండవకాలి జంఘభాగమున కెదురుగా నుండునట్లు తిరుగవలెను. ఊరువుల కీ రీతిగా వచ్చు ఊర్ధ్వవివర్తనము లజ్జ, ఈర్ష్యాది విషయమును చూపును. ఈ విధముగా సిద్ధించు ఊరూద్వృత్తాచారీని 10 అ. 21 శ్లో. ప్రయోగించుచు, వ్యావర్తితకరణమున అరాలమగు కుడిచేతిని ఊరుదేశమున, ఖటకాముఖమగు ఎడమ

చేతిని పృష్ఠమున ఉంచవలెను. ఇట్లుత్పన్నమగు ఊరూద్వృత్తకరణమును ప్రణయకోపమును, ఈర్ష్యను, ప్రార్థనాది విషయమును అభినయించునపుడు ప్రయోగించవలెను.

99. మదస్ఖలితకమ్

కరౌ ప్రలంబితౌ కార్యౌ శిరశ్చ పరివాహితమ్
పాదౌచ వలితా విద్ధౌ మదస్ఖలితకే ద్విజాః. 159

డోలాహస్తములను చూపుచు, శిరస్సును కుడి, ఎడమ ప్రక్కలకు వంచుచు పాదములను వలితములుగాను, ఆవిద్ధములుగాను జేసి, కుంచించి స్వస్తికనుపట్టి వేరు జేయవలెను. ఇట్లుఅంగ పర్యాయము గావింపగా మద్యమదవిషయమును తెలుపు మదస్ఖలితకమను కరణము రాగలదు.

100. విష్ణుక్రాంతమ్

పురః ప్రసారితః పాదః కుంచితో గమనోన్ముఖః
కరౌచ రేచితౌ యత్ర విష్ణుక్రాంతం తదుచ్యతే. 160

కుడిపాదమును ముందుకు సాచి, కుంచించి, గమనోన్ముఖతను సూచించి హంసపక్షములను వేగముతో కంపింపజేయగా త్రివిక్రముని పాదవిన్యాసమును తెలుపు విష్ణుక్రాంతకరణమురాగలదు. త్రివిక్రముని గమనమును తెలుపుట కీ కరణము నుపయోగించవలెను.

101. సంభ్రాంతమ్

కర మావర్తితం కృత్వా హ్యూరుపృష్ఠే నికుంచయేత్
ఊరుశ్చైవ తథావిద్ధః సంభ్రాంతం కరణంతు తత్. 161

స్వస్తికలోనున్న పాదములలో ముందున్న పాదమును కుంచించి ప్రసారించవలెను. తర్వాత ఆవిద్ధమైన ఈపాదమును ప్రక్కగా రెండవకాలి మడమవద్ద ముందు వడమ పడునట్లు వేయగా వచ్చు ఆవిద్ధాచారిని 10 అ. 37 శ్లో. ప్రయోగింపవలెను. ఈ ప్రయోగకాలముననే వ్యావర్తిత పరివర్తిత కరణములతో అలపల్లవహస్తమును ఊరుపృష్ఠమున ఉంచగా సంభ్రాంతమను కరణము రాగలదు. సంభ్రమ పరిక్రమమున నీ కరణమును ప్రయోగించవలెను.

102. విష్కంభమ్

అపవిద్ధః కరః సూచ్యా పాదశ్చైవ నికుట్టితః
వక్షఃస్థశ్చ కరో వామో విష్కంభే కరణే భవేత్. 162

సూచీహస్తమగు కుడిచేతితో ఎడమచేతిని అపగమపూర్వకముగా విద్ధముచేసి, ఎడమ పాదమును నికుట్టితముగా చేయవలెను. ఇట్లు అంగపర్యాయము ననేకసారులు చేయుచు సూచీ చారీలోని పాదమును నికుట్టితముగా నొనర్పవలెను. వక్షమువద్ద ఎడమచేతినుంచి, కుడిచేతితో అలపల్లవము చూపగా విష్కంభకరణము రాగలదు.

103. ఉద్ఘట్టితమ్

పాదా వుద్ఘట్టితౌ కార్యౌ తలసంఘట్టితౌ కరౌ
నితంబపార్శ్వం కర్తవ్యం బుధై రుద్ఘట్టితే సదా. 163

పాదతలాగ్రమున నిలిచి, భూమిపై మడమను వేయుటయే ఉద్ఘట్టితము 9 అ. 231 శ్లో. స్వస్తికగా పతాకహస్తముల నుంచి తలసంఘట్టిత మను తొంబదిమూడవ కరణమున చెప్పబడి నట్లు చేతులను సంశ్లిష్టములుగా చేయవలెను. ఇట్లు అంగపర్యాయముగావించి, నితంబపార్శ్వమును గావింపగా వచ్చు ఉద్ఘట్టితకరణము ప్రమోదవిషయమున ఉపకరించును.

### 104. వృషభక్రీడితమ్

ప్రయుజ్యా లాతకం పూర్వం హస్తౌ చాపి హి రేచయేత్
కుంచితౌ వంచితౌ చైవ వృషభక్రీడితే సదా. 164

సింహావిక్రీడిత కరణమున చెప్పబడిన అలాతాచారీని 10 అ. 40 శ్లో. ప్రయోగించుచు హంసపక్షములను వేగముతో కంపింపజేసి, వ్యావర్తిత కరణమున వాటిని కుంచించి బాహుశిరస్సున అలపల్లవములను అంచితములు చేయగా వృషభక్రీడిత కరణము వచ్చును.

### 105. లోలితమ్

రేచితౌ వంచితౌ హస్తౌ లోలితం వర్తితం శిరః
ఉభయోః పార్శ్వయో ర్యత్ర తల్లోలిత ముదాహృతమ్. 165

వైష్ణవస్థానకమున మొదట హంసపక్షముగు కుడిచేతిని వేగముతో కంపింపజేయవలెను. ఎడమచేతిని అంచితముచేసి అలపల్లవమును వక్షమున నుంచవలెను. శిరస్సును అన్నివైపులను త్రిప్పుచు, కుడి, ఎడమప్రక్కలయందు విశ్రమింపజేయగా లోలిత కరణము రాగలదు.

### 106. నాగాపసర్పితమ్

స్వస్తికాపసృతౌ పాదౌ శిరశ్చ పరివాహితమ్
రేచితౌ చ తథా హస్తౌ స్యాతాం నాగాపసర్పితే. 166

పాదములతో స్వస్తికనుపట్టి, వెరుచేయుచు, తలను ఈప్రక్కకు ఆప్రక్కకు కుటిలగతిని నిరూపించుచు, హంసపక్షహస్తములను రేచితముగావించిన నాగాపసర్పిత కరణము రాగలదు. దీనిని యౌవనమదవిషయమున జూపవలెను.

### 107. శకటాస్యమ్

నిషణ్ణాంగస్తు చరణం ప్రసార్య తలసంచరమ్
ఉద్వాహిత మురః కృత్వా శకటాస్యం ప్రయోజయేత్. 167

కుడికాలిని నిషణ్ణముగా, కొంచెము వంచి మడమను కుంచించి అగ్రతలము ముందునకు పడునట్లుగా ఒకటిన్నర తాలము ముందుకు పాదముచుసాచి, చేతినికూడ సాచవలెను. రెండవ చేతిని వక్షమువద్ద ఖటకాముఖముగా నుంచవలెను. నిషణ్ణాంగముచేత పూర్వకాయము ప్రయత్న ధృతమగును. నిషణ్ణాంగమగు పాదమును అగ్రతల సంచరముగా సాచి వక్షమును ఉద్వాహితము, జేయగా శకటాస్యాచారీ వచ్చును 10 అ. 15 శ్లో. వక్షముపైకి వచ్చునట్లుగా శిరస్సును, పాదములను, వెనుకకు సాచవలెను. శకటమునకు సంబంధించిన బాలక్రీడాది విషయమున, భాణికాదివిషయమున, నీ కరణమును ప్రయోగించవలెను.

### 108. గంగావతరణమ్

ఊర్ధ్వాంగులితలః పాద స్త్రిపతాకా వధోముఖౌ
హస్తౌ శిర స్సన్నతంచ గంగావతరణంత్వితి. 168

కాలి(వ్రేళ్ళు, అరికాలు పైకి వచ్చునట్లు కాళ్ళను వెనుకగా పైకి సాచవలెను. అంతేకాని పాదములకు సమపాదాంచితావస్థానమును చేయరాదు. అగ్రతల సంచరమగు వృశ్చికహస్త పాదములకు గూడ నిచట ప్రసక్తిలేదు. పాదములను పైకి ప్రసరించునపుడు త్రిపతాకలను అధో ముఖములుగాజేసి పతాకములుగా భూమిపైనుంచవలెను. అప్పుడు హస్తములతో బాటు శిరస్సు కూడ బాగుగావంగియుండిన గంగావతరణమను కరణము సిద్ధించును. గంగానది భూమికి వచ్చు టను ప్రయోగించుచో నీ కరణ ముపకరించును.

అష్టోత్తరశతం హ్యేత త్కరణానాం మయోదితమ్
అతఃపరం ప్రవక్ష్యామి హ్యంగహార వికల్పనమ్. 169

నూటయెనిమిది కరణములను వివరించిన తర్వాత అంగహారములను గురించి చెప్పబోవు చున్నారు. పాదప్రచారములను తెలుపు చారీలు, స్థానకములు ప్రతి కరణమునకు చెప్పబడినవి. ఈ కరణములలో చెప్పబడిన నృత్తహస్తములను, దృష్టి, శిర, ఉర, జాను, జంఘ, కటీ భేదములు 8, 9, 10 అధ్యాయములలో వివరించబడగలవు. కొన్ని కరణములు కలసిననేగాని నృత్తవిధి సమగ్రము కాజాలదు. అట్టి కలయిక గల కరణముల నంగహారము లందురు. ఇట్టి అంగ హారములలో ప్రధానమైనవి ముప్పది రెండు.

### 1. స్థిరహస్తమ్

ప్రసార్యోత్క్షిప్య చ కరౌ సమపాదం ప్రయోజయేత్
వ్యంసితాఽపసృతం సవ్యం హస్త మూర్ధ్వం ప్రసారయేత్. 170
ప్రత్యాలీఢం తతః కృత్వా తథైవచ నికుట్టకమ్
ఊరూద్వృత్తం తతః కుర్యా దాక్షిప్తం స్వస్తికం తతః. 171
నితంబం కరిహస్తంచ కటిచ్ఛిన్నంచ యోగతః
స్థిరహస్తో భవే దేష త్వంగహారో హరప్రియః. 172

త్రిపతాక దండపక్ష హస్తములను ప్రసారించి, ఎత్తుచు మొదట లీనమను కరణమును ప్రయోగించవలెను. తర్వాత సమపాదమగు సమనఖ కరణమును ప్రయోగించవలెను. ఆపై వ్యంసిత కరణమున విప్రకీర్ణములైన హస్తములను ఊర్ధ్వస్థాన స్థితియందుంచి, ఆలీఢపరివర్తన ముతో ప్రత్యాలీఢస్థానకమును చూపవలెను. తర్వాత క్రమముగా నికుట్టిత, ఊరూద్వృత్త, స్వస్తిక, ఆక్షిప్తము లను నాలుగు కరణములను యోజించవలెను. ఆపై వరుసగా నితంబ, కరిహస్త, కటిచ్ఛిన్నములను మూడు కరణములను చూపవలెను. ఇట్లు పది కరణములను ప్రయోగించగా శివునకు ప్రియమైన స్థిరహస్త మనబడు అంగహారము సిద్ధించగలదు.

అంగహారములలోని కరణములను నాలుగు దిక్కులకు తిరిగి ప్రయోగించవలెనను నాట్య సంప్రదాయము భరతముని సమ్మతము కాదు.

### 2. పర్యస్తకమ్

తలపుష్పాఽపవిద్ధే ద్వే వర్తితం స నికుట్టకమ్
ఊరూద్వృత్తం తథాక్షిప్త మురోమండలమేవచ. 173
నితంబం కరిహస్తంచ కటిచ్ఛిన్నం తథైవచ
ఏష పర్యస్తకో నామ హ్యంగహారో హరోద్భవః. 174

తలపుష్పపుట, అపవిద్ధ, వర్తిత, నికుట్టక, ఊరూద్వృత్త, ఆక్షిప్త, ఉరోమండల, నితంబ, కరిహస్త, కటిచ్ఛిన్నములను పది కరణములను వరుసగా యోజించిన పర్యస్తకమను అంగహారము వచ్చును. ఇది హరునివలన జన్మించినది.

### 3. సూచీవిద్ధమ్

అలపల్లవ సూచీంచ కృత్వా విక్షిప్తమేవచ
ఆవర్తితం తతః కుర్యా త్తథైవచ నికుట్టకమ్. 175
ఊరూద్వృత్తం తథాక్షిప్త మురోమండలమేవచ
కరిహస్తం కటిఛిన్నం సూచీవిద్ధో భవే దయమ్. 176

అలపల్లవోపలక్షితమగు అర్ధసూచీ, విక్షిప్త, ఆవర్త, నికుట్టక, ఊరూద్వృత్త, ఆక్షిప్త, ఉరోమండల, కరిహస్త, కటిచ్ఛిన్నములను తొమ్మిది కరణములను క్రమముగా యోజించగా సూచీవిద్ధ మను అంగహారము రాగలదు.

### 4. అపవిద్ధమ్

అపవిద్ధంతు కరణం సూచీవిద్ధం తథైవచ
ఉద్వేష్టితేన హస్తేన త్రికంతు పరివర్తయేత్. 177
ఉరోమండలకౌ హస్తౌ కటిచ్ఛిన్నం తథైవచ
అపవిద్ధోఽంగహారశ్చ విజ్ఞేయోఽయం ప్రయోక్తృభిః. 178

అపవిద్ధ, సూచీవిద్ధములను రెండుకరణములను ప్రయోగించి, ఉద్వేష్టితకరణమున బద్ధాచారీతో త్రికోణాకారమున నున్న ఊరువునకు వలితమును చూపవలెను. తర్వాత ఉరోమండల, కటిచ్ఛిన్నములను కరణములను యోజించగా అపవిద్ధమను అంగహారమువచ్చును.

ఇచట నాట్యప్రయోక్తలచే నీ అంగహారస్వరూపము తెలసికొనబడవలెనని చెప్పబడినది. నాట్యప్రయోగ కుశలులకు సహితము అంగహార విషయమున సమ్యగ్జ్ఞానము సిద్ధింపకపోవచ్చునని భావము. అంగహారములలో నుపయుక్తములగు కరణముల నాడుటలో మధ్యవర్తన శిరోభ్రూనేత్రాది కర్మలతోగూడిన యోజనను కరణముల స్వరూపతత్త్వముల నెరగినవాడు వెంటనే గ్రహించగలడు. ఇట్లెరుగనివాడు కరణములను ప్రయోగింపజాలడు, నిరూపింపలేడు. నిరూపణలో గీత, వాద్య, లయ, వాక్యార్థ భేదములతో సమన్వయమును జూపుచు వర్ణించవలసియుండుటచే సునిశితబుద్ధి గలిగి నాట్యప్రయోగ కుశలుడైననే అంగహారములను ప్రయోగింపగల్గును. అందుచే నాట్యప్రయోగ కుశలులే ఈ అంగహారముల స్వరూపములను తెలిసికొనవలసి యున్నదని చెప్పబడినది.

### 5. ఆక్షిప్తకమ్

కరణం నూపురం కృత్వా విక్షిప్తాఽలాతకే పునః
పున రాక్షిప్తకం కుర్యా దురోమండలకం తథా 179
నితంబం కరిహస్తంచ కటిచ్ఛిన్నం తథైవచ
ఆక్షిప్తకః స విజ్ఞేయో హ్యాంగహారః ప్రయోక్తృభిః. 180

నూపురము, విక్షిప్తము, అలాతకములను అంగపర్యాయముతోను, ఆక్షిప్తము, ఉరో మండలము, నితంబము, కరిహస్తము, కటిచ్ఛిన్నము అను ఎనిమిది కరణములను క్రమముగా యోజించగా ఆక్షిప్తకమను అంగహారము కాగలదని నాట్యప్రయోగజ్ఞులు గ్రహింపవలెను.

### 6. ఉద్ఘట్టితమ్

ఉద్వేష్టితాఽపవిద్ధస్తు కరః పాదో నికుట్టితః
పున స్తేనైవ యోగేన వామేపార్శ్వే భవే దథ. 181
ఉరోమండలకౌ హస్తౌ నితంబం కరిహస్తకమ్
కర్తవ్యం స కటిచ్ఛిన్నం నృత్తే తూ ద్ఘట్టితే సదా. 182

ఉద్వేష్టితాపవిద్ధమున, అంగపర్యాయ సహితయగా నికుట్టితకరణము నాడవలెను. ఆతర్వాత ఉరోమండల, నితంబ, కరిహస్త, కటిచ్ఛిన్నములను కరణములను ప్రయోగించగా ఉద్ఘట్టితమను అంగహారము సిద్ధించును.

### 7. విష్కంభమ్

పర్యాయో ద్వేష్టితౌ హస్తౌ పాదౌ చైవ నికుట్టితౌ
కుంచితా వంచితౌ చైవ హ్యూరూద్వృత్తం తథైవచ. 183
చతురశ్రం కరం కృత్వా పాదేనచ నికుట్టకమ్
భుజంగత్రాసితం చైవ కరం చోద్వేష్టితం పునః. 184
పరిచ్ఛిన్నంచ కర్తవ్యం త్రికం భ్రమరకేణ తు
కరిహస్తం కటిచ్ఛిన్నం విష్కంభః పరికీర్తితః. 185

పర్యాయోద్వేష్టితహస్త పాదములతో నికుట్టిత కరణమును మొదట ఆడవలెను. తర్వాత నికుంచితము, అర్ధస్వస్తికముతో గూడిన అంచితము, ఊరూద్వృత్తము అను కరణములను ప్రయోగించవలెను. ఆపై అర్ధనికుట్టకము, భుజంగత్రాసితము అను వానిని యోజించవలెను. అప్పుడు ఉద్వేష్టిత హస్తముతో ఛిన్న, భ్రమరక కరణములను అంగపర్యాయముగా నాడవలెను. చివరకు కరిహస్త, కటిచ్ఛిన్నములను యోజించవలెను. ఇట్లు పది కరణములతో గూడిన విష్కంభమను అంగహారము వచ్చును.

### 8. అపరాజితమ్

దండపాదకరం చైవ విక్షిప్యాక్షిప్య చైవహి
వ్యంసితం వామహస్తంచ సహపాదేన సర్పయేత్. 186

నికుట్టకద్వయం కార్య మాక్షిప్తం మండలోరసి
కరిహస్తం కటిచ్ఛిన్నం కర్తవ్య మపరాజితే. 187

విక్షేపాక్షేపములతో కూడిన దండపాదకరణమునాడి, వ్యంసిత, ప్రసర్పితములను ప్రయోగించవలెను. తర్వాత నికుట్టక, అర్ధనికుట్టక, ఆక్షిప్త, ఉరోమండల, కరిహస్త, కటిచ్ఛిన్నములను కరణములను యోజించగా; తొమ్మిది కరణములతో అపరాజితము అను అంగహారము రాగలదు.

### 9. విష్కంభాపసృతమ్

కుట్టితం కరణం కృత్వా భుజంగత్రాసితం తథా
రేచితేనతు హస్తేన పతాకం హస్తమాదిశేత్. 188
ఆక్షిప్తకం ప్రయుంజీత హ్యురోమండలకం తథా
లతాఖ్యం స కటిచ్ఛిన్నం విష్కంభాపసృతే భవేత్. 189

నికుట్టక, అర్ధనికుట్టక కరణములనాడి భుజంగత్రాసిత కరణమును ప్రయోగించవలెను. తర్వాత భుజంగత్రస్తరేచిత కరణమును అంగపర్యాయముగా ప్రయోగించి పతాక హస్తమును పట్టవలెను. ఆపై ఆక్షిప్తక, ఉరోమండల, కటిచ్ఛిన్నములను మూటిని యోజించుచు పర్యాయేణ ఒకచేతిని లతా హస్తముగా చూపవలెను అప్పుడు విష్కంభాపసృతము సిద్ధించును.

### 10. మత్తక్రీడమ్

త్రికం సువలితం కృత్వా నూపురం కరణం తథా
భుజంగత్రాసితం సవ్యం తథా వైశాఖరేచితమ్. 190
ఆక్షిప్తకం తతః కృత్వా పరిచ్ఛిన్నం తథైవచ
బాహ్యభ్రమరకం కుర్యా దురోమండలమేవచ. 191
నితంబం కరిహస్తంచ కటిచ్ఛేదం తథైవచ
మత్తక్రీడో భవే దేష హ్యంగహారో హరప్రియః. 192

భ్రమరకము, నూపురము, దక్షిణాంగముతోను, భుజంగత్రాసిత, వైశాఖరేచిత, ఆక్షిప్త, ఛిన్నములు, వామాంగముతోను, భ్రమరక, వ్యంసిత భ్రమరక, నితంబ, కరిహస్త, కటిచ్ఛిన్నము అను పన్నెండు కరణములను వరుసగా ప్రయోగించిన శివునకు ప్రియమైన మత్తక్రీడ అను అంగహారము రాగలదు.

### 11. స్వస్తికరేచితమ్

రేచితం హస్తపాదంతు కృత్వా వృశ్చికమేవచ
పునస్తేనైవ యోగేన వృశ్చికం సంప్రయోజయేత్. 193
నికుట్టకం తథాచైవ సవ్యాసవ్య కృతం క్రమాత్
లతాఖ్యః స కటిచ్ఛేదో భవేత్స్వస్తికరేచితే. 194

వైశాఖరేచితము, వృశ్చికము అను కరణములను, అంగపర్యాయముగా ప్రయోగించవలెను. తర్వాత లతాహస్తములజూపుచు, అంగపర్యాయమున నికుట్టకమును యోజించి చివరకు కటిచ్ఛిన్నమును ప్రయోగించగా ఆరు కరణములతో స్వస్తికరేచితమను అంగహారము రాగలదు.

### 12. పార్శ్వస్వస్తికమ్

పార్శ్వ స్వస్తిక పాదాచ కార్యం త్వర్ధనికుట్టకమ్
ద్వితీయస్యచ పార్శ్వస్య విధిః స్యాద్వయమేవహి. 195
తతశ్చ కరమావర్త్య ఊరుపృష్ఠే నిపాతయేత్
ఊరూద్వృత్తం తతః కుర్యాదాక్షిప్తం పునరేవహి. 196
నితంబం కరిహస్తంచ కటిచ్ఛిన్నం తథైవచ
పార్శ్వస్వస్తిక ఇత్యేష హ్యంగహారః ప్రకీర్తితః. 197

దిక్స్వస్తికము, పతాకముతో అర్ధనికుట్టకము, మరల దిక్స్వస్తికము, ద్వితీయపార్శ్వముతో అర్ధనికుట్టకము అను నాల్గు కరణములను వరుసగా ప్రయోగించవలెను. తర్వాత అపవిద్ధ, ఊరూద్వృత్తములు, అంగపర్యాయముతో ఆక్షిప్త, నితంబ, కరిహస్త, కటిచ్ఛిన్నములను నారు కరణములను క్రమముగా యోజించగా పార్శ్వ స్వస్తికమను అంగహారము వచ్చును.

### 13. వృశ్చికాపసృతమ్

వృశ్చికం కరణం కృత్వా లతాఖ్యం హస్తమేవచ
తమేవచ కరం భూయో నాసాగ్రే సన్నికుంచయేత్. 198
తమేవోద్వేష్టితం కృత్వా నితంబం పరివర్తయేత్
కరిహస్తం కటిచ్ఛిన్నం వృశ్చికాఽపసృతే భవేత్. 199

లతావృశ్చిక, నికుంచిత, మత్తల్లి, నితంబ, కరిహస్త, కటిచ్ఛిన్నములను కరణములను యోజించగా వృశ్చికాపసృతము రాగలదు. ఇచట నితంబమును పరివర్తింప జేయవలెను.

### 14. భ్రమరమ్

కృత్వా నూపురపాదంతు తథాక్షిప్తక మేవచ
పరిచ్ఛిన్నంచ కర్తవ్యం సూచీవిద్ధం తథైవచ. 200
నితంబం కరిహస్తం చాప్యురోమండలకం తథా
కటిచ్ఛిన్నం తతశ్చైవ భ్రమరః స తు సంజ్ఞితః. 201

నూపుర, ఆక్షిప్త, ఛిన్న, సూచీవిద్ధ, నితంబ, కరిహస్త, ఉరోమండల, కటిచ్ఛిన్నములను ఎనిమిది కరణములను వరుసగా ప్రయోగించినచో భ్రమరమను అంగహారమువచ్చును.

### 15. మత్తస్ఖలితకమ్

మత్తల్లికరణం కృత్వా కర మావర్త్య దక్షిణమ్
కపోలస్య ప్రదేశేతు కర్తవ్యంచ నికుంచితమ్. 202
అపవిద్ధం ద్రుతం చైవ తలసంస్ఫోట సంయుతమ్
కరిహస్తం కటిచ్ఛిన్నం మత్తస్ఖలితకే భవేత్. 203

మత్తల్లికరణమునాడి, కుడిచేతిని ఆవర్తింపజేసి, గండసూచీ, లీనము అను కరణములను ప్రయోగించవలెను. తర్వాత అపవిద్ధకరణము వేగముగా నాడుచు తలసంస్ఫోట కరణము నభినయించి, ఆపై కరిహస్త, కటిచ్ఛిన్నముల నాడినచో మత్తస్ఖలితకమను అంగహారము రాగలదు.

16. మదవిలసితమ్

దోలైః కరైః ప్రచలితైః స్వస్తికాఽపసృతైః పదైః
అంచితైర్వలితైర్హస్తైస్తలసంఘట్టితైస్తథా. 204
నికుట్టితంచ కర్తవ్య మూరూద్వృత్తం తథైవచ
కరిహస్తం కటిచ్ఛిన్నం మదాద్విలసితే భవేత్. 205

మదస్ఖలితకము, మత్తల్లి, తలసంస్ఫోటితము అను మూడు కరణములను క్రమముగా బహువిధచిత్రగుంఫములుగా ప్రయోగించవలెను. ఆపై నికుట్టక, ఊరూద్వృత్త, కరిహస్త, కటిచ్ఛిన్నములను నాల్గు కరణములను యోజించగా మద విలసితమను అంగహారము సిద్ధించును.

మదస్ఖలితక, మత్తల్లి, తలసంస్ఫోటిత కరణములను ఒక్కొక్కదానిని మూడుసారులు చేయవలెనని కొందరభిప్రాయబడినారు. ఏడు కరణములను మూడు పర్యాయములు జేయవలెనని మరికొందరు యెంచినారు. కాని మొదటి మూడు కరణములను బహువిధ చిత్ర గుంఫములుగా జేయవలెనని సంప్రదాయము.

17. గతిమండలమ్

మండలస్థానకం కృత్వా తథా హస్తౌచ రేచితౌ
ఉద్ఘట్టితేన పాదేన మత్తల్లికరణం భవేత్. 206
ఆక్షిప్తం కరణంచైవ హ్యురోమండల మేవచ
కటిచ్ఛిన్నం తథాచైవ భవేత్తు గతిమండలే. 207

మండలస్వస్తికము, నివేశము అను కరణములనాడి, ఉన్మత్త, రేచిత, ఉద్ఘట్టితముతో మత్తల్లి, ఆక్షిప్త, ఉరోమండల, కటిచ్ఛిన్నములను నారు కరణములను వరుసగా యోజించవలెను. ఇట్లు ఎనిమిదికరణములతో గతిమండలమను అంగహారము రాగలదు.

18. పరిచ్ఛిన్నమ్

సమపాదం ప్రయుజ్యాథ పరిచ్ఛిన్నం త్వనంతరమ్
ఆవిద్ధేనతు పాదేన బాహ్యభ్రమరకం తథా. 208
వామసూచ్యా త్వతిక్రాంతం భుజంగత్రాసితం తథా
కరిహస్తం కటిచ్ఛిన్నం పరిచ్ఛిన్నే విధీయతే. 209

సమనఖము, ఛిన్నము అను రెండు కరణములనాడి ఆవిద్ధచారితో సంభ్రాంత కరణమును ప్రయోగించవలెను. తర్వాత భ్రమరకము, ఎడమపాదముతో అర్ధసూచీ, అతిక్రాంత, భుజంగత్రాసిత, కరిహస్త, కటిచ్ఛిన్నము అను కరణములను క్రమముగా నాడవలెను. ఇట్లు తొమ్మిది కరణములతో పరిచ్ఛిన్నమను అంగహారము సిద్ధించును.

19. పరివృత్తకరేచితమ్

శిరసోత్క్షేపణం సౌష్ఠ్వో స్వస్తికౌ విచ్యుతౌ కరౌ
తతః సవ్యం కరం చాపి గాత్ర మానమ్య రేచయేత్. 210

పున రుత్తానయో స్తత్ర గాత్ర మున్నమ్య రేచితమ్
లతాఖ్యౌచ కరౌ కృత్వా వృశ్చికం సంప్రయోజయేత్. 211
రేచితం కరిహస్తంచ భుజంగత్రాసితం తథా
ఆక్షిప్తకం ప్రయుంజీత స్వస్తికం పాదమేవచ. 212
పరాఙ్ముఖవిధి ర్భూయ ఏవమేవ భవే దిహ
కరిహస్తం కటిచ్ఛిన్నం పరివృత్తకరేచితే. 213

నితంబము, స్వస్తికరేచితము అను కరణములనాడి, విక్షిప్తాక్షిప్తక కరణముతో శరీరమును వంచి తర్వాత లతావృశ్చిక కరణముతో శరీరమును పైకెత్తి, ఉన్మత్తకరణమును ప్రయోగించవలెను. కరిహస్తమును రేచితముగావించి, భుజంగత్రాసిత, ఆక్షిప్తకముల, యోజించవలెను. తర్వాత పాదస్వస్తికనుపట్టి బద్ధాచారీతో నితంబకరణమును ప్రయోగించవలెను. ఇంతవరకు చెప్పబడిన కరణములను నలుదిక్కులయందు ప్రయోగించి, కరిహస్త, కటిచ్ఛిన్న కరణములను చివరకు ప్రేక్షకులకు అభిముఖముగా ప్రయోగించిన పరివృత్తక రేచితము అంగహారము సిద్ధమగును.

## 20. వైశాఖ రేచితమ్

రేచితౌ సహగాత్రేణ హ్యపవిద్ధకరౌ యదా
పున స్తేనైవ దేశేన గాత్రమున్నమ్య రేచయేత్. 214
కుర్యా న్నూపురపాదంచ భుజంగత్రాసితం తథా
రేచితం మండలంచైవ బాహుశీర్షే నికుంచయేత్. 215
ఊరూద్వృత్తం తథాక్షిప్త మురోమండలమేవచ
కరిహస్తం కటిచ్ఛిన్నం కుర్యా ద్వైశాఖరేచితే. 216

వైశాఖరేచిత కరణమును మొదట అంగద్వయముతో ప్రయోగించి శరీరమునెత్తి రేచితము చేయవలెను. తర్వాత నూపుర, భుజంగత్రాసిత, ఉన్మత్త, మండలస్వస్తిక, నికుట్టక, ఊరూద్వృత్త, ఆక్షిప్త, ఉరోమండల, కరిహస్త, కటిచ్ఛిన్నములను కరణములను వరుసగా ప్రయోగించిన వైశాఖరేచితమను అంగహారము రాగలదు.

## 21. పరావృత్తమ్

ఆద్యంతు జనితం కృత్వా పాద మేకం ప్రసారయేత్
తథై వాలాతకం కుర్యాత్ త్రికంతుపరివర్తయేత్. 217
అంచితం వామహస్తంచ గండదేశే నికుట్టయేత్
కటిచ్ఛిన్నం తథాచైవ పరావృత్తే ప్రయోజయేత్. 218

దక్షిణాంగముతో జనిత కరణమును ప్రయోగించి, శకటాస్యకరణముతో పాదమును ప్రసారించవలెను. పిమ్మట అలాతకము, భ్రమరకము అను కరణములను యోజించవలెను. కరిహస్తమను కరణము వాడుచు, అంచిత వామహస్తమును గండస్థలమువద్ద నికుట్టితము చేయవలెను. చివరకు కటిచ్ఛిన్నమును ప్రయోగించగా పరావృత్తమను అంగహారము వచ్చును.

### 22. అలాతకమ్

స్వస్తికం కరణం కృత్వా వ్యంసితౌచ కరౌ పునః
అలాతకం ప్రయుంజీత ఊర్ధ్వజాను నికుంచితమ్. 219
అర్ధసూచ్యథ విక్షిప్త ముద్వృత్తాక్షిప్తకే తథా
కరిహస్తం కటిచ్ఛిన్న మంగహారే హ్యలాతకే. 220

మండలస్వస్తిక, వ్యంసిత, మండలస్వస్తిక, వ్యంసితము అను నాల్గు కరణములను ముందుగాప్రయోగించి, తర్వాత అలాతక, ఊర్ధ్వజాను, నికుంచిత, అర్ధసూచీ, విక్షిప్త, ఉద్వృత్త ఆక్షిప్త, కరిహస్త, కటిచ్ఛిన్నములను కరణములను వరుసగా ప్రయోగించిన అలాతకమను అంగహారము సిద్ధించును.

### 23. పార్శ్వచ్ఛేదమ్

నికుట్య వక్షసి కరా వూర్ధ్వజాను ప్రయోజయేత్
ఆక్షిప్తస్వస్తికం కృత్వా త్రికంతు పరివర్తయేత్. 221
ఉరోమండలకౌ హస్తౌ నితంబం కరిహస్తకమ్
కటిచ్ఛిన్నం తథాచైవ పార్శ్వచ్ఛేదే విధీయతే. 222

వృశ్చితకుట్టిత, ఊర్ధ్వజాను, ఆక్షిప్తక, స్వస్తికములను కరణములను ప్రయోగించి త్రికపరివర్తన గావింపవలెను. పిమ్మట ఉరోమండల, నితంబ, కరిహస్త, కటిచ్ఛిన్నములను కరణములను వరుసగా ప్రయోగించగా పార్శ్వచ్ఛేదమను అంగహారము వచ్చును.

### 24. విద్యుద్భ్రాంతమ్

సూచీ వామపదం దద్యా ద్విద్యుద్భ్రాంతంచ దక్షిణమ్
దక్షిణేన పునః సూచీ విద్యుద్భ్రాంతంచ వామకమ్. 223
పరిచ్ఛిన్నం తథాచైవ త్రికంతు పరివర్తయేత్
లతాఖ్యం స కటిచ్ఛిన్నం విద్యుద్భ్రాంతశ్చ సస్మృతః. 224

వామాంగముతో అర్ధసూచీ, దక్షిణాంగముతో విద్యుద్భ్రాంతము, దక్షిణాంగముతో అర్ధసూచీ, వామాంగముతో విద్యుద్భ్రాంతము అను కరణములను క్రమముగా ప్రయోగించవలెను. పిమ్మట ఛ్ఛిన్నకరణమునాడి, భ్రమరకమును లతావృశ్చికమును ప్రయోగించి, కటిచ్ఛిన్నమును, లతావృశ్చికమును ప్రయోగించి, కటిచ్ఛిన్నమును యోజించగా విద్యుద్భ్రాంతమగును.

### 25. ఉద్వృత్తకమ్

కృత్వా నూపురపాదంతు సవ్య వామౌ ప్రలంబితౌ
కరౌ పార్శ్వే తత స్తాభ్యాం విక్షిప్తం సంప్రయోజయేత్. 225
తాభ్యాం సూచీ తథాచైవ త్రికంతు పరివర్తయేత్
లతాఖ్యం సకటిచ్ఛిన్నం కుర్యా దుద్వృత్తకే సదా. 226

నూపుర, భుజంగాంచితక, గృధ్రావలీనకములను కరణములను రెండు చేతులతోను ప్రయోగించవలెను. తర్వాత విక్షిప్తమును యోజించి. సూచీ కరణమును చూపవలెను.

బద్ధాచారీతో త్రికపరివర్తనమున నితంబకరణమునాడి, లతావృశ్చికమును, కటిచ్ఛిన్నమును ప్రయోగించగా ఉద్వృత్తకమను అంగహారమురాగలదు.

### 26. ఆలీఢమ్

ఆలీఢవ్యంసితౌ హస్తౌ బాహుశీర్షే నికుట్టయేత్
నూపుర శ్చరణో వామ స్తథాలాతశ్చ దక్షిణః. 227
తేనై వాక్షిప్తకం కుర్యా దురోమండలకౌ కరౌ
కరిహస్తం కటిచ్ఛిన్న మాలీఢే సంప్రయోజయేత్. 228

ఆలీఢస్థానకమున వ్యంసిత కరణమునాడి, నికుట్టకకరణమును యోజించవలెను. పిమ్మట వామాంగముతో నూపురమును, దక్షిణాంగముతో అలాతకమును చూపవలెను. దక్షిణాంగముతో ఆక్షిప్తకమును జూపి, ఉరోమండలము, కరిహస్తము, కటిచ్ఛిన్నములను కరణములను యోజించగా ఆలీఢమను అంగహారము సిద్ధించును.

### 27. రేచితమ్

హస్తంతు రేచితం కృత్వా పార్శ్వమానమ్య రేచయేత్
పునస్తేనైవ యోగేన గాత్ర మానమ్య రేచయేత్. 229
రేచితం కరణం కార్య మురోమండలమేవచ
కటిచ్ఛిన్నంతు కర్తవ్య మంగహారేచ రేచితే. 230

హస్తరేచకమును దెలుపు కరణము లన్నియు ప్రథమశ్లోకమున సూచింప బడుచున్నవి. ఈ కరణములను స్వబుద్ధితో యోజించుచు శ్లిష్టముగా చేయవలెను. వీటికి అంగాంగిభావమును కూర్పవలెనని భావము. కావుననే విచిత్రభేద సంకీర్ణమైన దీ అంగహారము.

స్వస్తికరేచిత, అర్ధరేచితక, వక్షఃస్వస్తిక, ఉన్మత్తక, ఆక్షిప్తరేచిత, అర్ధమత్తల్లి, రేచిత నికుట్టిత, భుజంగత్రస్తరేచిత, నూపుర, వైశాఖరేచిత, భుజంగాంచితక, దండకరేచిత, వృశ్చిక రేచిత, వ్యంసిత, విస్రృత్త, వినివృత్త, వివర్తితక, గరుడప్లుతక, మయూరలలిత, సర్పితక, స్ఖలిత, ప్రసర్పితక, తలసంఘట్టిత, వృషభక్రీడితక, లోలితములను నీ ఇరువదియైదు కరణములయందును రేచితహస్తప్రయోగము కలదు. వీటిని వైచిత్ర్యముతో నాలుగు దిఙ్ముఖముల యందు ప్రయోగించవలెను ఈ కరణములను ప్రయోగించి పార్శ్వమును వంచి రేచితము చేయవలెను. శరీరమును గూడ వంచి రేచితము చేయవలెనని చెప్పుటచే చక్రమండల కరణ వ్యవహితముగా నీ కరణపరంపరను ప్రయోగించవలెనని భావము. చివరకు ఉరోమండలము, కటిచ్ఛిన్నము అను కరణములను ప్రయోగించగా రేచితాంగహారము రాగలదు.

### 28. ఆచ్ఛురితమ్

నూపురం చరణం కృత్వా త్రికంతు పరివర్తయేత్
వ్యంసితేనతు హస్తేన త్రికమేవ వివర్తయేత్. 231
వామం చాలాతకం కృత్వా సూచీ మత్రైవ యోజయేత్
కరిహస్తం కటిచ్ఛిన్నం కుర్యా దాచ్ఛురితే సదా. 232

నూపుర, భ్రమరకమను కరణములనాడి వ్యంసిత, నితంబ, అలాతక, సూచీ, కరిహస్త, కటిచ్ఛిన్నములను వరుసగా యోజనచేయగా ఆచ్ఛురితమను అంగహారము సిద్ధించును.

## 29. ఆక్షిప్త రేచితమ్

రేచితస్వస్తికౌ పాదౌ రేచితస్వస్తికౌ కరౌ
కృత్వా విశ్లేషమేవంతు తేనైవ విధినా పునః. 233
పున రుత్క్షేపణం చైవ రేచితైరేవ కారయేత్
ఉద్వృత్తాక్షిప్తకే చైవ హ్యురోమండలమేవచ. 234
నితంబం కరిహస్తంచ కటిచ్ఛిన్నం తథైవచ
ఆక్షిప్తరేచితో హ్యేష కరణానాం విధిః స్మృతః. 235

ఏయేకరణమున చేతులుగాని, పాదములుగాని రేచితస్వస్తికములు గావలెనని చెప్పబడి నదో ఆకరణములన్నియు నిట ప్రయోగింపబడవలసియున్నవి. స్వస్తికరేచిత, పృష్ఠస్వస్తిక, దిక్స్వస్తిక, కటీసమ, ఘూర్ణిత, భ్రమరక, వృశ్చికరేచిత, పార్శ్వనికుట్టక, ఉరోమండలక, సన్నత, సింహాకర్షిత, నాగాపసర్పితము అను కరణముల నిట ప్రయోగింపవలెనని భావము. వక్షః స్వస్తి కాదులయందు హస్తరేచనలేదు గనుక వాటి నిటగ్రహింపరాదు.

ఈకరణముల ననుసరించి హస్తపాదస్వస్తికములను, రేచితములను వైచిత్ర్యముతోనాడి, స్థిరమగు హస్తపాదములకు ఉత్క్షేపణమును జూపవలెను. ఈప్రక్రియ నెచ్చట ఏరీతిగాచేయవలెనో ఆవిషయము నాకరణమే సూచించును. ఇది యెట్లనగా:- ఊర్ధ్వజానువునుచూపి దానిపై లతా హస్తము నుంచవలెనని దండపక్షమున గలదు. 4అ. 94శ్లో. ఇట్లే లలాటతిలకమున 4అ. 110శ్లో. తలవిలాసితమున 4 అ 116 శ్లో. నిశుంభితమున 4 అ. 124 శ్లో. విద్యుద్భ్రాంతమున 4అ. 125శ్లో గజక్రీడితమున 4అ. 128శ్లో. నితంబమున 4అ. 145శ్లో. విష్ణుక్రాంతమున 4అ. 160శ్లో. గాననగును.

ఈ ప్రక్రియను ప్రయోగించిన తర్వాత ఊరూద్వృత్త, ఆక్షిప్త, ఉరోమండల, నితంబ, కరిహస్త, కట్ఛిన్నములను కరణములను యోజించిన ఆక్షిప్త రేచితమను అంగహార మగును.

## 30. సంభ్రాంతమ్

విక్షిప్తకరణం కృత్వా హస్తపాదం ముఖానుకమ్
వామసూచీ సహాకృతం విక్షిపే ద్వామకం కరమ్. 236
వక్షఃస్థానే భవేత్సవ్యో వలితం త్రికమేవచ
నూపు రాక్షిప్తకేచైవ హ్యర్ధస్వస్తికమేవచ. 237
నితంబం కరిహస్తంస్యా దురోమండలకం తథా
కటచ్ఛిన్నం చ కర్తవ్యం సంభ్రాంతే నృత్తయోక్తృభిః. 239

విక్షిప్తము, అంచితము, గండసూచీ, గంగావతరణము అనుకరణములను ప్రయోగించి తర్వాత వామాంగముతో అర్ధసూచీ, దండపాదములను యోజించవలెను. పిమ్మట చతుర, భ్రమరక, నూపుర, ఆక్షిప్త, అర్ధస్వస్తికము అను కరణములను వరుసగా ప్రయోగించవలెను.

[illegible] కరిహస్త, ఉరోమండల, కటిచ్ఛిన్నము అను కరణములను ప్రయోగించినచో సంభ్రాంతమను అంగహారము సిద్ధించును.

31. అపసర్పితమ్

అపక్రాంతిక్రమం కృత్వా వ్యంసితం హస్తమేవ చ
కుర్యాదుద్వేష్టితం చైవ త్వర్ధసూచీం తథైవ చ. 239
విక్షిప్తం చ కటిచ్ఛిన్న ముద్వృత్తాక్షిప్తకే తథా
కరిహస్తం కటిచ్ఛిన్నం త్విత్యపసర్పితే. 240

అపక్రాంత కరణమునాడి, వ్యంసిత కరణముతో హస్తమును ఉద్వేష్టితము చేసి, అర్ధసూచి, విక్షిప్త, కటిచ్ఛిన్న, ఉద్వృత్త, ఆక్షిప్త, కరిహస్త, కటిచ్ఛిన్నము అను కరణములను క్రమముగ ప్రయోగించినచో అపసర్పిత మను అంగహారమగును.

32. అర్ధనికుట్టకమ్

కృత్వా నూపురపాదం చ ప్రకృతం హస్త్వా క్రమమ్
పాదస్య చానుగౌ హస్తౌ త్రికం తు పరివర్తయేత్. 241
నికుట్య కరపాదం చ వ్యురోమండలకం పునః
కరిహస్తం కటిచ్ఛిన్నం కార్య మర్ధనికుట్టకే. 242

నూపురము, వివృత్తము అను కరణములనాడి, త్రికమును చూపి, కరపాద నికుట్టనమును చూపవలెను. అనగా నికుట్టితార్ధనికుట్టకాది కరణముల నిట్లు యోజించవలెనని భావము. తర్వాత ఉరోమండలకము, కరిహస్తము, కటిచ్ఛిన్నము అను కరణములను ప్రయోగించగా అర్ధనికుట్టక మను అంగహారము వచ్చును.

కరణములను తాలకలాదులతో కూడిన కాలపరిమాణమున పూర్తిచేయవలెను. కలా నివర్తన కాలమునకు వర్తనక్రమముతో ప్రతికరణమును అంగహారములయందు పూర్తిగా చేయ వీలున్నది. ఆరు, పన్నెండు, ఇరువదినాలుగు కరణాత్మకములై ఒకనిచేగాని ఇద్దరిచేగాని అభ్య సితములైన అంగహారములను త్ర్యశ్రమానమున ప్రయోగించవలెనని తెలియనగును. తాలకలా ద్యభి సంధానముచే శక్యములై ప్రవేశపెట్టవగిన అంగహారములు పదునారుగలవు. ఎనిమిది లేక పదునారు లేక ఇంక కొంచెమధికముగా కరణములను కలిగియున్న పదునారంగహారములు చతురశ్రతాల విషయకములు.

అపవిద్ధ, ఉద్ఘట్టిత, విష్కంభ, అపసృత, స్వస్తికరేచిత, వృశ్చికాపసృత, మత్తస్ఖలిత, గతిమండల, పరివృత్తకరేచిత, పరావృత్తిక, అలాతక, ఉద్వృత్తక, రేచిత, ఆక్షిప్తరేచిత, సంభ్రాంత, అర్ధనికుట్టకములను పదునారంగహారములు త్ర్యశ్రతాలకములు. మిగిలిన పదునారు చతురశ్రతాలకములు.

ద్వాత్రింశ దేతే సంప్రోక్తా హ్యంగహారా ద్విజోత్తమాః
చతురో రేచకాంశ్చాపి గదతో మే నిబోధత. 243

ఇట్లు ముప్పదిరెండు అంగహారములు వివరింపబడినవి. ఇక రేచకములు చెప్పబడుచున్నవి.

పాదరేచక ఏకః స్యా ద్ద్వితీయః కటిరేచకః
కరరేచక స్తృతీయస్తు చతుర్థః కంఠరేచకః. 244

పాదరేచక, కటిరేచక, కరరేచక, కంఠరేచకములని రేచకములు నాలువిధములు. పాదమునకు నమనోన్నమనములజూపుచు, బొటనవ్రేలిపై నడచినచో పాదరేచకము రాగలదు. హస్తములను వేగముతో కంపింపజేసిన హస్తరేచకమగును. సర్వతోభ్రమణముద్వారా గ్రీవా రేచకము వచ్చును. ఈరేచకములను వైశాఖస్థానముతో ప్రయోగింపవలెను. సుకుమారగీత వాద్యప్రధానమగు ప్రయోగమున నీరేచకములను యోజించవలెను. కరణములతో రేచకములు యోజింపబడగా అంగహారములు సమగ్రములు కాగలవని భావము.

రేచితాఖ్యః పృథగ్భావే వలనే చాభిధీయతే
ఉద్వాహనా త్పృథగ్భావా చ్చలనాచ్చాపి రేచకః. 245

ప్రయోగవిషయమున వేరువేరుగాగాని, పరివర్తనముతోగాని, ఉద్వాహనముతోగాని, కంపముతోగాని జేసిన రేచకము సిద్ధించగలదు.

పార్శ్వా త్పార్శ్వేతు గమనం స్ఖలితై శ్చలితైః పదైః
వివిధై శ్చైవ పాదస్య పాదరేచక ఉచ్యతే. 246

స్ఖలితములై కంపించు అడుగులతో ఒకప్రక్కనుంచి మరొక ప్రక్కకు పోవుచు, పాదము యొక్క అంతర్బహిఃప్రదేశములను సన్నతముగా జూపుచు, పాదమును వంచి ఎత్తుచు, అంగుష్ఠాగ్రముతో గమనమును చూపిన పాదరేచకమగును.

త్రికస్యో ద్వర్తనం చైవ కటీవలన మేవచ
తథాఽపసర్పణం చైవ కటిరేచక ఉచ్యతే. 247

త్రికోణాకారమున పాదము నూరువుతో పట్టి, ఉద్వర్తనముచేసి, నడుమును త్రిప్పి, అపసర్పణము గావించిన కటిరేచకము రాగలదు.

ఉద్వర్తనః పరిక్షేపో విక్షేపః పరివర్తనమ్
విసర్పణంచ హస్తస్య హస్తరేచక ఉచ్యతే. 248

చేతులను పైకి త్రిప్పుచు, సర్వతో భ్రమణముగావించి, విక్షిప్తములుగాచేసి, పరివర్తింపజేయుచు, విసర్పణము జూపవలయును. ఇట్లు హస్తములకు పర్యాయముగా ద్రుతభ్రమత్వమును చూపగా హస్తరేచకము వచ్చును.

ఉద్వాహనం సన్నమనం తథా పార్శ్వంచ సన్నతిః
భ్రమణం చాపి విజ్ఞేయో గ్రీవాయా రేచకో బుధైః. 249

మెడను పైకిఎత్తి, క్రిందకు బాగుగావంచి, తర్వాత ప్రక్కలకు వంచి, భ్రమణమును చూపింపగా గ్రీవారేచకమగును.

రేచకై రంగహారైశ్చ నృత్యంతం వీక్ష్య శంకరమ్
సుకుమార ప్రయోగేణ నృత్యతిస్మ చ పార్వతీ. 250

మృదంగ భేరీ పటహై ర్ఝంఝా డిండిమ గోముఖైః
పణవై ర్దర్దురై శ్చైవ సర్వాతోద్యైః ప్రవాదితైః. 251
దక్షయజ్ఞే వినిహతే సంధ్యాకాలే మహేశ్వరః
నానాంగహారైః ప్రానృత్య ల్లయ తాల వశానుగమ్. 252
పిండిబంధాం స్తతో దృష్ట్వా నంది భద్రముఖా గణాః
చక్రు స్తే నామ పిండీనాం బంధ మాసాం సలక్షణమ్. 253

కరణాంగహార రేచకములు నృత్తమునకు వైచిత్ర్యము నాపాదించును, దేవతాధ్వజ ప్రతికృతి భూతములగు పిండీబంధములను నిష్పన్నము చేయునవి. పిండీబంధమనగా ఆకృతివిశేషము, మూర్తివిశేషము. ఈపిండీబంధముల ఉత్పత్తిని తెలుపుటకై భరతుడు ఈనాల్గు శ్లోకములలో ఇతివృత్తమును చెప్పుచున్నాడు.

దక్షయజ్ఞము ధ్వంసమైనతర్వాత ప్రహర్షపరవశులైన ప్రమథగణములు మృదంగ, భేరీ, పటహ, ఝంఝా, డిండిమ, గోముఖ, పణవ, దర్దురాది వాద్యముల నాలాపించుచుండిరి. అప్పుడు ఆనందపరవశుడై రేచకాంగహారములతో శివుడు సంధ్యాకాలమున నృత్యము చేయుచుండెను. సుకుమార నాట్యప్రయోగమున పార్వతియుండెను. లయతాలముల ననుసరించి వివిధాంగహార ములతో శివుడు నృత్యము చేయుచుండగా వివిధ రూప విన్యాసములతో ఆకృతిభేదములు, లేక మూర్తిభేదములు, ఉద్భవించినవి. నంది, భద్రముఖుడు, వీరభద్రుడు మొదలగువారీ పిండీబంధము లనుజూచి, వాటికి నామకరణములగావించి వాటి లక్షణముల నిర్వచించిరి.

రేచకాంగహారములతోకూడిన నృత్యము సుకుమార ప్రయోగముతో సంవలితమైననే పిండీబంధము నిష్పన్నమగును. దీనికి లయతాల వాద్యము లవసరములు. విశిష్టవర్ధమాన గీతకము లతోగూడియుండి, నియత వైణస్వర విశేషాత్మకమైన ధాతువాద్య విశేషభూత కుతప-ప్రయోగ ప్రకృతికావనద్ధ వాద్య గీతి నియత ప్రతిష్ఠిత లయాత్మకమైన నృత్యమున పిండీబంధములురాగలవు.

లయ తాలాదులు నృత్తమున కంగములు. వర్ధమానాది గీత ప్రయోగమునకు, ఉపకరణ సహితమైన నృత్త ప్రయోగమునకు, లయ తాలాదులు అదృష్టఫలమును సంపాదించునవి. ఏది యెక్కడ ప్రధానమో ఆ ప్రయోగమున మిగిలిన సన్నివేశములు దాని అంగములుగా స్వీకరింప బడవలెను. కాగా నృత్తమున కదృష్టఫల సంపాదనను ప్రధానముగా పెట్టుకొనినచోట గీత కాదులు నృత్తము నాశ్రయించుకొని యుండును. కావుననే ఐదవ అధ్యాయమున తాండవము ప్రధానముగా నున్నచోట గీతకాదు లంగములని చెప్పబడినవి 5 అ. 13 శ్లో. అందుచే నాట్య మున కంగముగా గీతకమును గ్రహించవలెను. ఈ అంగాంగిభావమును యోగ్యత్వము ననుస రించి కూర్పవలెను. ప్రధానవిషయముతో అంగములు సంమీలన యోగ్యములై ప్రయోగింప బడవలయునని భావము.

ప్రస్తుత విషయమున దక్షయజ్ఞము నాశనమైన తర్వాత ప్రమథగణములచే మృదంగాది వాద్యములు ప్రవృత్తములైనవని జెప్పబడినది. ఈ వాద్యముల ననుసరించి వచ్చునది నృత్తము. హృదయభూతా నందోల్లాసాత్మకములగు సంధ్యాకాలములయందు భగవానుడగు శంకరుడు

నృత్తప్రాధాన్య విన్యాసమును విద్దుచుండగా ఈ వాద్యాది ప్రవృత్తి నృత్తము నుద్దేశించి బయలు దేరినది. ఇట్లు ప్రస్థానాదులయందు వర్ణాంగ ప్రాధాన్యము, శిల్పకాదులయందు రూపకాభిధేయ ప్రాధాన్యమగు గీతకము, భగ్నతాల పరిక్రమణాదికముగల భాణికాదులయందు ప్రాధాన్యముగా వాద్యము కన్పించగలదు. ఏంబికాది ప్రయోగానంతరము హుడుక్కా-వాద్యావసరము నృత్త ప్రాధాన్యమును తెలుపును. దీనిని దేశభాషలో చిల్లిమార్గమందురు. చారీమార్గమున అంగ ప్రాధాన్యమున్నను మధ్య మధ్య గీతవాద్యాదులకుగూడ ప్రాధాన్యముకలదు.

ఈశ్వరస్యేశ్వరీ పిండీ నందినశ్చాపి పట్టసీ
చండికాయా భవేత్పిండీ తథావై సింహవాహినీ. 254
తార్క్ష్యపిండీ భవేద్విష్ణోః పద్మపిండీ స్వయంభువః
శక్రస్యైరావతీ పిండీ ఝషా స్యాన్మన్మథస్యతు. 255
శిఖిపిండీ కుమారస్య రూపపిండీ భవేచ్ఛ్రియః
ధారాపిండీచ జాహ్నవ్యాః పాశపిండీ యమస్యచ. 256
వారుణీచ నదీపిండీ యక్షీ స్యాద్ధనదస్యతు
హలపిండీ బలస్యాపి సర్పపిండీతు భోగినామ్. 257
గణేశ్వరీ మహాపిండీ దక్షయజ్ఞవిమర్దినీ
త్రిశూలాకృతి సంస్థానా రౌద్రీ స్యాదంధకద్విషః. 258

ఆధారాంగప్రయోగ సాధక తమభేదముచే పిండీబంధములు వివిధ విధములుగానున్నవి. భూమి, నాలుగుదిక్కులు, ఆకాశద్వయము అను నేడింటిననుసరించి ఏడు ఆధారభేదములు రాగలవు. రెండుచేతులు, రెండుపాదములు, రెండుకన్నులు, శిరస్సు అను నేడింటిద్వారా అంగ భేదము లేడు రాగలవు. ఆధారభేదములను అంగభేదములచే గుణించగా నలుబదితొమ్మిదివచ్చు చున్నవి నాట్యప్రయోక్త ఒకడుగాని, అనేకమందిగాని ఉండవచ్చును; ప్రయోగము సమప్రయో గముగాని, విషమప్రయోగముగాని కావచ్చును. కాగా నాలుగుభేదము లిటరాగలవు. ఈనాల్గు విధముల పిండీబంధములను కరణములతోగాని, అంగహారములతోగాని సంపాదించవచ్చునుగనుక ఎనిమిదిరకముల బంధములు వచ్చుచున్నవి. ఈఎనిమిదింటిని నలుబదితొమ్మిదిచే గుణించగా మూడువందల తొంబది రెండు పిండీబంధములు రాగలవు.

పిండీబంధములను కేవలము కరణములతోనే ప్రయోగించుచు ఆ యా దేవతను, ఆ యా ప్రకృతిని సూచించిననే హర్షప్రదములు కాగలవు. కావున ప్రధాన దేవతోద్దేశముగా పిండీబంధ ముల నీ ఐదు శ్లోకములలో భరతుడు చెప్పుచున్నాడు.

పిండీబంధములు పారమేశ్వర విషయకములు. వీటిచే ప్రధానముగా శివుడే పరితోషము చెందగలడు గనుక ఈశ్వరుని పిండీబంధమును మొదట పేర్కొనినాడు. అవ్యక్తము, ఈశ్వరశబ్ద వాచ్యము, నిర్విశేషము నగు శివుని రూపమున కనుగుణమై శివలింగాకృతియైన పిండీబంధమును ఈశ్వరీయందురు. ఆధారాంగాది సంఘాతముచే బంధింపబడి బుద్ధిగ్రాహ్యమగు పిండీబంధము ఆకృతివిశేషమున ప్రధానవిషయమును వ్యక్తపరచుచు తద్ద్వారా దేవతామూర్తిని సూచించునది.

అనగా ఆకృతివిశేషమునకు సాంకేతికమగు సన్నివేశమును చూపుటయే పిండీబంధ మనిపించుకొనును. ఈ సన్నివేశము కరణాంగహారాములద్వారా సంపాదితమగును.

పరమేశ్వరుని తర్వాత ప్రధానభూత పిండీబంధ లక్షణమును విధించిన నందీశ్వరుని పిండీ పట్టసమని చెప్పినారు. పరమేశ్వరుని పిండీబంధము, నందికేశ్వరుని పిండీబంధముకూడ త్రిశూలాకృతియగు ఆయుధవిశేషమేయని తెలియవలెను. తదనంతరము పరమేశ్వరియగు చండికాదేవి పిండీబంధము సింహావాహనమని తెలుపబడినది. విష్ణువునకు గరుడుడు, బ్రహ్మకు పద్మము, ఇంద్రునకు ఐరావతము, మన్మథునకు చేప, స్కందునకు నెమలి, లక్ష్మికి రూపము, గంగకు ధార, యమునకు పాశము, నదికి వారుణీ, కుబేరునకు యాక్షీ, బలరామునకు నాగలి, సర్పములకు సర్పములు, ఇవనవి పిండీబంధములు. అనగా ఆయా ఆకారములుగల రూపములే పిండీబంధములు. యాక్షీ అనగా కుబేరుని ముద్గరాకారమగు ఆయుధము.

దక్షయజ్ఞమున ధ్వంసముచేసిన త్రిశూలము గణేశ్వరీఅను మహాపిండీబంధము. త్రిశూలాకృతితో విన్యసితమైనది రౌద్రీయను పిండీబంధము.

ఏవ మన్యాస్వపి తథా దేవతాసుయథాక్రమమ్
వజ్రభూతాః ప్రయోక్తవ్యాః పిండీబంధాః సుచిహ్నకాః. 259

తృతీయాధ్యాయమున చెప్పబడిన దేవతలకుగూడ పిండీబంధములను పైనవివరించినరీతిగా చెప్పికొనవలెను. ధ్వజపూజా హుత్యాయుధ వాహనవిశేష రూపములుగా, సుచిహ్నకములుగా పిండీబంధములను జూపవలెను. ఏదోఒక కర్మాదిసూచకమగు రూపముతో నుపలక్షితములైనవి యని దెలుపుటకు సుచిహ్నకములని భరతుడు ప్రయోగించినాడు.

ఎచట ఏదేవత అధిష్ఠానముగా చెప్పబడినదో అచ్చట ఆదేవతను చివరకు నృత్తముతో సంతోషపరుపవలెను. ఆదేవతయొక్క ఆయుధ వాహన కర్మ భావాద్యనుకారియగు అంగప్రయోగమును ఆనృత్తమున విధించవలెను. "తిలకేచ కరః స్థాప్యః"అను అరువదినాల్గవ కరణము నభినయించుటచే శంకరుడు సంతుష్టుడగును. "నికుట్టితౌ యదా హస్తౌ" అను తొమ్మిదవ కరణముతో త్రిశూలాకృతిగల దేహసంస్థితి రాగలదు. గరుడప్లుతక కరణముతో గరుడుని ఆకారగతిసూచన జరుగగలదు. గంగావతరణకరణముతో ధారాపిండీ, నాగాపసర్పిత కరణముతో సర్పపిండీ సిద్ధించగలవు. స్థిరహస్తమను అంగహారముతో త్రిశూల శివలింగాది పిండీబంధము నిష్పన్నమగును. రేచితాంగహారముతోను, ఆక్షిప్తరేచితాంగహారముతోను, సమస్తములైన ఆధారాద్యనంత భేదములుగల పిండీబంధములు నిష్పన్నములు కాగలవు.

రేచకా అంగహారాశ్చ పిండీబంధా స్తథైవచ
సృష్ట్వా భగవతా దత్తా స్తాండవే మునయే తదా. 260
తేనాపి హి తతః సమ్యగ్గాన భాండ సమన్వితః
నృత్తప్రయోగః సృష్టో యః స తాండవ ఇతి స్మృతః. 261

రేచకములను, అంగహారములను, పిండీబంధములను సృష్టించి శంకరుడు తాండవనృత్తమునకై భరతునకొసగెను. శిఖిపిండి మొదలగువాటిని నిష్పాదించు మయూరలలితాది కరణములు

పిండీబంధశబ్దముచే సూచింపబడుచున్నవి. కేవలము కరణమును ప్రయోగించినను దేవతకు సంతోషము కలుగగలదు. తద్ద్వారా కరణము అదృష్టఫలమునకు కారణమగును. కావుననే విష్ణుక్రాంత చక్రమండలములు విష్ణుక్రీడా సూచకములగుచున్నవి.

స్థానక, చారీ, నృత్తహస్త, భ్రూ, తార, కర్ణములను శోభావిశేషముతో సృష్టించి భగవానుడగు శంకరుడు నృత్తవిధానమును గావించినాడు. ఈ ఉపకరణజాలమును భరతునకొసగినాడనుటలో నృత్తము శోభాప్రాధాన్యముగలదని సూచింపబడుచున్నది. ఇట్టి నృత్తమును గ్రహించుటకు ఊహాపోహాది సమర్థులుకావలెను గనుక భరతమునిని భగవానుడనుగ్రహించినాడు.

కరణాంగహార పిండీబంధములతోకూడిన నృత్తాత్మక ప్రయోగము సమ్యగ్వైచిత్ర్యముతో, సమంచితతాళలయాత్మకముగా, గీతములతోను, పుష్కరాది వాద్యాదులతోను కూడినదై సృష్టించబడి తాండవమని పిలువబడుచున్నది. నృత్తప్రధానమై గీతములతోకూడినదీప్రయోగము.

నృత్తము నాట్యముకన్న భిన్నమైనదా, కాదా? భిన్నమైనచో ప్రయోజనముతోకూడియున్నదా, లేదా? అంగవిక్షేప నృత్తగీతాదులు నృత్తనాట్యములలో రెంటియందును కన్పించుటచే నివి భిన్నములన వీలులేదు. నృత్తమున పాడబడుగీతములలోని పదార్థ వాక్యార్థములు నాట్యార్థమున లీనమగుచున్నవి. నృత్తమునగల ఏకపాత్రాహార్యము నాట్యమునగూడ ఆకాశభాషితాదులయందు, భాణరూపకమునగలదు. ఉభయత్ర అభినయము వాచ్యానుగతముకాగా, గాత్రవిక్షేపములచే అర్థము ప్రతిపాదితమగుచున్నది కావున నృత్తనాట్యములకు భేదములేదని వార్తికకారుడు సిద్ధాంతించినాడు.

"ప్రియతమ గుణకీర్తన పరమై నృత్యము చేయుచున్నది", "కలహాంతరిత నృత్యము చేయుచున్నది", "ఖండిత నృత్యము చేయుచున్నది" అను ప్రయోగములద్వారా నాట్యమున సాక్షాత్కార బుద్ధి కలదని తెలియగలదు. కాని గీయమాన రూపకాభినయ దర్శనము నాట్యము కన్న విలక్షణమైనది. నాట్యము భావరస సంప్రయుక్తము. నాట్యమున కవయవరూపమగు వాద్యాభినయములలో గీత ముపరంజకము గాగలదు. ఐనను ఆసీన పాఠ్యాదులయందు వాచికాభినయము కన్పించుటచేతను, ఆహార్య, సాత్త్విక, ఆంగికాభినయములుగూడ ఉభయత్ర కన్పించుటచేతను నృత్త నాట్యము లభిన్నములని సిద్ధమగుచున్నది.

> "యదా ప్రాప్త్యర్థ మర్థానాం తజ్ఞై రభినయః కృతః
> కస్మా న్నృత్తం కృతం హ్యేత త్కం స్వభావ మపేక్షతే. 262
> న గీతకార్థ సంబద్ధం న చాప్యర్థస్య భావకమ్
> కస్మా న్నృత్తం కృతం హ్యేత ద్గీతే ష్వాసారితేషుచ". 263

అప్పుడు భరతుని ఋషు లీ క్రిందివిధముగా నడిగినారు. "కావ్యార్థములను సాక్షాత్కార బుద్ధితో స్వీకరించుటకు నాట్యప్రయోక్తలచే ఆంగికాద్యభినయము చేయబడినది. నృత్తమెందుకు నిర్మింపబడినది? నృత్తశబ్దముచే నేది వ్యపదిష్ట మగుచున్నది? ఏస్వభావమును నృత్తమపేక్షించుచున్నది?"

నృత్త స్వభావము లౌకికమా, అలౌకికమా? అని చివరి ప్రశ్నలోని సూచన. లౌకికమైనచో నృత్తస్వభావము ఘటాది వస్తు తుల్యముగాని, తదనుకారముగాని, తత్ప్రతిబింబాది రూపముగాని కావలెను. ఈ మూడు విధములలో నృత్తము నాట్యచ్ఛాయయే యగును. కాని నృత్తస్వభావము లోకోత్తరమైనచో నృత్తము నాట్యములోని అవాంతర భేదమే యగును. అవాంతరభేదమైనను నిష్ప్రయోజనము కాజాలదు.

ధర్మాది ప్రయోజనాదులను పొందింపజేయుటకు పండితులచే కవులచే అభినేయమానములుగాగ కావ్యాదులు నిర్మించబడినవి. ఏ కారణముచే నిది నృత్తమనుచున్నది? ఎందుచే నిది నాట్యముకాదు? గాత్ర విక్షేపాత్మకమగు నృత్తము నాట్యముతో తుల్యార్థము కలిగియున్నను, తద్భిన్నస్వభావమును దేనిని అపేక్షించుచున్నది? తద్భిన్నస్వభావము లేనిచో, అని ఋషుల ప్రశ్నలలోని భావము.

నృత్తనాట్యముల స్వభావ ప్రయోజనములు తుల్యము లగుటచే నాట్యముకన్న నృత్తము భిన్నమైనదికాదు. రాఘవ విజయాది రాగకావ్యాది ప్రయోగమున నాట్యముతోనే అభినయము జరుగవలెను. వలనము, అవర్తనము, భ్రూక్షేపము, తారాచలనము, చరణధారణ, కంప, స్ఫురిత, కటిభేద, రేచకాదులు మాత్రమే కలిగి, అభినయ శూన్యమైనచో నాట్యము ఉండదు. కాని ఇట్టిది నృత్తమనికూడ ఎవరును చెప్ప సాహసింపజాలరు.

గీతవాద్యాదులవలె నృత్త మపరంజకముగా గ్రహింప వీలులేదు. "కావ్యమున చెప్పబడని దానిని గీతముతో ననుసంధించ వలయును"; "వాక్యముల నుచ్చరింపనిచో గీతమున" అని పలుమారులు చెప్పుటచే గీతము ప్రకృతి చిత్తవృత్తి కథావస్థాది సూచకముగా గ్రహింపబడు చున్నది. గీతమున నుపయోగించు తాలోద్దీపకముగా వాద్యమును ప్రయోగించవలె ననుటచే వాద్యముసహితము కేవలము ఉపరంజకముకాదు.

నృత్తస్వభావము లౌకికమైనచో లోకధర్మితో చారీ మండలాదిక్రమమున నృత్తాంగములను నిరూపించవలసియుద్నిది. అలౌకికమైనచో నృత్తమున నాట్యశక్తికి అనుప్రవేశముగలదు. ఉభయత్రనృత్తము నాట్యముకన్న విలక్షణముగా కన్పించునట్లు తోచగలదు. కాని పూర్వరంగప్రయోగమునకు వైచిత్ర్యము నాపాదించుటకై నృత్తము స్వీకరింపబడుచున్నదని జ్ఞాపకముంచుకొనినచో ఈభేదమును లెక్కజేయ నవసరములేదు.

గీతకపదములలో చెప్పబడిన అర్థములను సామాజిక హృదయముల కభిముఖముగా తీసికొని పోవుటకై నృత్తాభిమతమైన అభినయము విధించబడినది. ఇట్లు నాట్యముతో తుల్యమైన అభినయము కల్గియున్నను, ఇది నాట్యమేలకాదు? అని ఋషుల అభిప్రాయము. గీతకములలోని అర్థము నభినయించునప్పుడు ఆంగిక హస్తకార్యాద్యభినయ వ్యతిరిక్తమగు స్వభావమును నృత్తమపేక్షించుటలేదు. గీతకార్థములు తదారంభకములగు వస్త్వంగాదులు, వీటితో సంబద్ధమైనదిగా నృత్తము పరిగణింపబడుటలేదు. గీతముకన్న విజాతీయమైనది నృత్తమగుటచే గీతకార్థములలో నృత్తపరిగణనడుండదు. సుషిరాది వాద్యాంగముగాగాని, తదుపయోగిగాగాని నృత్తము లేదు. గీతకాదులయందు నృత్తము ప్రధానముగా నిరూపింపబడుటలేదు. స్వరూప పద తాలాదు

లకుగూడ నృత్తము ప్రాపకముకాదు. ఐనను గీతములయందు, ఆసారితములయందు నృత్తమెందు లకు నిర్మింపబడినది ? అని రెండవ శ్లోకములోని భావము.

అత్రోచ్యతే – నఖల్వర్థం కంచి న్నృత్త మపేక్షతే
కింతు శోభాం జనయతీ త్యతో నృత్తం ప్రవర్తితమ్. 235

రేచకాంగహార నిబంధాత్మకమగు నృత్తముతో నేమియు అభినయింప బడుటలేదు. కాని విశిష్టమంత్రములవలె గీతమే అర్థమును తెల్పుచున్నది. గీతాంగవస్తువులోను ఇరువదియేడు ఆసారితములలోను, నాలుగు వర్ధమానారంభకములలోను సంవలితమై ముప్పదిరెండు అంగహార ములతో కూడినది నృత్తమనినను నృత్తసంబంధ విషయ మేమియు గానరాదు. నృత్త కావ్యాదుల యందు నాట్యప్రయోగమే కన్పించుచున్నది. నృత్త తాల గీతకా ద్యుపయోగ మీకావ్యము లలో దుర్ఘటము. ఈవిధముగా ఆశంకలు బయలుదేరగా భరతుడీ శ్లోకమునుండి వచ్చు మూడు శ్లోకములతో సమాధాన మిచ్చుచున్నాడు.

రాగకావ్యాది నృత్తము నాట్యముకన్న భిన్నమనుటలో అనైకాంతిక దోషముకలదు. నాట్యమున పఠ్యమానముగాని అభినీయమానముగాని యగు పదజాతములోని అర్థము గాత్రవిక్షే పముతో అనుసంధింపబడి, సాక్షాత్క్రియా యోగ్యతను బొందుచున్నది. ఈవిషయము లౌకిక నృత్తమున, నాట్యమునగూడ స్ఫుటముగా కన్పించుచున్నది. గీతకాలాపమున పదార్థ సంవాద కృతమైన తన్మయీ భావముతో సాత్త్వికాంగత లోకమునకూడ కన్పించుచున్నది.

నృత్తకావ్యమున అభినయ కథయే లేనిచో, నట విచారింపబడు విషయమేమి ? కేవలము భావిత కావ్యార్థములోని అర్థతత్త్వ సౌకుమార్యముచే సిద్ధించు అవయవ సన్నివేశమే నృత్త స్వభావమని చెప్పుట కెవడును సాహసించలేడు. ధారాపరిక్రమ పూర్వకమగు లయ ప్రయో గావసరమున పాడబడు గీత మర్థరహితము కాదుగదా! గానాది సంక్రమితమైన వాక్యార్థము నభినయించు నర్తకిచే సాక్షాత్కార కల్పార్థముగా గావింపబడు సాక్షాత్కార కల్పాను వ్యవ సాయి గోచరీ కార్యమే నాట్యమని నాట్యలక్షణము. కాగా అన్యాపదేశ గానాది క్రమమున గాని, వస్తూద్బోధనకరముగాగాని, మనస్సులోని ప్రియతమ విషయమున స్వేచ్ఛగా నభివ్యక్త పరచుచు, పాడుచు, నృత్యము చేయుట మనకు తెలిసిన విషయమే. ఇట్టి నాట్యము డోంబికాది నృత్తమున సహితముగలదు. నరపతికి సంతోషమును కల్గించు కథను తెల్పు పదములు గల గీతముతో, నృత్తముతో రాజమానసమును రంజింపగోరి డోంబిక నృత్తమున కుద్యుక్తురా లగుచున్నది. వివిధచేష్టలతో రాజపుత్ర హృదయాను ప్రవేశయోగ్యమగు నృత్యమును జూపి ధనార్జనాది స్వలాభములను నెరవేర్చుకొనుచున్నది. గాయనముఖ సంక్రమిత నిజవచనమై, తద్గీయమాన రూపకగత లయ తాలానుగుణ్యముగా నృత్యముచేయును. గీయమాన పదార్థము రాజాదుల హృదయములను ప్రవేశించునట్లుగా చూపుటకు లౌకికవ్యవహారమున చూపబడు హాస్త, భ్రూ, రోమాంచ, అక్షికర్మలను కన్పరచుచు, అంగవిన్యాసాదికమును చూపుచున్నది.

ఈవిధముగా రంజన ప్రాధాన్యమగు గీతమును విధించి, తదుపయోగియగు అంగవ్యాపార మును నృత్తముతో ప్రదర్శించి, రాజాదుల చిత్తమునుగ్రహించ గల్గుచున్నది. ఇచట నృత్తము

ప్రధానమైనది. నృత్తమున కంగముగా గీతము స్వీకరింపబడుచున్నది. కావుననే అభినయమును పరిత్యజించక, గీయమానాంగభావముచే ఆక్షిప్తమై సముచితభావముతో కూడిన అంగవిక్షేపమును లయ పరిష్కృత కరణాదులయందు చేయుచున్నది. ఇంతవరకు రామనటాది వ్యవహారము వలె లౌకిక మాత్ర స్వభావమే కన్పించుచుండగా ప్రయోజ్య ప్రయోజక భావాశంకరాజాలదు.

డోంబికానృత్తమున ఆహార్యాదికముతో స్వాత్మరూప ప్రచ్ఛాదనము లేకపోవుటచే సాక్షాత్కార కల్పముగా నర్తకి భావమును చూపలేదు. కాని అభినయముతో గూడిన నృత్తమును మాత్రము ప్రదర్శించుచున్నది. అందుచే నాట్యాంగములగు పతాకాదులు దర్శనమాత్రముగా నిట గ్రహింపబడుచున్నవి. కావున నృత్తమునకు సంస్కారకమైనది నాట్యము. నాట్యమునకు ప్రస్తావనా ప్రాణ ప్రతిబింబ కల్పమైనది నృత్తమను వ్యవహారము కేవల మౌపచారికము. నాట్యమున సాక్షాత్కార కల్పాను వ్యవసాయ సంపత్తికి ఉపకరించు భాషానియమము, ఛందోఽలంకారాదినియమము, ఆహార్యాదినియమములు కలవు. నృత్తమున భాషానియమ పూర్వకమగు పాత్రల సంభాషణయే కన్పించదు. గీతమున చెప్పబడిన అర్థమునుగాని, ప్రశ్ననుగాని, డోంబికానృత్తమున నర్తకి స్వస్వరూపానాచ్ఛాదనతో నృత్తమున సమాధానపరచును. కావుననే "ఈనర్తకి కలహాంతరిత," "ఈనర్తకి ఖండిత" అను ప్రయోగములను, గీతములందలి అర్థమును గీతవాద్యానుసారముగా నృత్తమున కన్పించునట్లుచూపుటయే ఔపచారికములుగాగ్రహింపవలెను. లంబాలకత్వ, వేణీధారణ, మంగల వలయా పరిగ్రహాది తదుచిత వేషాదికముచే నాయికాభేదము తెలియబడుచున్నది. సాత్త్వికాది ప్రధానరసముననుసరించి,లయతాలాదిసహితముగా అర్థసూచన యోగ్యాభినయమును ప్రయోగించుటలో తదుచితార్థ పరిమాణము ధ్రువాగానముతో జరుగుచున్నది. కావున డోంబికానృత్తమునకు లౌకికప్రయోజనము చెప్పిన నాట్యమని దీనినిపిలువరాదు.

లౌకికప్రయోజనమున రాజపుత్రాదులను తృప్తిపరచుటయే కన్పించును. కాని నర్తకి యొక్కఫలము దేవతా పరితోషణమే అని తెలియవలెను. లాస్యప్రయోగమున మహేశ్వరి, తాండవప్రయోగమున మహేశ్వరుడు సంతోషమునందగలరని సంప్రదాయవచనము. కాగా నృత్తనాట్యముల కలౌకికప్రయోజనము చెప్పిననే నృత్తమున అభినయాదికము సిద్ధించగలదు. నృత్తమునకు నాట్యలక్షణప్రయోజనా భేదముగలదని చెప్పికొనవలెను. అందుచే భరతుడీ క్రిందిరీతిగా సమాధాన మొసగుచున్నాడు.

సాక్షాత్కారమును పొందింపజేయు అర్థమును, నాట్యముకన్న భిన్నమగు అర్థమును, నృత్త మపేక్షించదు. అపేక్షించినచో లక్షణభేదము కలుగగలదు. సామాజికుల నుద్దేశించి వ్యుత్పాదనీయములగు ధర్మాద్యుపాయముల కంటె భిన్నమైన అర్థమును నృత్త మపేక్షించజాలదు. అట్లు కానిచో ప్రయోజన భేదముకూడ రాగలదు. నాట్యలక్షణము, నాట్యప్రయోజనము నృత్తమున కుండునట్లుగా నృత్తము ప్రవర్తింపబడినది.

వలనావర్తనాదులుగల నృత్తము నాట్యమున కంతరంగముగా ఉపయోగించును. నృత్తరహితమైన నాట్యము అలాతచక్రమువలె బుద్ధిగ్రాహ్యము కాజాలదు. అందుచే విమలమైన అభినయమను మాణిక్యముతో పొదుగబడిన సూత్రమువంటి నాట్యము సర్వవ్యాపి యగు

చున్నది. వలనాది రూపమగు నృత్తమునకు సజాతీయమై, అంతరంగ గీతాదులలో కూడ అంతర్యామిగా నుండునది నాట్యము. అనగా నాట్యరహితమైన నృత్తము లేనేలేదు.

వర్ణనావిలాస వలనాది లక్షణములుగలిగి, కావ్యమునకు కావ్యావయవములకు విలాస చేష్టావస్థాపనాత్మకమైన నృత్తము ప్రకృష్టముగా, అత్రుటితముగా ప్రవర్తితమైనది. గానాదికముతో రంజనయోగ్యమై ప్రకృష్టమగు చమత్కార మనబడు లోకోత్తరానందమును చేకూర్చుటకు నృత్తము ప్రవర్తిత మైనది.

ప్రాయేణ సర్వలోకస్య నృత్త మిష్టం స్వభావతః
మాంగల్యమితి కృత్వాచ నృత్త మేత త్ప్రకీర్తితమ్. 265
వివాహ ప్రసవావాహ ప్రమో దాభ్యుదయాదిషు
వినోదకారణంచేతి నృత్త మేత త్ప్రవర్తితమ్. 266

సమస్తజగత్తుకు స్వభావసిద్ధముగా నృత్తము ప్రీతికరమైనది, ఆత్మాభిమతమైనది. నృత్తము మంగళప్రదమైనదని కీర్తింపబడుచున్నది. వివాహప్రసవావాహనములయందు, ప్రమోదసమయమున, అభ్యుదయకాలమున, నృత్తము వినోదము నొసగునని ప్రవర్తితమైనది.

వివాహసమయమున, పుత్రజన్మకాలమున, ఆవాహసమయమునగూడ నృత్తము సంతోషమునుకూర్చును. భార్యతోకూడ మామగారి ఇంటికి పోవుటను ఆవాహమందురు, మనోరథ, అభిలషిత వస్తులాభము అభ్యుదయమనబడును. అనాకాంక్షిత శుభప్రాప్తి వేళలోకూడ నృత్తము ఆత్మాభిమత మగును.

అతశ్చైవ ప్రతిక్షేపా ద్భూతసంఘైః ప్రకీర్తితాః
యే గీతకాదా యుజ్యంతే సమ్యక్ నృత్తవిభాగకాః. 267
దేవేనచాపి సంప్రోక్తా స్తండుః సంతోషపూర్వకమ్,
"గీతప్రయోగ మాశ్రిత్య నృత్త మేత త్ప్రవర్త్యతామ్." 268

నృత్త మేస్వభావము నపేక్షించును అని ఋషులడిగిన ప్రశ్నకిచట సమాధాన మొసగబడుచున్నది. పైన చెప్పబడిన కారణములవలన నృత్తము ప్రవర్తింపబడినది. ప్రారంభమున పూర్వరంగమందు లక్షణపూర్వకముగా నృత్తము యోజించబడుచున్నది. "ఝంటు" మొదలుగాగల శుష్కాక్షరములతో గూడిన గీతకములతో నీ పూర్వరంగము భూతసంఘము లగు దైత్యాదులను సంతోషపరచుటకు ప్రయోగింపబడుచు నృత్తమున కవకాశమును కలుగజేయుచున్నది. మద్రకాది గీతములకు మొదట నృత్తమును జూపుటకు అభినేయ పదార్థరహితమైన నిర్గీతమే కన్పించుటచే నీ నృత్తము అభినయరహితమైనదని శంకింప నక్కరలేదు. శుద్ధమగు నాట్యాంగము యొక్క విభాగకములు, విభాగప్రాపకములు మొదట ప్రయోగింపబడుటచే నృత్తము అభినయ సంవలితమే యగుచున్నది. గీతకముల ఉపోహనములను ప్రయోగించుచో శుద్ధనృత్తమునే చేయవలెను. గీతకాంగ మధ్యమున నృత్త ప్రవేశ మున్నది. అంగవ్యవహారాదికమున అర్థమును సామాజికుల కభిముఖమగునట్లుగా తీసికొని వెళ్ళగా వాచ్యము అభినీతమగును. ఇక్కడ అభినయమునకు సాక్షాత్కార కల్పతాపాదనమను నర్థమును చెప్పరాదు. కాని లయా ద్యాహారిత్వ

మాత్రమే అర్థముగా చెప్పికొనవలెను. వాచ్యార్థము నితరుల కవగాహనమగునట్లు లయతాలా ద్యాహార్యము ద్వారా తీసికొనివెళ్ళుటయే నృత్తమున గల అభినయనము.

గీతకాసారితాదికము నృత్త వైచిత్ర్యాశ్రయమై శోభించగలదు. కాగా గీతాదికమువలె నృత్తముయొక్క ఉపయోగము, నాట్యాంగత్వము గ్రహింపబడవలెను.

ఇక నృత్త ప్రధానమగు రాగకావ్యాది విషయమున కావ్యముగూడ నాట్యాంగమేయని చెప్పగోరి, ఇతివృత్తరూపమున తర్వాతి శ్లోకమును భరతుడు చెప్పినాడు. మహేశ్వరుడే ప్రకృష్ట మైన ఆదరముతో సంతోషపూర్వకముగా తండు అనబడు నందీశ్వరుని "గీతప్రయోగము నాశ్ర యించుకొని నృత్తమును ప్రవర్తింపజేయుము" అని ఆదేశించినాడు.

గీతమనగా కావ్యము. కావ్యముయొక్క అర్థానుప్రవేశము కావ్యమునగల ప్రకృష్టప్రయో గము. ఇట్టి గీతప్రయోగమును, అనగా అర్థానుప్రవేశ లక్షణము నాశ్రయించి నృత్తమును, ప్రవర్తింపజేయవలెను. అంగవిక్షేపితాంగత్వమును సామరస్యముగల లయసత్త్వాదులతో నృత్త మున జూపవలెను. అనగా తాండవ ప్రభృతి నృత్త తద్గీయమాన రూపకగతమైన వర్ణాలంకార లయపదార్థ వాక్యార్థ సమ్మిలితమైనది నృత్తము.

ప్రాయేణ తాండవవిధి ర్దేవ స్తుత్యాశ్రయో భవేత్
సుకుమార ప్రయోగశ్చ శృంగార రస సంభవః. 269

హిమాలయపర్వతముపై సంధ్యాకాలమున శివుడు నృత్యముచేయుచుండగా నారదుడు భక్తితో త్రిపురోన్మాద గీతము నాలాపించెను. ఆగీతమును వినుచుండగా శివునిచిత్తము ప్రీతిని జెంది అభినయమును గావించెను అప్పుడు శివుడు తండుఅను నందీశ్వరునిబిలచి "నాట్యోక్తితో, అభినయముతో నీతాండవమును యోజించుము"అని పలికెను. అప్పుడు తాండవవిధి నిష్పన్న మైనదని కోహలుడు వచించినాడు.

తాండవవిధి సాధారణముగా దేవస్తుతిని ఆశ్రయించుకొని యుండును. తాండవశబ్దము నిచట సర్వనృత్తమునకు ఉపలక్షకముగా గ్రహించవలెను. నృత్తమును విధించునదివిధి. విధేయ మానమైనది దేవస్తుతిగల కావ్యము. కాగా ధర్మవీర ప్రధానమైనదీ కావ్యమని చెప్పుటలో ఉద్ధత రూపతాసూచనముతో అన్యరస పరిగ్రహముకలదు. కావ్యమునుండి నాట్యము నిష్పన్నమగును.

శృంగారరస సంభవమైనది సుకుమార నాట్యప్రయోగము. పూర్ణా పూర్ణరూపమైన శృంగారరసముతోనున్న మసృణప్రయోగ మిచట నిర్దేశింపబడుచున్నది. డోంబికానృత్తమున నరపతి చాటుకాది ప్రాధాన్య ప్రకృతియుండుటచే శుద్ధమైన సుకుమారనృత్తమే కానగును. భాణకములయందు ఉద్ధతమగు నృసింహాదిచరిత వర్ణనముండును. మసృణప్రయోగముకూడ ఉద్ధ తము, ఉద్ధతమిశ్రము మొదలగు భేదములతోనుండగా షిద్గకాది భేదములు వచ్చుచున్నవి. భాణికము ఉద్ధతమసృణమైనది. రామాక్రీడక, రాసక, హల్లీసకాది భేదము లిట్లేరాగలవు.

ఘన్మానురాగ గర్భితములైన మాటలచే రాజ మానసము నాకర్షించు మసృణ ప్రయో గమును డోంబికా అందురు. వరాహ నృసింహాది వర్ణనములను నర్తకి జల్పించు ఉద్ధతాంగ ప్రవర్తితమైనది భాణము. గజాదుల గతిని, ప్రవసనమును అనుకరించు అల్పావిద్ధమైన మసృణ

ప్రయోగము ప్రస్థానము, సఖీసమక్షమున భర్తయొక్క ఉద్ధత వృత్తమును చెప్పుచు, కొంచెము భూర్తచరితముగూడ చెప్పునట్టి మసృణప్రయోగమును షిద్గకమందురు. సూకర సింహ జనితమైన బాలక్రీడా నియుద్ధాదికమును ధ్వజాదికముతో గావించిన భాణిక యందురు. ప్రహేలికతో, ఋతువర్ణన సంయుక్తమైన హాస్యప్రాయమగు ప్రేరణ రామాక్రీడ యగును. గోపస్త్రీలతో కృష్ణు డొక్కడే వర్తించినట్లు ఏకనాయకునితో మండల నృత్తము జరుగుచో దానిని హల్లీసకమందురు. అనేక నర్తకురాండ్రతో, చిత్ర తాలలయాన్వితమైన మసృణోద్ధత నృత్తమును రాసకమందురు.

ఈ ప్రబంధములు నృత్తాత్మకములు. ఇవి నాట్యాత్మకములైన నాటకాదులకంటె విలక్షణములైనవి కావు. కావుననే రాఘవవిజయము, మారీచవధ మొదలగునవి రాగకావ్యములని పిలువబడుచున్నవి. లయాంతర ప్రయోగముతో, రాగములతో, నానారసములతో నుండి, సునిర్వాహ్యమైన కథ గలది కావ్యమని కోహలుడు సహితము నిర్వచించినాడు. గీతము నాశ్రయించుకొని లయ యుండుటచే గీతమునకే ప్రాధాన్యము కలదు. రాఘవవిజయమున విచిత్ర వర్ణనీయవిషయమున్నను ఠక్కరాగముచేతనే నిర్వహణము సిద్ధమగుచున్నది. మారీచ వధలో కకుభగ్రామరాగములో నిర్వాహము కలదు. కావున వీటిని రాగకావ్యములనినారు. గీతాత్మకము, గీతము నాధారము చేసికొనినదియు నగు రాగములతోనున్న కావ్యము లివియనిభావము.

సప్తకృతి ప్రకారములతో శివునిచే సవిధమైన నృత్తము ప్రచారములోనికి తీసికొని రాబడినది. శుద్ధమైన నృత్తము రేచకాంగహారాత్మకము. నృత్తము గీతకాద్యభినయోన్ముఖము, గాన క్రియామాత్రానుసారి, వాద్యతాలానుసారికూడ నగుచున్నది. బాహు ప్రేంఖణము, ఉరః కంపము, పార్శ్వనమనోన్నమనములు, చరణసరణము, స్ఫురిత కంపిత భ్రూ, తారాపరిస్పందము, కటిచ్ఛేదము, అంగవలనము అనురూపములతో వ్యక్తమగునది నృత్తము.

ఉద్ధతము, మసృణమిశ్రమగు ఉద్ధతము, సుకుమారము, ఉద్ధతమిశ్రమగు సుకుమారము అను నాలుగు విధముల కావ్యార్థముల ననుసరించి ప్రయోగములు నాలుగురకములు రాగలవు. లౌకికమగు స్వతంత్ర నృత్తమునగాని, దేవతాపరితోషణమునగాని మొదటి విధమగు ఉద్ధత నృత్తము వచ్చును. పూర్వరంగవిధియందు పరిశిష్ట నృత్త లక్ష్యముల ననుసరించి తాండవాది నృత్తకలాపము కలదు. ఇది రెండవది యగు మసృణమిశ్రమగు ఉద్ధతము.

ప్రయోగ సహితముగా అంగహారములు, కరణములు, రేచకములు, పిండీబంధములు, పైన నిరూపించబడినవి. తదుపయోగిత్వ దృష్టితో నృత్తస్వరూపము చెప్పబడినది. ఇక అంగహారముల కెటువంటిప్రయోగమును చూపవలెనో చెప్పగోరి తర్వాతిశ్లోకమును చెప్పుచున్నాడు.

తస్య తండుప్రయుక్తస్య తాండవస్య విధిక్రియామ్
వర్ధమానక మాసాద్య సంప్రవక్ష్యామి లక్షణమ్. 270

పూర్వరంగమును యోగ్యముగాచేయుటకు తదుచితమైన అంగహారముల ప్రయోగము పూర్వము చెప్పబడినది. తాండవ యోగ్యమైనది వర్ధమానకతాలమే అని ముందు చెప్పబడనున్నది. 5 అ. 13 శ్లో. మొదట వర్ధమానకమునుగూర్చి చెప్పి, ఆపై గీతకాది విషయకవిధిని చెప్పగలడు. తండు అనగా నంది, తండుచే చెప్పబడినది తాండవము. తాండవ విధిక్రియ తండుచే

ప్రయుక్తమైనది. విధియనగా గాత్రము. తాండవవిధియొక్క క్రియాత్మకలక్షణమును చెప్పబోవు చున్నాడు. ఈక్రియాత్మకలక్షణము వెనుక కరణాంగహార విషయకముగా చెప్పబడినదేగాని గీత తాల సంమిశ్రముగా చెప్పబడ లేదు. అందుచే వర్ధమానక తాలమును సామ్యాపాదనకై ఉపాయ ముగాతీసికొని లక్షణ నిర్వచనము చేయుచున్నాడు. వర్ధమాన శబ్దవాచ్యమగు వాక్యసమూహ మును అభినయార్థము స్వీకరించి, తదాక్షిప్తమైన గీతవిశేషమును గ్రహించి, వలనాప్రనాద గత ధ్రువ తారాది నియతకారిత్వముగా ప్రయోగమును భరతుడు చెప్పబోవుచున్నాడు. వర్ధమానక గీత తాలాభినయ సంబంధముతో తాండవము వచ్చినదని భావము.

కలనాం వృద్ధి మాసాద్య హ్యక్షరాణాంచ వర్ధనాత్
వర్ధనా న్నర్తకీనాంచ వర్ధమానక ముచ్యతే. 271

తాండవయోగాభిధానమునకై వర్ధమానక రూపము నిట చెప్పుచున్నాడు.

కనిష్ఠాసారితకములైన కళలు పదునేడు. అదే ద్విగుణలయమైనచో లయాంతరమగును. ముప్పదిమూడు కళలున్న మధ్యమమని, అరువదియైదు కళలున్న జ్యేష్ఠమని విభాగము. లయ ద్వారా, సంఖ్యాద్వారాకూడ కళలకు వృద్ధికలుగును ఈవృద్ధిచేతనే హీయమాన పదవృద్ధి ఆక్షిప్తమగును. కళలననుసరించి అక్షరములకు వృద్ధికలుగును. ఇట్లే నర్తకీవృద్ధికలుగును. ప్రథమా సారితమున నొకనర్తకి, ద్వితీయాసారితమున నిద్దరు అని క్రమముగా నర్తకురాండ్రకు వృద్ధిగలదు.

కళావృద్ధి, అక్షరవృద్ధి, నర్తకీవృద్ధి అను వృద్ధియోగముచే వర్ధమానకము సిద్ధించును. అంగహారప్రయోగము, పరిపూర్ణమైన పిండీబంధవిధి, ఈవర్ధమానక యోగముతో చక్కగా నిష్పన్నములు కాగలవని భావము.

కృత్వా కుతపవిన్యాసం యథావ ద్ద్విజసత్తమాః
ఆసారిత ప్రయోగస్తు తతః కార్యః ప్రయోక్తృభిః. 272

కలాపాతవిభాగార్థము ఆసారితక్రియ ఐదవ అధ్యాయమున విధింపబడినది 5 అ. 21 శ్లో. ఈ ఆసారితము శుష్కాక్షరములతో కూడినది. స్తోభక పదయుక్తమైన ఆసారితప్రయోగమునుచెప్పి 5 అ. 11 శ్లో. కుతప విన్యాసమునకు గడంగవలెననినాడు 5 అ. 12 శ్లో. కుతమనగా వాద్యముల సమూహము. చతుర్విధాతోద్యము కుతపము. కుతప విన్యాసమున తద్గాయకుల విన్యాసనము కూడ రాగలదు. దీనిని ప్రత్యాహారమను అంగముగా మున్ముందు చెప్పగలడు. 5 అ. 17 శ్లో. స్వరతాలలయకళాది నివేశనమును ముందుగాపింపవలెను. ప్రత్యాహారమను అంగముమొదలుకొని ఆసారిత క్రియాంతమైన విన్యాసమును 5 అ. 17 శ్లో. నుండి 5 అ. 21 శ్లో. వరకు ఇక్కడ చేయ వలెను. అభిఘాతాతోద్యమున గాయకునిచే ప్రయోగింపబడు ఆసారితగత కలాపాద ప్రస్తావమును పూర్తిగాపింపవలెనని భావము. అంతర్యవనికాంగముగా శుష్కాక్షరప్రయోగమును గావించుచు ఆతోద్యప్రయోగ ప్రస్తావననుచేయగా దైత్యులు సంతోషింతురు. తద్ద్వారా విఘ్నములు శమించగలవు. అట్టి అంగకలాపమునే ప్రయోగవిధిగా నిచట గ్రహించవలెను.

తత్ర త్వా పోహనం కృత్వా తంత్రీగాన సమన్వితమ్
కార్యః ప్రవేశో నర్తక్యా భాండవాద్య సమన్వితః. 273

ఇక ప్రయోగక్రమము చెప్పబడుచున్నది. కనిష్ఠాసారితమున పంచకలాత్మకమైన శుష్కాక్షరములను ఉపోహనమందురు. సమాసన్యాసత్వమున పద కల తాల సమభిహితములైన స్వరములుగల అంగ ముపోహనము. ఈ ఉపోహనమును తంత్రీగాన సమన్వితముగా నొనర్పవలెను. స్థానస్వరాదుల నాలాపింపజేయు సుషిరాతోద్యగానము నాచరించి, భాండవాద్య సమన్వితముగా నర్తకిని ప్రవేశపెట్టవలెను. భాండ వాద్యమనగా పుష్కరవాద్యము.

విశుద్ధ కరణాయాంతు జాత్యాం వాద్యం ప్రయోజయేత్
గత్వా వాద్యానుసారిణ్యా తస్యా శ్చారీం ప్రయోజయేత్, 274
వైశాఖస్థానకే నేహ సర్వరేచక చారిణీ
పుష్పాంజలిధరా భూత్వా ప్రవిశే ద్రంగ మండపమ్. 275

విశుద్ధ కరణజాతియందలి వాద్యము ప్రయోగించవలెను. విశుద్ధ కరణజాతితో ఏకాక్షర వాద్యమే సర్వపూర్వికమగును. ఈ వాద్యమును మధ్యస్త్రీల విషయమున నుపయోగించవలెను. తథావిధ వాద్యానుసారముగా పాడుచు, తదుపలక్షణమగు చారీవిధిని ప్రయోగించవలెను. చారీ విధిలో కరణాంగహారముల ప్రసక్తియుండుటచే భాండ వాద్య ప్రయోగముండవలెనని సూచింపబడుచున్నవి. కావుననే పర్యాయశః త్ర్యశ్ర ప్రయోగమును చూపవలెనని తౌతభట్టు అనినాడు. తర్వాత వైశాఖరేచిత కరణము 4 అ. 95 శ్లో. నభినయించవలెను. ఇది సర్వరేచకచారిణి యైనది. అపై తలపుష్పపుట కరణముతో అంజలియందు పూవుల నుంచుకొని నర్తకి రంగమండపమును ప్రవేశింపవలెను.

పుష్పాంజలిం విసృజ్యాథ రంగపీఠం పరీత్యచ
ప్రణమ్య దేవతాభ్యశ్చ తతోఽభినయ మాచరేత్. 276

అంగక్రమమున పుష్పాంజలిని వదలి, రంగపీఠమున ప్రదక్షిణము గావించుచు దేవతలకు నమస్కరించి, అభినయము నాచరించవలెను.

యత్రాభినేయం గీతం స్యా త్తత్ర వాద్యం నయోజయేత్
అంగహారప్రయోగేతు భాండవాద్యం విధీయతే. 277
సమం రక్తం విభక్తంచ స్ఫుటం శుద్ధప్రహారజమ్
నృత్తాంగ గ్రాహి వాదజ్ఞై ర్వాద్యం యోజ్యంతు తాండవే. 278

గేయమానమగు వాక్యాభినయమున, వర్ణాలంకార లక్షణమగు గీతము నభిముఖముగా తీసికొనిపోవలెను. అట్టిచో అవనద్ధవాద్యము గీతమునకు, అభినయమునకు ఆచ్ఛాదనకారి కాగలదు గనుక వాద్యప్రయోగమును స్వాతంత్ర్యముగా చేయించరాదు. అభినయశూన్యమై, శుద్ధమైన అంగహారప్రయోగమున నృత్తప్రాధాన్యముండుటచే, తదనుసారియగు భాండవాద్యమును ప్రయోగించవలెను. నర్తకీ సమాకర్షణమున పునరాసారితగాన ముండునుగాన నిది శుద్ధనృత్తము. కాగా గానసహితమగు వాద్యము, గానము, నృత్తము ప్రధానముగాగలదీ ప్రయోగమని సూచింపబడినది.

రెండవశ్లోకమున భాండవాద్య మెట్లుండవలెనో చెప్పుచున్నాడు. అక్షర, అంగ, తాళ, లయ, యతి, పాణిగ్రహ, న్యాస, వికృతములను అష్టవిధములతో కాల దేశ సమతాత్మకమైనది సామ్యము. ఇట్టి లక్షణోపేతమైన సమత్వముకల్గి భాండవాద్యము ఉండవలెను.

కాలకృతవిభాగముచేత స్వరోచ్చారణ స్థానదేశకృతమై తద్యోగముద్వారా సమరక్త స్వభావమును వాద్యముకలిగియున్నచో శబ్దమునకు హృద్యతాస్వరూపము రాగలదు. అనుహారానంతరము వాద్యముచు ప్రయోగించినచో విచ్ఛేదప్రతిభాసమానాక్షరమై యుండవలెను. ఇట్టి వాద్యమున కాది వర్ణానుహారము స్పష్టముగా నుండవలెను. ప్రహారజములైన వర్ణములు శుద్ధ విశుద్ధ కరణాంతమున నుండిన నది శ్రేష్ఠమైనవాద్యము. అంగహారాత్మకమైన నృత్తములోని కరణాంగములుగాని గీతాంగములుగాని సమత్వముగల వాద్యముచే స్వీకరింపబడవలెను. ఏవంవిధమైన భాండ వాద్యమును తాండవమున ప్రయోగించవలెను.

నృత్తకర్మభూతము, అంగకర్మభూతమునగు వాద్యము నృత్తమును గ్రహింపజేయునది. తదంగములు వైచిత్ర్య ప్రయోగముద్వారా విలాసపూర్వకముగా సామాజికులచే గ్రహించబడి నృత్తమునకు శోభను తెచ్చునవగును.

> ప్రయుజ్య గీత వాద్యేతు నిష్క్రామే న్నర్తకీ తతః
> అనేనైవ విధానేన ప్రవిశం త్యపరాః పృథక్. 279

గీతవాద్యము ప్రధానముగానుండగా స్వరాగతనృత్త ప్రాధాన్యమగు ప్రయోగమున తదాచిత్యార్థము గీతవాద్యమును తన నృత్తమున కనుగుణముగా ప్రయోగింపజేసి నర్తకి నిష్క్రమించవలెను. నర్తకి రంగమండపమునుండి పూర్తిగా నిష్క్రమించక, రంగమండపమున ముందుభాగమునుండి వెనుకకుపోవలెనని భావము. తర్వాత ఒకరితర్వాత నొకరుగా ఇతర నర్తకురాండ్రు ప్రవేశింపవలెను.

> అన్యా శ్చానుక్రమేణాథ పిండీం బధ్నంతి యాః స్త్రియః
> తావ త్పర్య స్తకః కార్యో యావ త్పిండీ నబధ్యతే. 280

కనిష్ఠాదికములగు నాలుగు ఆసారితములతో నలుగురు నర్తకురాండ్రు ప్రవేశింపవలెను. వీరు పిండీ బంధప్రకారముల ననుసంధింతురు. కేవల మాసారితాభిహిత లక్షణమగు ప్రయోగ మెంతవరకుజరుగునో అంతవరకు పిండీబంధము జరుగరాదు. ఏకఘనాభిన్నాత్మకమగు అంగవిక్షేపమే ప్రయోగమున నుండునో దానిని పర్యస్తకమందురు. ఇది అభినయ శూన్యమగు ఆంగికవిధి. పిండీబంధోపయోగియగు నృత్తమును ప్రయోగించనంతవరకు, ప్రవిష్టనర్తకి నివర్తనద్వారా ఏకాకినియగు నర్తకిచే ఆసారితాభినయము ప్రయోగింపబడవలయునని భావము.

> పిండీం బంధ్వా తతః సర్వా నిష్క్రామేయుః స్త్రియస్తు తాః
> పిండీబంధేషు వాద్యంతు కర్తవ్య మిహ వాదకైః. 281
> పర్యస్తక ప్రమాణేన చిత్రౌఘ కరణాన్వితమ్
> తత్త్రివో పోహనం భూయః కార్యం పూర్వవదేవ హి. 282

ఆసారిత నృత్త ప్రయోగమును గావించి నర్తకురాండ్రు వెనుకకు పోవలెను. పిండీబంధములు చేయునప్పుడు వాదకులు వాద్యముల నాలాపింపజేయవలెను. ఆసారిత ప్రయోగాభినయమగు పర్యస్తకమున వాద్యమున్నను తనంతఃపాతియు, పిండీబంధోపయోగియు నగు అంగహార ప్రయోగమున చిత్ర విచిత్ర నానాప్రకారములుగా వాద్యములు ప్రయోగింపబడవలెను. వాద్యవిధియందు చెప్పబడు కరణాది రూపములతో అన్వితమైన వాద్యములు కావలెను. ద్విమాత్రాత్మకమగు కళను చిత్రమార్గమని చెప్పుదురు.

ఒకరి తర్వాత నొకరుగా ప్రవేశించు నర్తకురాండ్రచే అభినయప్రయోగమున అంగహార ప్రయోగమును విధించి, తదనంతర మపసరణమును చెప్పి, తావత్కాలము వాద్యనృత్తములకు వైచిత్ర్యమును విధించి, ఇక లయాంతరమగు నాసారిత ప్రయోగమునుగూర్చి చెప్పుచున్నాడు. వెనుకటివలెనే మరల కనిష్ఠాసారిత ప్రయోగమును గావించవలెనని భరతుడు వచించుచున్నాడు.

తత శ్చాసారితం భూయో గాయనస్తు ప్రయోజయేత్
పూర్వేణైవ విధానేన ప్రవిశేచ్చాపి నర్తకీ. 283

గాయకులు ఆసారితమును మరల ప్రయోగించగా, వెనుక చెప్పబడిన విధానమును అనుసరించి నర్తకి రంగమండపమును ప్రవేశించవలయును.

గీతకార్థం త్వభినయే ద్ద్వితీయాసారితస్యతు
తదేవచ పున ర్వస్తు భూయో నృత్తేన దర్శయేత్. 284
ఆసారితే సమాప్తేతు నిష్క్రామే న్నర్తకీ తతః
పూర్వవ త్ప్రవిశంత్యన్యాః ప్రయోగః స్యా త్స ఏవహి. 285

అప్పుడు నర్తకి ఆసారితమై తాలవిశేషసంబంధియగు గీతకములోని అర్థమును అభినయించవలెను. లయాంతరాసారితమైన అదే వస్తువును మరల పూర్వప్రవిష్టయగు రెండవనర్తకి కేవలాంగహారాత్మకాభినయముతో ప్రదర్శింపవలెను. ఆసారితప్రయోగానంతరము ఈ ఇద్దరును వెనుకకు పోవలెను. ఇట్లు రెండు ఆసారితములుకాగలవు. ఆతర్వాత మిగిలిన నర్తకురాండ్రు వెనుకటివలెనే ప్రవేశించి ఉపోహనాది కృత్యమును నెరవేర్పవలెను.

ఏవం పదేపదే కార్యో విధి రాసారితస్యతు
భాండవాద్యే కృతేచైవ తథా గానకృతేఽపిచ. 286

ఒకేఒక ఆసారితమును ప్రయోగించినచో ప్రయోగ వైచిత్ర్య క్రమమిా క్రిందివిధముగానుండును. ఒకేఒక ఆసారితమును యోజించినచో నందలి ముఖ, ప్రతిముఖ, శరీర, సంహరణ లక్షణములగు పదములకు, వర్ధమానకమువలె నాల్గపసరణములతో, భాండవాద్యక్రియ గీతిక్రియలు తోడురాగా ప్రయోగించవలెను. దీనినే క్రిందిశ్లోకమున వివరించుచున్నాడు.

ఏకంతు ప్రథమం యుంజ్యా ద్ద్వే ద్వితీయం తథైవచ
త్రీన్ వస్తు తృతీయంతు చతుస్తు చతుర్థకమ్. 287

వస్తువనగా అంగము, నాల్గంగములను నాల్గుతడవలు నృత్తముతో నర్తకురాండ్రు యోజనచేయవలెను. ఆసారితము సభిన్యక్తకముచేయు ప్రయోగము కండికల దశపరివర్తనముతో జరుగును.

విశాలా, సంగతా, సునందా, సుముఖీ, అను నాల్గు ఖండికలను ముందు చెప్పనున్నాడు. ఈఖండికలు క్రమముగా తొమ్మిది, ఎనిమిది, పదునారు, ముప్పదిరెండు కళాత్మకములు. విశాలననుసరించి సంగత, సునందాసంగతలు, సుముఖీసునందాసంగతలు అనుక్రమమున దశపరివర్తములు రాగలవు. విశాలాది పరివర్తత్రయమున సంగతములగు పరివర్తముల కుభయత్ర సంబంధముండుటచే సప్తదశ కలాత్మకమును వ్యక్తముచేయగా కనిష్ఠలయాంతరిత స్థానము రాగలదు. తర్వాత సునందాది పరివర్తత్రయమున ముప్పదిరెండుకళలకు మధ్యమాసారిత స్థానమువచ్చును. ఆపై సుముఖ్యాది చతుష్టయమున అరువదినాలుగు కళలకు జ్యేష్ఠాసారిత స్థానమువచ్చును. ఈరీతిగా ఆసారితమున పదములయందు, స్థానములయందు, ఖండికాదిపరివర్తములలో కలుగు నాలుగు అపసారకములను నర్తకి ప్రయోగించగలదు.

పిండీనాం విధయశ్చైవ చత్వారః సంప్రకీర్తితాః
పిండీశృంఖలికాచైవ లతాబంధోఽథ భేద్యకః. 288
పిండీబంధస్తు పిండత్వాద్గుల్మ శృంఖలికో భవేత్
జాలోపనద్ధాచ లతా స నృత్తో భేద్యకః స్మృతః. 289

ఆసారితములయందు పిండీబంధప్రకారములను ప్రయోగించవలెనని చెప్పబడినది. ఈప్రకారముల నిచట నిర్వచించుచున్నాడు.

పిండీబంధప్రకారములు నాల్గువిధములు. పిండీ, శృంఖలికా, లతాబంధము, భేద్యకము అని వీనిపేరులు. విశేషాంతరహృద్యము, ఏకప్రయోజ్యమునైన పిండీ బంధరూపము మొదటిది. నర్తకీ యోగ్యమై పరస్పరసంబంధముగలిగి, ఏకనాళానుబద్ధమగు కమలయుగలమువలె విజాతీయమైగాని హంసవదన పరిగృహీతనాళ నలినమువలెగాని యుండి, పిండీబంధ ద్వయప్రకార సజాతీయమై, గుల్మశృంఖలికాయని పిలువబడునది రెండవది. ఇది ఇద్దరు నర్తకీరాండ్రచే ప్రయోగింపబడునది.

జాలమునవలె వైచిత్ర్యముకలిగి వెనుకటిదానివలె సజాతీయ విజాతీయాత్మకముగానుండి, ముగ్గురచే ప్రయోగింపబడునది లతాబంధమను పిండీబంధము. నలుగురిచే ప్రయోగింపబడునది భేద్యకము. ఈనాల్గవ పిండీబంధము వెనుకటి మూడింటి నృత్తప్రయోగములతో అన్వితమైనది.

పిండీబంధః కనిష్ఠేతు శృంఖలాతు లయాంతరే
మధ్యమేచ లతాబంధే జ్యేష్ఠే చైవాథ భేద్యకః. 290
పిండీనాం వివిధా యోని ర్యంత్రం భద్రాసనం తథా
శిక్షాయోగ స్తథాచైవ ప్రయోక్తవ్యః ప్రయోక్తృభిః. 291

కనిష్ఠాసారితమున పిండీబంధమును, లయాంతరమును శృంఖలమును, మధ్యమమున లతాబంధమున, జ్యేష్ఠమున భేద్యకమును ప్రయోగించవలెను.

ఆధారాది భేదముల ననుసరించి పిండీబంధములు నిష్పన్నము లగుచున్నవి. పృథగ్భూతాంగముల కేరీతిగా అనుసంధి కలుగుచున్నదో అట్లే భూమి దేహాకాశాద్యాధారఖండలకాద్యను సంధానము కలిగినచో దానిని యంత్రమందురు. తద్ద్వారా మిశ్రభేదములు రాగలవు. భ్రామర్యాదులయందు కన్పించుటచే స్ఫుటమగు స్థానము సంక్రమించును. దీనిని భద్రాసన

మంటురు. ఈ రెంటితోను ఆధారాంగభేదము చెప్పబడినది. ప్రయోక్తృ ప్రయోగ భేదమును వెనుకనే చెప్పబడినను మరల చెప్పుచున్నాడు.

కరణాంగహార విశేషములలో అంగవిక్షేప వైచిత్ర్యాభ్యాసమును శిక్షాయోగమందురు. ఇది సాధకతమమగు భేదము.

“పిండీనాం వివిధా యోనిః” అని పిండీబంధములకు వివిధకారణములు కలవని చెప్పుచు “వివిధ” శబ్దమును ప్రయోగించుటచే తద్వ్యాసంగేణ పూర్వక భేదానంత్యము సూచించినాడు.

ఈ సమస్త పిండీబంధ ప్రకారము లిచట ఉపయోగపడునా లేదా అను ఆశంకకు “తథా చైవ ప్రయోక్తవ్యాః” అని సమాధానము చెప్పుచున్నాడు. సమస్త ప్రకారములచేత పిండీశృంఖలికాదిబంధములను యోజించవలెను. ఈవిధముగా గీతకాంగ వాద్య నర్తకీ పిండీబంధాదికము వలన నృత్త నాట్యములకు భేదము లేదని సూచింపబడినది.

ఒకనర్తకి మొదట ప్రథమాసారితమును అభినయించును. తర్వాత రెండవనర్తకి ద్వితీయాసారితము నభినయించుచుండగా నదే సమయమున మొదటినర్తకి కేవలము అంగహారము ప్రయోగించును. ఇట్లు మూడవనర్తకి తృతీయాసారితము నభినయించుచుండగా మొదటి ఇద్దరు అంగహారము ప్రయోగింతురు. అప్పుడు నాల్గవనర్తకి చతుర్థాసారితము నభినయించువేళ మొదటిముగ్గురు అంగహారమును ప్రయోగింతురు.

ఏవం ప్రయోగః కర్తవ్యో వర్ధమానే తపోధనాః
గీతానాం ఛందకానాంచ భూయో వక్ష్యామ్యహం విధిమ్. 292

వర్ధమానక ప్రయోగము ఈరీతిగా చేయవలెను. ఇక గీతవిధిని, ఛందకవిధిని చెప్పబోవుచున్నాడు. ఆసారితాది పర్యంత ప్రయోజ్యములగు ఛందకముల లక్షణము చెప్పబడనున్నది. తాలాధ్యాయమున వర్ధమానా సారితక గీతకపాణికాంతమున ఛందకప్రయోగము, చతుష్పదా ప్రయోగము రాగలవు. డోంబికానర్తకీ లయ చరణాది రూపమున ప్రసిద్ధములై ఛందకములు నృత్తతాలాత్మకములు. వీటిని గీతములై తర్వాత యోజించవలెను.

యాని వస్తూని మునయః సంతి చాంగకృతాని తు
గీతాని తేషాం వక్ష్యామి ప్రయోగం నృత్తవాద్యయోః. 293

ఖండలకాది వస్తువులు, స్వల్పములైన అంగములు, మద్రకము అపరాంతకము ప్రకరీఅను వస్తునిబద్ధములగు మూడుగీతకములు కలవు. నృత్తవాద్యసహితముగా ప్రయోగముచెప్పి వీటితో ఉల్లోప్యకము, రోవిందకము, ఓవేణకము, ఉత్తరము అను నాల్గంగములు వివరింపబడగలవు.

తత్రావతరణం కార్యం నర్తక్యాః సర్వభాండికమ్
క్షేప ప్రతిక్షేపకృతం తంత్రీగాన సమన్వితమ్. 294

గీతకములలో ప్రథమ వస్త్వాది యందలి ఉపోహనములు క్షేపము లనబడును. ద్వితీయ వస్త్వాదియందలి ప్రత్యుపోహనములను ప్రతిక్షేపములందురు. అంతర్భూతములై, వేరుగానున్న తాలాత్మక గీతశేషరూపములు క్షేపప్రతిక్షేపములని ఇతరులు వ్యాఖ్యానించినారు. ఈ క్షేప ప్రతిక్షేపములను తంత్రీ గానయుక్తములుగా ప్రయోగించి, భాండవాద్య సహితముగా నర్తకి

యొక్క అవతరణమును చూపవలెను. అనగా పుష్కరాధ్యాయమున చెప్పబడు ప్రవిరల చల దంగులిదల అభిహన్యమాన మగు ఆంగిక ప్రాధాన్యముగా నర్తకి రంగమున అవతరించవలెను.

ఇచట వస్తువనను అంగమని అర్థము. ప్రథమవస్తువుచే ఆక్షిప్తకమును, ఉపోహనమును ప్రయోగించి నర్తకిని ప్రవేశపెట్టవలెను. ద్వితీయవస్తువుచే ప్రత్యుపోహనమును, పదయోజనను తంత్రీగానాన్వితముగా చేయగా క్షేప ప్రతిక్షేపములు సనిపాతయుతములు కాగలవు. ఇట్టి నర్తకీ అవతరణమున సర్వభాండ వాద్యావిర్భావ ముండగలదు.

> ప్రథమం త్వభినేయం స్యాద్గీతకే సర్వవస్తుకమ్
> తదేవచ పునర్వస్తు నృత్తేనాపి ప్రదర్శయేత్. 295

మొట్టమొదట గీతముతో సర్వము నభినయించవలెను. తర్వాత నదే వస్తువును నృత్తముతో ప్రయోగించవలెను.

> యో విధిః పూర్వముక్తస్తు నృత్తాభినయ వాదితే
> ఆసారితవిధౌ స స్యాద్గీతానాం వస్తుకేష్వపి. 296
> ఏవం వస్తు నిబద్ధానాం గీతనాంచ విధిః స్మృతః
> శృణుతాంగ నిబద్ధానాం గీతానామపి లక్షణమ్. 297

నృత్తముతో గీతము నెట్లు ప్రయోగించవలెనో ఇచట చెప్పుచున్నాడు.

నృత్తాభినయ వాదిత్రముల విషయమున నేయేవిధులు పూర్వము విధించబడినవో, వాటి నన్నింటిని ఇచటను అనువృత్తము చేసికొనవలెను. ఆసారితవిధియందు చెప్పబడినప్రకారమే ఇచట గూడ గ్రహించవలెను. సంఖ్యా నియమపూర్వకముగా నర్తకీస్థితితో నృత్తప్రయోగము ఆసారిత మున చెప్పబడినది. విశుద్ధకరణ జాతియందలి వాద్యప్రయోగము నర్తకీ ప్రవేశానంతరము చెప్ప బడినది. ఈవిధుల నిచటగూడ వర్తింపజేయవలెనని భావము.

ఈవిధముగా వస్తు నిబంధాత్మకములగు గీతములనుగూర్చిన విధి చెప్పబడినది. ఇక అంగనిబద్ధములగు గీతముల లక్షణమును నిర్వచింప బోవుచున్నాడు.

> య ఏవ వస్తుషు విధి ర్నృత్తాభినయవాదితే
> తమేవాంగనిబద్ధేషు ఛందకేష్వపి యోజయేత్. 298

నృత్తాభినయవాదిత్రముల విషయమున చెప్పబడినవిధిని అంగనిబద్ధములైన ఛందకములలో గూడ యోజించవలెను.

> వాద్యం గుర్వక్షరకృతం తథాల్పాక్షరమేవచ
> ముఖే సోపోహనే కుర్యా ద్వర్ణానాం విప్రకర్షతః. 299

ప్రయత్న శీఘ్రముగా గుర్వక్షరములలో అనేకములను తాలమున ప్రయోగించవచ్చును. ఉత్సాహసమయమున త్వరత్వరగా గుర్వక్షరములతో తాలమునువేయ వీలున్నది. ఇట్లే అల్పా క్షరములనుగూడ వాద్యమున యోజించవచ్చును. గుర్వక్షరములతో ఏకకల, లఘువులతో అర్థకల రాగలవు. ముఖమనబడు ఉపవహాంగమున, వస్తునిబంధకమగు ఉపోహనాంగమున వర్ణ ముల విప్రకర్షత ననుసరించి వాద్యవిధిని చూపవలెను.

యథా గీతివశాదంగం భూయోభూయో నివర్తతే
తత్రాద్య మభినేయం స్యా చ్ఛేషం నృత్తేన యోజయేత్. 300

ముఖ్యాద్యంగములు మాటిమాటికి ఆవృత్తములు కాగా గీతిక సామర్థ్యము ననుసరించి మాటిమాటికి అంగనివృత్తి చెప్పవలెను. మాగధ్యాది గీతములు నాలుగు విధములు. ఈ గీతముల విధిక్రమమును తాలాధ్యాయమున చూడనగును. అంగనివృత్తియైన తర్వాత మొదటి ఆవర్తము నభినయించవలెను. ఆవర్తాంతరములు శుద్ధనృత్తమున ప్రయోగింపబడవలసినవి. కాగా కేవలము వస్త్వంగాది సమాప్తియందు నృత్తమును చేయవలెనను వ్యాఖ్యానము అసమంజసము.

ఆవర్తమానమగు గీత సామర్థ్యముచే శాఖాచారీ ప్రయోగాత్మకమగు అంగము ఆవర్తితము కాగా వాద్యప్రాధాన్యముగా నృత్తము యోజించబడవలెను. యథాసంభవముగా వాద్య వైచిత్ర్యమును ప్రదర్శించవలెనని భావము. వెనుక ఈ వాద్య వైచిత్రము కావ్యార్థముచే నియంత్రితమైనది. ఇప్పుడు వాద్య వైచిత్ర్యము సంకుచితము కానక్కరలేదు.

త్రిపాణిలయ సంయుక్తం తత్ర వాద్యం ప్రయోజయేత్
యథా లయ స్తథావాద్యం కర్తవ్యమిహ వాదకైః. 301

సమపాణి, ఉపరిపాణి, అర్ధపాణి అని మూడువిధములుగా పాణి విభేదము కలదు. వీటి ద్వారా తాలాభివ్యక్తి కలుగుచున్నది. ద్రుతాది భేదములతో లయకూడ వివిధములు. త్రిపాణి, త్రిలయ సంయుక్తముగా వాద్యమును ప్రయోగించవలెను. లయానుగుణ్యముగా వాద్యమును వివేచకులగు వాదకులు యోజించవలెను. ప్రథమావర్తమున కావ్యార్థాభినయ సామర్థ్యమును ప్రయోగించు అంగమున కేలయ ఉచితమగునో తదనుసారియగు వాద్యమును యోజించవలెను.

ఏవ మేష విధిః కార్యో గీతే ష్వాసారి తేష్వపి
దేవ స్తుత్యాశ్రయం హ్యేతత్

భగవానుడగు మహేశ్వరుని స్తుతినిమిత్తమై, తత్ పరితోషణ ప్రయోజనము కలిగిన నృత్తమగుటచే, గీతములవిషయమున, ఆసారితవిషయమున పైనచెప్పిన విధుల నతిక్రమించరాదు. గీతకాసారిత ఛందకములనుగూర్చిన విధులిట పరామర్శింపబడుచున్నవి. పరిమిత శరీరముకలిగిన దగుటచే పాణి తాండవభాజనము కాజాలదు గనుక నిట చెప్పబడుటలేదు. లాస్యప్రధానమగు సుకుమార పూర్వరంగమున తత్సత్తావైదగ్ధ్యార్థము చెప్పబడు లాస్యస్వరూపముద్వారా పాణికా విషయమును నిశ్చయింపవలెను.

గీతకశబ్దముతో ఛందకముకూడ గతార్థమగును. స్వతంత్రమగు ఆసారితమునగీతకమున్నది.
సుకుమారం నిబోధత. 302

స్త్రీ పుంసయోస్తు సంలాపో యస్తు కామసముద్భవః
తత్ జ్ఞేయం సుకుమారంహి శృంగార రస సంభవమ్. 303

తాండవవిధియైన తర్వాత సుకుమార ప్రయోగమునుగూర్చి చెప్పుచున్నాడు. కామము ద్వారా జన్మించి, శృంగారరససంభవమై, స్త్రీపురుష సంలాపముతో గూడినది సుకుమార

ప్రయోగము. దీనిని రంజింపజేయునట్లు యోజించుటకు ఊహాపోహబుద్ధితో నిర్మించవలెను. అంగ వృద్ధితో వర్తకీవృద్ధి మొదలుగాగల పుర్వోక్తలక్షణముల నన్నింటిని ఇచట వర్తింపజేయవలెను.

యస్యాం యస్యా మవస్థాయాం నృత్తం యోజ్యం ప్రయోక్తృభిః
తత్సర్వం సంప్రవక్ష్యామి తచ్చ మే శృణుత ద్విజాః. 304

సుకుమారకావ్యాశ్రితమైన గానన్రృత్తముల నేయేస్థలములలో ప్రయోగించవలెనో తత్స ర్వము భరతునిచే చెప్పబడ బోవుచున్నది.

అంగవస్తు నివృత్తౌతు యథా వర్ణనివృత్తిషు
తథాచా భ్యుదయస్థానే నృత్తం తజ్జ్ఞః ప్రయోజయేత్. 305

యత్తు సంద్భశ్యతే కించి ద్దంపత్యో ర్మదనాశ్రయమ్
నృత్తం తత్ర ప్రయోక్తవ్యం ప్రహర్షార్థ గుణోద్భవమ్. 306

అంగవస్తు నివృత్తియందు, గీతక్రియావిస్తారరూపములగు స్థాయ్యాది వర్ణముల నివృత్తి యందు, అభ్యుదయస్థానమున సుకుమార నృత్తమును విచక్షణుడు ప్రయోగించి, వాద్యాదివైచిత్ర్య ముతో నన్వితమగునట్లు యోజించవలెను. స్త్రీపురుషుల కామకృతసంలాప మేకావ్యమున వాచ్య త్వము గలదో అచ్చట ప్రహర్ష ప్రయోజన గుణ ముద్భవించునట్లు నృత్తమును ప్రయోగించ వలెను. కామావస్థలయందు, వాసకసజ్జాభిసారికా విషయమున నృత్తము విధించబడుచున్నది.

యత్ర సన్నిహితే కాంతే ఋతుకాలాభి దర్శనమ్
గీతకా ర్థాభిసంబద్ధం నృత్తం తత్రాపి చేష్యతే. 307
ఖండితా విప్రలబ్ధావా కలహాంతరితాపివా
యస్మి న్నంగే తు యువతి ర్ననృత్తం తత్ర యోజయేత్. 308
సఖీ ప్రవృత్తే సంలాపే తథా సన్నిహితే ప్రియే
నహి నృత్తం ప్రయోక్తవ్యం యస్యావా ప్రోషితః ప్రియః. 309
యస్మిన్నంగే ప్రసాదంతు గృహ్ణీయా న్నాయికా క్రమాత్
తతఃప్రభృతి నృత్తంతు శేషే ష్వంగేషు యోజయేత్. 310

మొదటి శ్లోకమున స్వాధీన భర్తృక యగు నాయికా విషయము చెప్పబడుచున్నది. ప్రియుని సన్నిధానమున వసంతాది ఋతువులు, చంద్రోదయాది కాలముల అవలోకనము ఉన్నచో, గీయమాన కావ్యము యొక్క అర్థము నభినయించు నృత్తమును ప్రయోగింపవలెను.

ఖండిత, విప్రలబ్ధ, కలహాంతరిత అను నాయికల నాధారముగా చేసికొని యున్న కావ్యఖండమున నృత్తమును ప్రయోగించరాదు.

ప్రియుడు సన్నిధానమున లేకున్నచో ప్రియుని విషయకమగు సల్లాప, తత్సమాగమో పాయ పర్యాలోచనాది వృత్తికమగు సఖీసంలాపమునగూడ నృత్తము పనికిరాదు. ఇది ప్రోషిత భర్తృకయగు నాయికావిషయము. విరహోత్కంఠిత విషయమునగూడ నీభావమునే గ్రహించ వలెను. వాసకసజ్జికావిషయమునగూడ నృత్తమొకచో పనికివచ్చును.

యువతి ప్రసన్నహృదయమును ఎప్పుడు పొందగలదో అప్పుడు నృత్తము ప్రయోగింపబడును. తన మనోవాంఛితము నెరవేరినచో నృత్త ముండును. ఇచట వలనావర్తనాది రూపమగు నృత్తమే విధించబడినది. ఇట్టి నృత్తమున గీతకాంతమున ఛందకమును, పాణికాంతమున లాస్యగాన స్వీకారిణియగు చతుష్పదను ప్రయోగించవలెను.

దేవస్తుత్యాశ్రయకృతం యదంగంతు భవేదథ
మాహేశ్వరై రంగహారై రుద్ధతై స్తత్ప్రయోజయేత్. 311
యత్తు శృంగార సంబద్ధం గానం స్త్రీ పురుషాశ్రయమ్
దేవీకృతై రంగహారై ర్లలితై స్తత్ప్రయోజయేత్. 312

నృత్తము రెండురకములు. ఒకటి ఉద్ధతరూపమగు తాండవము. రెండవది సుకుమార రూపమగు లాస్యము. దేవస్తుతి నాశ్రయించుకొనిన కావ్యభాగము నభినయించుచో మహేశ్వర కృతములగు ఉద్ధతాంగహారములతో నృత్తమును ప్రయోగింపవలెను. స్త్రీ పురుషాశ్రయమై శృంగార రసాన్వితమైన గీతికాభినయమున పార్వతీ కృతములగు లలితాంగహారములతో నృత్తమును యోజించవలెను. విద్యుద్భ్రాంత, గరుడప్లుతకాది ప్రధానములగు అంగహారము లుద్ధతములు. తలపుష్పపుట, లీన, నితంబాదులచే నారబ్ధములగు అంగహారములు లలితములు.

చతుష్పదా నర్కుటకే ఖంజకే పరిగీతకే
విధానం సంప్రవక్ష్యామి భాండనృత్తవిధిం ప్రతి. 313
ఖంజ నర్కుట సంయుక్తా భవేద్యాతు చతుష్పదా
పాదాంతే సన్నిపాతేతు తస్యాం భాండగ్రహో భవేత్. 314

లాస్యగానములను స్వీకరించి చతుష్పదలో నృత్తవిధిచెప్పి, ఇక భాండవిధిని చెప్పవలెను.
నాలుగు పాదములతో ధ్రువాగీతము వచ్చుచున్నది. పాదాదియందు శుష్కాక్షరము లుండగా పాడబడు దానిని గేయపదమందురు. లేనిచో నీధ్రువాగీతము సార్థకపదములతో నుండ వచ్చును. అట్టిచో వర్ణవృత్త కృతములగు పాదములతోగాని మాత్రావృత్త కృతమగు సమా, అర్థసమా, విషమా అను ఆకృతితోగాని ఉండగలదు. అట్టి పాదములు ప్రధానముగా ఖంజ, నర్కుటక వృత్తములతో యోజించబడుచున్నవి. త్రినృత్తకము, శుష్కగీతము, పరిగీతమనబడును.
ఖంజ, నర్కుటక, పరిగీతములను మూడు ప్రకారములయందును భాండవాద్య మనబడు పుష్కరవాద్యముయొక్క విధిని చెప్పబోవుచున్నాము. ఖంజకజాతిలో, నర్కుటకజాతిలో నిర్మింపబడు నాల్గుపదములుగల ధ్రువాగీతములోని మొదటిపాదముయొక్క ఉపాంత్యకల నాశ్రయించుకొని గానమున్నది. హస్తద్వయసమాయోగమున కలుగు శబ్దముచే పరిచ్ఛేద్యమగు సన్నిపాత కళ నాలాపించువేళ భాండ వాద్యము నారంభించవలెను.

యా ధ్రువా ఛందసా యుక్తా సమపాదా సమాక్షరా
తస్యాః పాదావసానేతు ప్రదేశేన్యాగ్రహో భవేత్. 315

నాలుగు సమపాదములు గలది ధ్రువాగీతము. ఇది యుక్తజాతిగత వర్ణ వృత్తముతో యోజితమైనది. ఆజాతిలో సమవృత్తమయిన ధ్రువాగీత ప్రథమపాదము పరిసమాప్తముకాగా, ద్వితీయపాదము గ్రహించు సమయమున మూపుడుత్రేలితో ఉపలక్షితమై భాండవాద్యప్రయోగ

మగును. చతుష్పదకు ద్వికలాత్మక మార్గము చెప్పి, ద్వితీయపాదమున తర్జనిచే ప్రయోగమగు నిష్క్రామకళయనబడు సప్తమి విధించబడినది. మిగిలినవి తాళాధ్యాయమున గాంచనగును.

కృత్త్వైకం పరివర్తంతు గానస్యాభినయస్యచ
పునః పాదనివృత్తింతు భాండవాద్యై ర్నియోజయేత్. 316

పూర్వము పాడిన శుద్ధవిభాగమగు గీతమును పరావర్తింపజేసి, భాండవాద్యముతో నన్వితమగునట్లుగా అభినయమును చేయింపవలెను. ఇచ్చట పాదశబ్దము నుపలక్షణముగా గ్రహింపవలెను. ఎంతభాగము భాండవాద్యముతో ముందు నియోజించబడి అభినీతమగుటలేదో, దానితోనే పరావర్తన మనబడు నివృత్తిని చెప్పవలెనని భావము.

అంగవస్తు నివృత్తౌతు వర్ణాంతర నివృత్తిషు
తథోపస్థాపనేచైవ భాండవాద్యం ప్రయోజయేత్. 317

భాండవాద్యవిశేషాభిధానవ్యాజమున ధ్రువాగీతమున నృత్తస్థానము నిట చూపుచున్నాడు. ఒక అంగమునకుగాని, వస్తువునకుగాని, సర్వధ్రువా శరీరముయొక్క స్థాయ్యాది విశేషమునకుగాని ప్రతిశాఖాన్యాయముతో పరావర్తనమును చెప్పి ఉపస్థాపనమునగూడ భాండవాద్యమును ప్రయోగించవలెను. తదనుసారము నృత్తాంగహారయోజనను గావింపవలెననిభావము.

యేఽపి చాంతరమార్గాస్తు తంత్రీ వాక్కరణైః కృతాః
తేషు సూచీ ప్రయోక్తవ్యా భాండేనసహ తాండవే. 318

శుష్కాక్షరయగు చతుష్పదా గీతమునుగురించి ఇక చెప్పవలసియున్నది. శుష్కాక్షరను మొట్టమొదటనే ప్రయోగింతురుగనుక దీనిని నిర్వచించుచున్నాడు.

పరస్పర వైలక్షణ్యముగల అక్షరములతో, అర్థప్రాధాన్యములేక, కేవలము స్వరముతో ఉపలక్షిత మగునది శుష్కాక్షరయగు ధ్రువ. ఇది అంతరమార్గములోనిది. ఇందలిధ్వనులు నిరర్థకములయ్యును తంత్రీక్రియతోను, వాక్క్రియతోను యోజించబడుచున్నవి.

ఈ ధ్రువాగీతమున లాస్యాంగగత కావ్యార్థానుసారియగు హస్తాభినయములేదు గనుక దీనిని సాత్త్వికాంగవలనాది మాత్రమున సూచీతో అభినయింపవలెను. కాగా నిచ్చటగూడ తాలగాన సూచ్యాభినయనముకలదు.

వర్ధమానకప్రయోగముకాని గీతకప్రయోగముకాని ఛందకప్రయోగముతోను, చతుష్పదా ప్రయోగముతోను పరిపూర్ణమగుచున్నది.

మహేశ్వరస్య చరితం య ఇదం సంప్రయోజయేత్
సర్వపాప విశుద్ధాత్మా శివలోకం స గచ్ఛతి. 319

పైనచెప్పబడిన ప్రయోగ ప్రక్రియకు పూర్వరంగమున ప్రయోజనముకలదు. అంతేగాక స్వతంత్రముగా దీనిని ప్రయోగించవచ్చునని భరతుడీ అధ్యాయమును ఉపసంహరించుచున్నాడు.

మహేశ్వరునిచే చేష్టారూపమై కరణాంగహార రేచక సంవలితమైన ఈ ప్రయోగమును ప్రదర్శించినవాడు సమస్తపాపములనుంచి విముక్తుడై, శుద్ధాత్ముడై, శివలోకమును పొందగలడు. ఈ నాట్యప్రయోక్త, అర్ధపతి, సామాజికులు పాపమునుంచి విముక్తులుకాగలరని ఫలశ్రుతి.

ఏవమేష విధిః సృష్ట స్తాండవస్య ప్రయోక్తృభిః
భూయః కిం కథ్యతా మన్య న్నాట్యవేద విధింప్రతి. 320

ఇతిశ్రీ భారతీయే నాట్యశాస్త్రే తాండవలక్షణంనామ చతుర్థోఽధ్యాయః.

తాండవప్రయోగమును ప్రదర్శించువారిచే నీవిధి నిర్మింపబడినది. ఇక నాట్యవేద విధిని గూర్చి తెలిసికొనవలసిన దేమిగలదు? అని భరతుడు మునులను ప్రశ్నించుచు తర్వాతి అధ్యాయమును ప్రస్తావించుచున్నాడు.

సామాజికులకువలె నాట్యప్రయోక్తకు గూడ సంభవించు తన్మయీభావమునకై నాట్య సంస్కారము నపేక్షించి అభినయవిధి నిర్మింపబడినది. సాక్షాత్కారకల్ప నాట్యరూపత్వ మిచట లేదు. చతుర్విధాభినయ యోగము, రసభావప్రాధాన్యము, ఇచట కన్పించకపోవుటచే నీ ప్రయోగమునకు నాట్యత్వము సిద్ధించుటలేదు. గీతవాద్య నృత్తములకు యథేష్టముగా ప్రాధాన్యము నర్తకీ స్మృతి ననుసరించి కావ్యవస్తు నిర్మాణము కన్పించుటచే నీ ప్రయోగము నాట్యప్రస్తావనా ప్రాణప్రతిబింబాత్మక మగుచున్నది. గీతాది ప్రాధాన్యము ననుసరించి, కులకాచ్ఛేద్యాత్మకమగు కావ్యము గీత్యాధారము కాగా, పిండీబంధప్రకారమున వైచిత్ర్యముతో నృత్తమును మాత్రమే గావింపవలెను. కాగా నాట్యముకన్న నృత్తము కొంతవరకు విలక్షణమైనదే యగుచున్నదని తౌతభట్టు సిద్ధాంతించినాడు. తుల్యానుకారము నృత్తినాట్యములలో నున్నను రసభావదృష్టి హస్త శిరస్సుల నాశ్రయించుకొని ఇవి భిన్నము లగుచున్నవని హర్షుడు వార్తికమున చెప్పి యున్నాడు. శిక్షకు తగిన స్వేచ్ఛతో నాట్యాంగముగా నున్న నృత్తమున కభ్యాసఫలమును మాత్రమే భట్టయంత్రుడు విధించినాడు. వివాహాది మంగళప్రద కాలములయందే నృత్తమును ప్రయోగించవలెనని లొల్లటభట్టుయొక్క సిద్ధాంతము.

కాని దశరూపక భేదమువలె లాస్య తాండవప్రయోగములు నాట్యభేదములని నిశ్చయించి ఉభయత్ర పూర్ణానుకార రూపము కన్పించుటచే నృత్తము నాట్యమునకన్న విలక్షణమైనదని చెప్ప వీలులేదు. అశ్వత్థామ ప్రవేశించుచు సూచీవిద్ధము, ఊర్ధ్వజానువు మొదలను కరణాంగహారముల నభినయించును. పురూరవసుడు అలపల్లవసూచీతో వచ్చును. గరుడుడు గరుడప్లుతకమున, రావణుని పుష్కరవిమానము వైశాఖరేచితమున, వత్సరాజుయొక్క అగ్నిసంభ్రమము అతిక్రాంతకరణమున, జటాయు గమనము గృధ్రావలీనకమునగాని ఏలకాక్రీడితమునగాని జరుగును. నృత్తనాట్యములకు వైలక్షణ్యములేదని భావము.

శ్రీ భరతముని ప్రణీతమగు భారతీయ నాట్యశాస్త్రమున ఆంధ్రభారతియందు
తాండవలక్షణమను నాల్గవ అధ్యాయము.



# పంచమోఽధ్యాయః

భరతస్య వచః శ్రుత్వా నాట్యసంతాన కారణమ్
పునరేవా బ్రువన్ వాక్య మృషయో హృష్టమానసాః. 1

"యథా నాట్యస్య జన్మేదం జర్జరస్యచ సంభవః
విఘ్నానాం శమనం చైవ దేవతానాంచ పూజనమ్. 2

తదస్మాభిః శ్రుతం సర్వం గృహీత్వా చావధారితమ్
నిఖిలేన యథాతత్త్వ మిచ్ఛామో వేదితుం పునః. 3

పూర్వరంగం మహాతేజః సర్వలక్షణ సంయుతమ్
యథా బుధ్యామహే బ్రహ్మం స్తథా వ్యాఖ్యాతు మర్హసి." 4

నాట్యోత్పత్తిని గురించి భరతుడు చెప్పిన వృత్తాంతమును విని సంతోషము నొందు మనస్సులతో మరల ఋషులీవిధముగాభరతునితో పలికిరి—"నాట్యోత్పత్తి, ధ్వజముయొక్క జననము, విఘ్నములు నివారింబడుట, రంగదైవతపూజన అను విషయములు మీరు చెప్పగా వింటిమి. ఈ విషయమంతయు చక్కగా మాచే గ్రహించబడినది, అవధరించబడినది. కాని సకల లక్షణములతో కూడిన పూర్వరంగవిధిని సాకల్యముగా వినగోరియున్నాము. అది మాకెట్లు బోధపడగలదో అట్లు మీరు చెప్పవలయునని మా కోరిక."

గ్రహణధారణపాటవము గలవాడే యోగ్యుడగు శిష్యుడు. అట్టి శిష్యుడే నూతన విషయములనుచెప్పుటకు గురువునకు ఉత్సాహము కల్గించగలడుకనుక మునులకిచ్చట గ్రహణ ధారణ పటుత్వము చెప్పబడినది. నాట్యము హృదయావేశమును కల్గించునదికావున నాట్యోత్పత్తి వినిన మునులను హృష్టమానసులనినాడు. ఈ పూర్వరంగప్రశంస నాల్గవఅధ్యాయమం దనేకపర్యాయములు కన్పించుటచేతను, పూర్వరంగవిధి ముఖ్యమగుటచేతను, మునులీ యధ్యాయమున పూర్వరంగమును గురించి ప్రశ్నించ నుద్యుక్తులైనారు.

తేషాంతు వచనం శ్రుత్వా మునీనాం భరతోమునిః
ప్రత్యువాచ పున ర్వాక్యం పూర్వరంగవిధింప్రతి. 5

మునుల వాక్యమును విని భరతముని పూర్వరంగవిధినిగురించి ఇట్లు చెప్పసాగెను.

పూర్వరంగం మహాభాగా గదతో మే నిబోధత
పాదభాగాః కలాశ్చైవ పరివర్తా స్తథైవచ. 6

పూర్వరంగనిరూపణ నిక శ్రద్ధతో వినవలసినది. పూర్వరంగమున పాదభాగములు, కళలు, పరివర్తములు కలవు.

బహిర్యవనికాంగములే పూర్వరంగమున వచ్చునవి: ఉత్థాపనీ ధ్రువా మొదలగు గీతకములు, ద్వికళ చంచత్పుట చాచత్పుట తాళములు నిట గలవు. ద్వికళ [illegible] తాళములలోని చంచత్పుటాదుల సంయోగముతో సంబంధమువచ్చు[illegible] శబ్దముచే

అక్షరమార్గము గ్రహించబడుచున్నది. తద్ద్వారా గీతక వర్ధమానాదిగతమగు గేయరూపము రాగలదు. కళాశబ్దమువలన సప్తవిధములగు తాళకళలు కూడ రాగలవు. పరివర్తశబ్దముచే సమస్తమైన తాళములయొక్క ఇతికర్తవ్యత స్వీకరింపబడుచున్నది.

ఈ శ్లోకములో "చ, ఏవ, తథా, ఏవ, చ" అను ఐదుశబ్దములు కలవు. మొదటి చకారముచే తంత్రీ మొదలగునవి, మొదటి ఏవకారముచే నాట్యప్రయోగము, తథా శబ్దముచే అంగాంగిభావప్రయోగము, రెండవ ఏవకారముచే నాట్యాంగత, రెండవ చకారముచే పాఠ్యాది నృత్తము స్వీకరించబడుచున్నవి. ఇవన్నియు పూర్వరంగమున కలవని భావము. గీత, తాల, వాద్య, నృత్త, పాఠ్యములెచట నాట్యాంగములుగా ప్రయోగింపబడునో అది పూర్వరంగమగును.

కావున 'పూర్వరంగ' మనగా రంగముయొక్క పూర్వభాగమని అర్థము చెప్పకొనరాదు. ఇది మండపమందలి పూర్వభాగముకాదు, నాట్యమునకు పూర్వభాగముకూడ గాదు. 'పూర్వోరంగః' అని చెప్పికొనవలెను. వైచిత్ర్యకారిగా నృత్తముకూడ ఇచట ప్రవేశించుచున్నది. ధూప విలేపనాదులవలె పూర్వరంగవిధి కూడ దేవతాపరితోషణమే ఫలము గలది. రంగస్థలము నాట్యరంగము కాకముందు పూర్వరంగమగును. ఆ పూర్వరంగమున చేయవలసిన క్రియాకలాపము నీ అధ్యాయమున చెప్పచున్నాడు.

యస్మాద్రంగప్రయోగోఽయం పూర్వమేవ ప్రయుజ్యతే
తస్మాదయం పూర్వరంగో విజ్ఞేయో ద్విజసత్తమాః. 7

నాట్యప్రయోగమునకు ముందే చేయబడు ప్రయోగవిశేషమును పూర్వరంగవిధానమని తెలిసికొనవలయును.

అస్యాంగానితు కార్యాణి యథావ దనుపూర్వశః
తంత్రీ భాండసమాయోగైః పాఠ్యయోగకృతైస్తథా. 8
ప్రత్యాహారో ఽవతరణం తథా హ్యారంభ ఏవచ
ఆశ్రావణా వక్త్రపాణి స్తథాచ పరిఘట్టనా. 9
సంఘోటనా తతః కార్యా మార్గాసారితమేవచ
జ్యేష్ఠ మధ్య కనిష్ఠాని తథైవాసారితానిచ. 10
ఏతానితు బహిర్గీతా న్యంత ర్యవనికాగతైః
ప్రయోక్తృభిః ప్రయోజ్యాని తంత్రీ భాండకృతానిచ. 11

పూర్వరంగవిధిలో వరుసగా చేయవలసినవి, విధ్యంగములు కొన్ని గలవు. పాఠ్యము, తంత్రీభాండములతోను వీనిని నిర్వర్తించవలెను. ప్రత్యాహారము, అవతరణము, ఆరంభము, ఆశ్రావణము, వక్త్రపాణి, పరిఘట్టన, సంఘోటన, మార్గాసారితము, ఆసారితములు అను తొమ్మిదింటిని అంతర్యవనికాంగములుగా ప్రయోగించవలెను. రంగపీఠమునకు రంగశిరము నకు మధ్య [illegible] యవనిక యుందురు. యవనిక అనగా తెర. తెరలోపలకు వచ్చిన [illegible] ప్రత్యాహారాదులు తంత్రీభాండసమాయుక్తములుగా ప్రయోగింపబడును. ప్రత్యాహారాదులను మున్ముందు నిర్వచించుచున్నాడు.

తతః సర్వైస్తు కుతపైః సంయుక్తానీహ కారయేత్
విఘట్య వై యవనికాం నృత్త పాఠ్య కృతానితు. 12

గీతానాం మద్రకాదీనాం యోజ్య మేకంతు గీతకమ్
వర్ధమాన మథాపీహ తాండవం యత్ర యుజ్యతే. 13

తత శ్చోత్థాపనం కార్యం పరివ ర్తనమేవచ
నాందీ శుష్కావకృష్టాచ రంగద్వారం తథైవచ: 14

చారీచైవ తతః కార్యా మహాచారీ తథైవచ
త్రికం ప్రరోచనాచాపి పూర్వరంగే భవంతిహి. 15

ఏతా న్యంగాని కార్యాణి పూర్వరంగవిధౌతుచ
ఏతేషాం లక్షణ మహం వ్యాఖ్యాస్యా మ్యనుపూర్వశః. 16

అంతర్యవనికాంగములను ప్రయోగించిన తర్వాత వాద్యవిశేషముల నన్నిటిని ఒకచో సమావేశపరుపవలెను. ఆపై తెరను తొలగించవలెను. నృత్తముతోను, పాఠ్యముతోను మద్రకాదిగీతములలో నొక గీతమును ప్రయోగించవలెను. తాండవనృత్యము చేయుచో వర్ధమానకగీతముకూడ యుక్తమే యగుచున్నది. ఆ తర్వాత ఉత్థాపనము, పరివర్తనము, అర్థరహితమగు అవకృష్టానాందులను ప్రయోగించవలెను. పూర్వరంగమున చారీ, మహాచారీ, త్రికము, ప్రరోచనలు కూడా కలవు. పూర్వరంగమున నీ అంగములన్నియు కలవు. వీటి లక్షణములన్నియు వరుసగా వివరించబడుచున్నవి.

కుతపస్యతు విన్యాసః ప్రత్యాహారఇతి స్మృతః
తథావతరణం ప్రోక్తం గాయకానాం నివేశనమ్. 17

కుతపమనగా సంగీతవాద్యముల సమూహమని అర్థము. ఈ వాద్యములను, వాద్యగాండ్రను నియమసహితముగా నివేశింపజేయుటయే ప్రత్యాహారము. నేపథ్యగృహమునుండి నాట్యగృహపు తూర్పువాకిలివరకుగల ప్రదేశమునకు మధ్యగా తూర్పునకభిముఖుడై మృదంగము వాయించువాడుండును. అతనికి ఎడమప్రక్కగా పణవవాద్యగాండ్రిరువురుందురు. రంగపీఠమునకు దక్షిణదిక్కున ఉత్తరాభిముఖుడై గాయకుడు, ఇతనికి ఎదురుగా ఉత్తరదిక్కున దక్షిణాభిముఖులై గాయకురాండ్రుందురు. గాయకునకు ఎడమప్రక్కగా వైణికుడు, గాయకురాండ్ర కెడమప్రక్కగా పిల్లనగ్రోవులతో నిరువురుందురు. ఈ ఏర్పాటును కుతపవిన్యాసమందురు. శబ్దవిశేషములను పాలించునవి కుతపములు. ఇవి నాట్యభూమికకు ఉజ్జ్వలత నాపాదించునవి.

పరిగీతక్రియారంభ ఆరంభ ఇతి కీర్తితః
ఆతోద్య రంజనార్థంతు భవే దాశ్రావణావిధిః. 18

వాద్యవృత్తి విభాగార్థం వక్త్రపాణి ర్విధీయతే
తంత్ర్యోజః కరణార్థంతు భవేచ్చ పరిఘట్టనా. 19

తథా పాణివిభాగార్థం భవేత్ సంఘోటనావిధిః
తంత్రీ భాండసమాయోగా న్మార్గాసారిత మిష్యతే. 20

కలాపాత విభాగార్థం భవే దాసారితక్రియా
కీర్తనా ద్దేవతానాంచ జ్ఞేయో గీతవిధి స్తథా. 21

శారీరస్వరములకు మూలభూతమై, గీతమునకు బింబభూతమై, ఈ స్వరముల ననుసంధించుటకు చేయు ఆలాపము ఆరంభమనబడును. ఈ ఆలాపాదికమును కొలచునట్లు కన్వరచు తాళముతో సకలవాద్యముల ననుసంధించుచు, అందరకు వినబడునట్లుచేయునది ఆశ్రావణము. అనగా ఆశ్రావణము ఆతోద్యగానములను రంజింపజేయునది.

వైణవస్వరస్వరూపమును అనుసంధించుటకు దక్షిణాదివృత్తివిభాగము నాశ్రయించుకొని వచ్చునది వక్త్రపాణి. ఇది వాద్యవృత్తులను విభజించునది. వక్త్రపాణిలో ప్రారంభము చేతి వ్రేళ్లతో ప్రయోగము జరుగును. వృత్తుల విభాగమందలి శుష్కప్రయోగానుసంధానమునలన పరిఘట్టన సంభవించును. దీనిద్వారా వీణతీగెలకు దీప్తిమత్త్వము రాగలదు.

వీణావాద్యము నాశ్రయించుకొని అవనద్ధమైనదానిని అనుసంధించుటవలన ప్రహార కుంచిక యోగముతో చేయబడునది సంఘోటన. శారీరకముగా బయలుదేరి చివరకు పుష్కర వాద్యమువద్దకు వచ్చుట ఇందులో గాననగును. వీణా పుష్కరవాద్యముల సమ్మేళనమును మార్గాసారితమందురు. ప్రకృత్యాది లక్షణాదిగోచరవశమున పుష్కరవాద్యము కలియుటయే మార్గాసారితము.

కలాపాతవిభాగమునకై వచ్చునది ఆసారితము. ఆవాపాదులు కళలు. శమ్యాదులు పాతలు. ఈ రెండింటి అనుసంధానమిచ్చుట కన్పించును.

ఈ విధముగా మొదట ప్రయోగము కాగా, తదంగానుసారము బహిర్గీతవిధి కలదు. బహిర్గీతవిధిలో విశేష ధాతువాద్యములు రాగలవు.

ఇక దేవతాస్తుతిసమయమున గలవుకనుగ గీతవిధినిగురించి తెలసికొనవలెను.

అతఃపరం ప్రవక్ష్యామి వ్యుత్థాపన విధిక్రియామ్
యస్మా దుత్థాపయం త్యాదౌ ప్రయోగం నాందిపాఠకాః. 22

వందనాని ప్రకుర్వంతి తస్మాచ్చ పరివర్తనమ్

రంగమున మొట్టమొదటనే ఉత్థాపనవిధిని చేయవలెను. రంగమున నాలుగుదిక్కులు కలియదిరుగుచు లోకపాలురకు వందనముచేయుదురుగాన పరివర్తనప్రక్రియ జరుపబడవలెను.

ఆశీర్వచన సంయుక్తా నిత్యం యస్మాత్ప్రయుజ్యతే. 24
దేవ ద్విజ నృపాదీనాం తస్మాన్నాందీతి సంజ్ఞితా.

ఎల్లప్పుడు దేవబ్రాహ్మణనృపాదుల విషయమును తెలుపుచు ఆశీర్వచనముతో కూడి ప్రయోగింపబడునది నాంది యనబడును. ఉత్థాపనాదులు వివిధపాఠ్యస్థలములలో వివిధ విధములుగా ప్రయోగింపబడగలవు కాని ఏ సందర్భములోనైనను ఒకే ఒకరూపముతోనుండునది నాంది. భారతీవృత్తికి అంగముగా ఈ నాందియే ప్రరోచనగా నిర్దేశింపబడినది.

నాందీపాదానా మంతరేషు చిత్రే పూర్వరంగే వర్ధమానం ప్రయోజ్యం.
ప్రాగుక్తలక్షణమ్. అన్యేతు గీతక ప్రయోగా దనంతరం శుద్ధే చిత్రే
పూర్వరంగే వర్ధమానప్రయోగ మిచ్ఛంతి. 25

నాందీపాదములమధ్య చిత్రపూర్వరంగము నాల్గవ అధ్యాయములో నిర్వచించబడిన వర్ధమానమును ప్రయోగించవలెను. గీతకప్రయోగమైన తర్వాత శుద్ధపూర్వరంగమున, చిత్రపూర్వరంగమునకూడ వర్ధమానమును ప్రయోగించవలెనని కొందరి అభిప్రాయము.

అత్ర శుష్కాక్షరై రేవ హ్యవకృష్టా ధ్రువా యతః
తస్మా చ్ఛుష్కావకృష్టేయం జర్జరశ్లోకదర్శికా. 26

శుష్కాక్షరములనగా అర్థరహితములగు స్వరములని అర్థము. బహిర్యవనికాంగముగా నిచట అర్థరహితములగు స్వరములతో అవకృష్ట యనబడు ధ్రువాగానమును చేయవలెను. ఈ శుష్కావకృష్టయే ధ్వజమునుగూర్చి చెప్పిన శ్లోకమును చూపునది.

యస్మా దభినయ స్త్వత్ర ప్రథమం హ్యవతార్యతే
రంగద్వార మతో జ్ఞేయం వాగంగాభినయాత్మకమ్. 27

సామాజికులకెదురుగ తీసికొనిపోబడునది అభినయము. ఇది రూపక విశేషము. సంక్షేపముగా పాఠ్యముద్వారా రూపకముయొక్క అర్థప్రయోజనాది నిరూపణచేయు అభినయమే ప్రదర్శింపబోవు రూపకమునకు ద్వారమువంటిది. కాగా నీ అభినయము రంగద్వారమనబడుచున్నది. ఉత్థాపనాంగమున నాట్యము సామాన్యరూపమున చేయబడును. ఇచ్చట రూపకవిశేషముగా చేయబడును. ఇది వాగభినయాత్మకము, అంగాభినయాత్మకముకూడ నగును.

శృంగారస్య ప్రచరణా చ్చారీ సంప్రకీర్తితా
రౌద్రప్రచరణాచ్చాపి మహాచారీతి కీర్తితా.. 28

విదూషకః సూత్రధారస్తథావై పారిపార్శ్వకః
యత్ర కుర్వంతి సంజల్పం తచ్చాపి త్రిగతం మతమ్ 29

విదూషకుడు, సూత్రధారుడు, పారిపార్శ్వకుడు రూపకమందలి ఇతివృత్తమును సూచించునట్లుగా చేయు సంభాషణమును త్రిగతమందురు.

ఉపక్షేపేణ కావ్యస్య హేతుయుక్తి సమాశ్రయా
సిద్ధే నామంత్రణా యా తు విజ్ఞేయా సా ప్రరోచనా. 30

త్రిగతమందలి హేతువునుగాని, సంక్షిప్తముగా చెప్పబడిన విషయమునుగాని ఆశ్రయించుకొనిన కావ్యోపక్షేపముచే సామాజికులను సిద్ధమైన అర్థముతో నిమంత్రణచేయుట ప్రరోచన యని పిలువబడును.

ఈ పైనచెప్పబడిన పదియు బహిర్యవనికాంగములు. గీతక వర్ధమానముల నాశ్రయించుకొనిన ధ్రువాగానము మొట్టమొదట చేయబడును. సదాచారమును పాలించుటకై దేవతా వందనము జరుగును సామాజికులను, దేవతలను ప్రసన్నులనుగా చేసికొనుటకు ఆశీర్వచనము చెప్పబడినది. రాగలవని శంకించిన విఘ్నములను శాంతిపరచుట, సర్వజనాదరమునకై శృంగార వీరముల నభినయించుట, సర్వరంజకమగు హాస్యమునకు మార్గము చూపుట, కావ్యవిశేషమును గురించి కొంత ప్రస్తావించుట, రూపకములో నుద్దిష్టమైన ప్రయోజనమును వివరించుట మొదలగునవి ఈ బహిర్యవనికాంగములలో వచ్చుచున్నవి.

నాట్యారంభమున సలుపబడు గీతకాద్యంగములన్నియు లోకవ్యవహారము ననుసరించియే చెప్పబడినవి. ఇందలౌకిక విషయమేమియు లేదు. కాని నాట్యము రూపకముగా రచనా ప్రాధాన్యమంది వైచిత్ర్యగుణాన్వితమై కన్పించును. ఈ విశిష్టతద్వారా నాట్యప్రయోగమున కదృష్టసంపద చేకూరుచున్నది.

అతఃపరం ప్రవక్ష్యామి హ్యాశ్రావణ విధిక్రియామ్
బహిర్గీతవిధౌ సమ్యగుత్పత్తిం కారణంతథా. 31

బహిర్గీతవిధియందిక ఆశ్రావణవిధిని గురించి దాని ఉత్పత్తికారణములతో విషయమంతయు సమగ్రముగా భరతుడు చెప్పబోవుచున్నాడు.

చిత్ర దక్షిణవృత్తేతు సప్తరూపే ప్రకీర్తితా
సోపోహనే వనిర్గీతే దేవస్తుత్యభినందితే. 32
నారదాద్యైస్తు గంధర్వైః సభాయాం దేవదానవాః

ద్రుతాదులు, లయలు, శమ్యాదివిశిష్టములు తాళములు, చిత్రదక్షిణవృత్తులు ఏడు విధములు. వీటి లక్షణములు ముందు రాబోవు అధ్యాయములలో చెప్పబడగలవు.

తచ్ఛ్రుత్వాతు సుఖం గానం దేవస్తుత్యభినందితమ్
అభవన్ క్షుభితాః సర్వే మాత్సర్యా ద్దైత్య రాక్షసాః. 34

సంప్రధార్యచ తేఽన్యోన్య మిత్యవూచ న్నవస్థితాః
"నిర్గీతంతు సవాదిత్ర మిదం గృహ్ణీమహే వయమ్. 35

సప్తరూపేణ సంతుష్టా దేవాః కర్మానుకీర్తనాత్
వయం గృహ్ణీమ నిర్గీతం తుష్యామో ఽత్రైవ సర్వదా." 36

తే తత్ర తుష్టా దైత్యాస్తు సాధయంతి పునఃపునః

దేవతాస్తుతులతో కూడిన ఈ సుఖజనకమైన గానమును విని, దేవతలపైని మాత్సర్యము వలన దైత్యులు రాక్షసులు క్షోభించినవారై అన్యోన్యము కలసి ఈవిధముగా పలికిరి—"చిత్ర దక్షిణవృత్త్యాత్మకమై సప్తరూపములతోనున్న గీతవాద్యములచే గానముచేయబడిన కర్మాను కీర్తనమునకు దేవతలు సంతుష్టులైనారు. మేముమాత్రము వీణావాద్యముతోగూడిన శుష్కాక్షర గీతమునే స్వీకరించెదము. ఈ నిర్గీతమే మాకెల్లపుడు సంతోషము నొసగగలదు." ఈ నిర్గీత మున సంతుష్టులగు దైత్యులు తమ కార్యము సిద్ధించినట్లు చెప్పుచున్నారు.

రుష్టాశ్చాపి తతో దేవాః ప్రత్యభాషంత నారదమ్. 37
"ఏతే తుష్యంతి నిర్గీతే దానవాః సహరాక్షసైః
ప్రణశ్యతు ప్రయోగోఽయం కథంవై మన్యతే భవాన్". 38

దేవానాం వచనం శ్రుత్వా నారదో వాక్యమబ్రవీత్
"ధాతువాద్యాశ్రయకృతం నిర్గీతం మాప్రణశ్యతు. 39

కింతూపోహన సంయుక్తం ధాతువాద్య విభూషితమ్
భవిష్యతీదం నిర్గీతం సప్తరూపే విధానతః. 40

నిర్గీతేనావనద్ధాశ్చ దైత్య దానవ రాక్షసాః
న క్షోభం న విఘాతంచ కరిష్యంతీహ తోషితాః." 41

ఏవం నిర్గీతమేతత్తు దైత్యానాం స్పర్ధయా ద్విజాః
దేవానాం బహుమానేన బహిర్గీతమితి స్మృతమ్. 42

క్షోభమునుగాని, నాట్యవిధ్వంసనముగాని చేయజాలరు." ఈ నిర్గీతమును దైత్యస్పర్థవహించిన దేవతలను గౌరవించుటకై బహిర్గీతమని పిలువబడును.

ధాతువాద్యమనగా వీణె. వీణెలోని తీగలను ధాతువులందురు. సప్తభేదలక్షణములు గలది ధాతువాద్యము. కేవల స్వరాలాపనచే అదృష్టఫలము సంప్రాప్తించుటచే నిర్గీతమును ప్రయోగించి తీరవలెను.

ధాతుభి శ్చిత్రవీణాయాం గురు లఘ్వక్షరాన్వితమ్
వర్ణా లంకార సంయుక్తం ప్రయోక్తవ్యం బుధై రథ. 43
నిర్గీతం గీయతే యస్మా దపదం వర్ణయోజనాత్
అసూయయాచ దేవానాం బహిర్గీత మిదం స్మృతమ్. 44
నిర్గీతం యన్మయా ప్రోక్తం సప్తరూప సమన్వితమ్
ఉత్థాపనాదికం యచ్చ తస్య కారణముచ్యతే. 45

భాండవాద్యమున చెప్పబడు గురు లఘువులను రంజింపచేయునట్లుగా నాట్యోపరంజక మగు చిత్రవీణెపై వర్ణాలంకారములతోసహా ప్రయోగించవలెను. ధ్రువాగానమున చెప్పబడు స్థాయ్యాదివర్ణములు, ప్రసన్నాది అలంకారముల నిచట ప్రయోగించవలెను. అర్థరహితములగు పదవర్ణములతో పాడబడు ఈ నిర్గీతమును రాక్షసులపై అసూయగల దేవతలను సంతోషింప జేయుటకు బహిర్గీతమని పిలచుచున్నారు. ఆశ్రావణాదినిర్గీతము సప్తరూపములు కలిగియున్నది. బహిర్యవనికాంగమగు ఉత్థాపనాదిక మీనిర్గీతమునకు ప్రయోజనముగా చెప్పబడగలదు.

ఆశ్రావణాయాం యుక్తాయాం దైత్యాస్తుష్యంతి నిత్యశః
వక్త్రపాణౌ కృతేచైవ నిత్యం తుష్యంతి దానవాః. 46
పరిఘట్టనాయాం తుష్టా యుక్తాయాం రక్షసాం గణాః
సంఘోటనాక్రియాయాంతు తుష్యంత్యపిచ గుహ్యకాః. 47
మార్గాసారిత మాసాద్య ప్రీతా యక్షా భవంతిహి

ఆశ్రావణాప్రయోగమున దైత్యులు, వక్త్రపాణిని ప్రయోగించిన దానవులు, పరిఘట్టనను ప్రయోగించిన రాక్షసగణములు, సంఘోటనావ్యాపారమున గుహ్యకులు, మార్గాసారితమున యక్షులు సంతోషించెదరు.

గీతకేషు ప్రయుక్తేషు దేవాస్తుష్యంతి నిత్యశః. 48
వర్ధమానే ప్రయుక్తేతు రుద్ర స్తుష్యతి సానుగః
తథా చోత్థాపనే యుక్తే బ్రహ్మా తుష్టో భవేదిహ. 49
తుష్యంతి లోకపాలాశ్చ ప్రయుక్తే పరివర్తనే
నాన్దీ ప్రయోగేఽథకృతే ప్రీతో భవతి చంద్రమాః, 50
[illegible] మవకృష్టాయాం ప్రీతా నాగా భవంతిహి
తథా [illegible] కృష్టాయాం ప్రీతః పితృగణో భవేత్. 51

రంగద్వారే ప్రయుక్తేతు విష్ణుః ప్రీతో భవేదిహ
జర్జరస్య ప్రయోగేతు తుష్టా విఘ్న వినాయకాః. 52
తథా చార్యాం ప్రయుక్తాయా ముమా తుష్టా భవేదిహ
మహాచార్యాం ప్రయుక్తాయాం తుష్టో భూతగణో భవేత్. 53

గీతములు ప్రయోగించబడగా నిత్యము దేవతలు సంతోషించెదరు. వర్ధమానప్రయోగ మున అనుచరులతో కలసిన రుద్రుడు, ఉత్థాపనమున బ్రహ్మ, పరివర్తనమున లోకపాలురు, పుష్పాంజలితో నున్న నాందీప్రయోగమున చంద్రుడు, అవకృష్టమున నాగులు, శుష్కావ కృష్టమున పితృదేవతలు, రంగద్వారప్రయోగమున విష్ణువు, జర్జరప్రయోగమున విఘ్నవినా యకులగు విరూపాక్షప్రభృతులు, చారీప్రయోగమున ఉమాదేవి, మహాచారీప్రయోగమున భూతగణములు సంతోషింపగలవు.

ఆశ్రావణాది చార్యంత మేత ద్దైవత పూజనమ్
పూర్వరంగే మయా ఖ్యాతం తథా చాంగవికల్పనమ్. 54
యేన తుష్యతి యో దేవో యస్య యన్మనసః ప్రియమ్
తత్త దాపూర్వరంగేతు మయా ప్రోక్తం ద్విజోత్తమాః. 55
సర్వదైవత పూజార్హం సర్వదైవత పూజనమ్
ధర్మ్యం యశస్య మాయుష్యం పూర్వరంగ ప్రవర్తనమ్. 56
దైత్య దానవ తుష్ట్యర్థం సర్వేషాంచ దివౌకసామ్
నిర్గీతాని సగీతాని పూర్వరంగ కృతానితు 57
నిర్గీతానాం సగీతానాం వర్ధమానస్యచైవహి
ధ్రువా విధానే వక్ష్యామి లక్షణం కర్మచైవహి. 58

ఆశ్రావణావిధి మొదలుకొని మహాచారివరకు గల అంగములన్నియు పూర్వరంగము లోనివి. ఏప్రయోగముచే పూర్వరంగమున నే దేవత సంతోషించునో, ఏ ప్రయోగ మే దేవత కభిమతమో అదియంతయు చెప్పబడినది. సమస్తదేవతలచేత ప్రశంసనీయమగు సర్వదైవత పూజనము ధర్మసహితము, యశస్యము, ఆయుష్కరము కాగలదు. దైత్యదానవులకు నిర్గీతము, దేవతలకందరకు గీతకాదులు పూర్వరంగమున సంతోషదాయకము లగుచున్నవి. ధ్రువావిధాన మును చెప్పుసందర్భమున నిర్గీత, గీతక వర్ధమానముల లక్షణప్రయోజనములు చెప్పబడగలవు.

పూర్వరంగమును మనోరంజకముగా చేయువానిలో నతి ముఖ్యమైనది ధ్రువాగానము. దీనికవసరమగు గాంధర్వమును తెలసికొనుటకు లక్షణప్రయోజనములు ధ్రువావిధాన సందర్భ మున చెప్పబడగలవని భావము.

చతుష్పదా భవేత్సాతు చతురశ్రా తథైవచ
చతుర్భి స్సన్నిపాతైశ్చ త్రిలయా త్రియతి స్తథా. 61
పరివర్తాశ్చ చత్వారః పాణయ స్త్రయఏవచ
జాత్యాచైవహి విశ్లోకా స్తాంశ్చ తాలేన యోజయేత్. 62

గీతక వర్ధమానములను ప్రయోగించి, గీతకమైన తర్వాత ఉత్థాపనీ ధ్రువాగానము నాలాపించవలెను. ఉత్థాపనీధ్రువలో రెండు, నాలుగు, ఎనిమిది, పదకొండు అక్షరములు గురువులు, శేషించినవి లఘువులుగా నుండును. ఒక్కొక్క పాదమునకు పదకొండుఅక్షరము లుండును. ఇట్టి పాదములు నాలుగు. ఇచట చంచత్పుటతాళము ప్రయుక్తమగును. ప్రతి పాదాంతమున సన్నిపాతముండుటచే నాలుగు సన్నిపాతలుండ గలవు. ద్రుతాదులగు లయలు మూడు, స్రోతోగతాదులగు యతులు మూడును కలవు. గాన క్రియాభ్యాసమందలి ఆవృత్తులు నాలుగుండును. సమపాణి, అవరపాణి, ఉపరిపాణి అని మూడుండును. ఈ విధమైన ఉత్థాపనీ ధ్రువ విశ్లోకమనబడు వృత్తజాతిలోనిది. దీనిని తాళముతో ప్రయోగించవలెను.

శమ్యాతు ద్వికలా కార్యా తాలో ద్వికలఏవచ
పున శ్చైకకలా శమ్యా సన్నిపాతః కలాత్రయమ్. 63
ఏవ మష్టకలః కార్యః సన్నిపాతో విచక్షణైః
చత్వారః సన్నిపాతాశ్చ పరివర్తః స ఉచ్యతే. 64
పూర్వం స్థితలయః కార్యః పరివర్తో విచక్షణైః
తృతీయే సన్నిపాతేతు తస్య భాండగ్రహో భవేత్. 65
ఏకస్మిన్ పరివర్తేతు గతే ప్రాప్తే ద్వితీయకే
కార్యం మధ్యలయే తజ్ఞైః సూత్రధార ప్రవేశనమ్. 66

ఉత్థాపనీధ్రువను తాళముతో ప్రయోగించవలెను. తాళమిచట శమ్యా అను విశేష నామము కలది. ఇది ద్వికల. కలాశబ్దము అక్షరమార్గమును నిర్దేశించునది. తాళమును ద్వికలగా చెప్పి, శబ్దపాతగతమైన హస్తమును నిర్వర్తింపచేయవలెను. తర్వాత ఏకకలతో శమ్యా ననుసంధించగా మూడు కలలతో సన్నిపాతము రాగలదు. కాగా నిష్కామశమ్యలను కుడిచేతితోను, నిష్కామతాళములను ఎడమచేతితోను, ఆ తర్వాత కుడిచేతితో శమ్యను ప్రయోగించగా రెండింటితోను ప్రవేశ నిష్కామ సన్నిపాతలు రాగలవు.

పుష్పాంజలిం సమాదాయ రక్షామంగల సంస్కృతాః
శుద్ధవస్త్రాః సుమనస స్తథా చాద్భుత దృష్టయః. 67
స్థానంతు వైష్ణవం కృత్వా సౌష్ఠవాంగ పురస్కృతమ్
దీక్షితాః శుచయశ్చైవ ప్రవిశేయుః సమం త్రయః. 68

భృంగార జర్జరధరౌ భవేతాం పారిపార్శ్వకౌ
మధ్యేతు సూత్రభృత్తాభ్యాం వృతః పంచపదీం వ్రజేత్. 69

రక్షామంగళ శ్లోకాదులచే సంస్కృతులై, తెల్లని వస్త్రములను ధరించి, శోభన మనస్కులై, అద్భుతదృష్టులతో, శుచిగలవారై, దీక్షితులై, సూత్రధారుడు, ఇరువురు పారిపార్శ్వకులు ప్రవేశించవలెను. పారిపార్శ్వకులలో నొకడు శౌచార్థము భృంగారము, మరొకడు విఘ్నశాంతికై ధ్వజమును తీసికొనగా సూత్రధారుడు పుష్పాంజలియై వచ్చును. వీరు సౌష్ఠవాంగ పురస్కృతమగు వైష్ణవస్థానమున నిలువవలెను. రెండు పాదములకు మధ్య ఇరువదిరెండున్నర అంగుళముల దూరముండగా, ఒకపాదము సమముగానుండి, రెండవది ప్రక్కగా త్రికోణాకారమున నుండ, జంఘము కుంచించబడగా కలుగు సౌష్ఠవాంగముతో నుండునది వైష్ణవస్థానకమని ముందు పదవ అధ్యాయమున చెప్పబడగలదు.

పారిపార్శ్వకులిరువైపుల నుండగా వారితోబాటు సూత్రధారుడు ఐదడుగులు వేయవలెను. ఈ కృత్యమునకు ప్రయోజనము క్రిందిశ్లోకములో గలదు.

పదాని పంచ గచ్ఛేయుః బ్రహ్మణో యోజనేచ్ఛయా
సూచీం వామపదం దద్యా ద్విక్షేపం దక్షిణేనచ. 70
త్రితాలాంతర విష్కంభ ముత్క్షిపే చ్చరణం శనైః
పార్శ్వోత్థా నోత్థితం చైవ తన్మధ్యే పాతయేత్పునః. 71
ఏవం విష్ణుపదీం కృత్వా సూత్రధారః సహేతరైః
సూచీ వామపదం దద్యా ద్విక్షేపం దక్షిణేనచ. 72

నాట్యమండపమున మధ్యగా పద్మోపవిష్టుడైన బ్రహ్మ నావా[illegible]దేశమున కేగదలచి సూత్రధారుడు పారిపార్శ్వకులతో ఐదడుగులు వేయవలె[illegible]పాదముతో, సూచీప్రయోగమును, కుడిపాదముతో విక్షేపమును చేయవలెను. కుంచితమైన పాదమును ఎత్తి జానువువరకు పైకి ప్రసారించి, మొదటి పాదాగ్రభాగమును వెనుకవైపున క్రిందకు వేయుటయే సూచీ యనబడును. హస్తముయొక్క వ్యావర్తనకాలము పాదమునకు బహిర్నిష్క్రమణ లక్షణముగా చూపుట విక్షేప మనబడును.

రంగపీఠస్య మధ్యేతు స్వయం బ్రహ్మా ప్రతిష్ఠితః. 73
తతః సలలితైర్హస్తై రభివంద్యః పితామహః
వందనాన్యథ కార్యాణి త్రీణి హస్తేన భూతలే. 74
కాల ప్రకర్షహేతోశ్చ పాదానాం ప్రవిభాగతః

రంగపీఠమధ్యమున బ్రహ్మయే స్వయముగా ప్రతిష్ఠింపబడియుండుటచే నీ బ్రాహ్మ మండలమున అంజలిలోనున్న పూవుల నుంచవలెను. తర్వాత లలితహస్తములతో బ్రహ్మకు నమస్కరించవలెను. భూతలమున మూడు నమస్కారములను చేయవలెను. కాల పరిమాణాంతరము నాశ్రయించి నృత్తహస్తకరణముల ప్రయోగముతో నమస్కారము విధింపబడినది.

సూత్రధార ప్రవేశాద్యో వందనాభినయానుగః. 75

సూత్రధారుడు ప్రవేశించుటచే వందనాభినయములు వచ్చుచున్నవి. సూత్రధారుడు ప్రవేశించి, ఐదడుగులు వేసి, పూల నర్పించి, మూడు నమస్కారములను చేయవలెను. ఇది ముప్పదిరెండుకళలలో జరుగును. పంచపదీగమనమైన తర్వాత ఎన్ని కళలు మిగిలినవో, అంత కాలము వ్యావర్తిత పరివర్తితాదికరణములతో ఉద్వృత్త నలినీ పద్మకోశాది నృత్తహస్తముల నవలంబించి లలితాత్మకముగా మూడు నమస్కారములను చేయవలెనని భావము.

ద్వితీయః పరివర్తస్తు కార్యో మధ్యలయాశ్రితః
తతఃపరం తృతీయేతు మండలస్య ప్రదక్షిణమ్. 76
భవే దాచమనంచైవ జర్జరగ్రహణం తథా
ఉత్థాయ మండలాత్తూర్ణం దక్షిణం పద ముద్ధరేత్. 77
వైధంతేనైవ కుర్వీత విక్షేపం వామకేనచ
పునశ్చ దక్షిణం పాదం పార్శ్వసంస్థం సముద్ధరేత్. 78
తతశ్చ వామవేధస్తు విక్షేపో దక్షిణస్యచ

[illegible]త్తి మధ్యలయలో జరుగును. ద్రుతలయలో మూడవ ఆవృత్తియందు జరుగవలసిన కార్యకలాపము నిక చెప్పుచున్నాడు. నవపద్మదళాకారమున రంగమధ్యమునగల మండలమునకు ప్రదక్షిణము చేసి, ఆచమనమొనరించి, ధ్వజమును తీసికొనవలెను. జానువులను శిరస్సును వంచి భూశ్లేషపర్యంతము అభివాదనచేసి కుడిపాదము సూచీవిద్ధముగా ఎత్తవలెను. ఎడమపాదముతో విక్షేపము చేయవలెను. అనగా రెండవకాలి మడమవెనుక పాదము నుంచవలెను. మరల ప్రక్కనున్న కుడిపాదముతో పార్శ్వక్రాంతిచారీవిధానము నాచరింపవలెను. ఆపై మరల కుడిపాదమును సూచీవిద్ధముగను, కుడిపాదమును విక్షేపముగను చేయవలెను.

ఇత్యనేన ప్రకారేణ సమ్యక్కృత్వా ప్రదక్షిణమ్. 79
భృంగారభృత మాహూయ శౌచంచాపి సమాచరేత్
యథాన్యాయంతు కర్తవ్యా తేన హ్యాచమనక్రియా. 80
ఆత్మప్రోక్షణమద్భిశ్చ కర్తవ్యంతు యథాక్రమమ్

ఈ ప్రకారముగా ప్రదక్షిణమును చక్కగా గావించి, ప్రదక్షిణభ్రమణమున తూష్ణీం భావముగా భృంగారమును తీసికొనియున్న పారిపార్శ్వకుని పిలచి ఆచమనమును చేయించవలెను. విధిప్రకారము ఆచమనము చేసినతర్వాత ఉదకములతో ఆత్మప్రోక్షణ మొనర్పవలెను. ఇది శౌచమనబడు రెండవ కృత్యము.

ప్రయత్నకృత శౌచేన సూత్రధారేణ యత్నతః 81
సన్నిపాతే సమంగ్రాహ్యో జర్జరో విఘ్నజర్జరః
ప్రదక్షిణాద్యో విజ్ఞేయో జర్జరగ్రహణాంతకః 82
తృతీయః పరివర్తస్తు విజ్ఞేయోవై ద్రుతేలయే

ఇక తృతీయకర్మ చెప్పబడుచున్నది. ప్రదక్షిణసమయమున నాల్గవఆవృత్తికి ముందు విఘ్నములను నశింపజేయు ధ్వజమును ప్రయత్నపూర్వకముగా శుచియైన సూత్రధారుడు గ్రహించవలెను. ఈ మూడవఆవృత్తి ద్రుతలయలో జరుగును.

గృహీత్వా జర్జరం త్వష్టౌ కలాజప్యం ప్రయోజయేత్. 83
వామవేధం తతఃకుర్యా ద్విక్షేపం దక్షిణస్యచ
తతః పంచపదీంచైవ గచ్ఛేత్తు కుతపోన్ముఖః. 84
వామవేధస్తు తత్రాపి విక్షేపో దక్షిణస్యతు
జర్జరగ్రహణా ద్యోఽయం కుతపో నిగమాంతకః. 85
చతుర్థః పరివర్తస్తు కార్యో ద్రుతలయేపునః

జర్జరపూజకు నాల్గుశ్లోకములు మూడవఅధ్యాయమున చెప్పబడినవి. ఈ శ్లోకములతో స్తుతింపబడు ధ్వజమును మొదటి ఎనిమిదికళలలో గ్రహించి, ఎడమపాదమును సూచీవిద్ధముగను, కుడిపాదమును విక్షేపముగను చేయవలెను. వాద్యవిశేషములకున్ముఖుడై ఐదడుగులు వేయవలెను. అప్పుడచ్చటకూడ ఎడమపాదమును సూచీవిద్ధముగను, కుడిపాదముతో విక్షేపమును ప్రయోగించవలెను. ధ్వజముతో వాద్యములవద్దకు వచ్చుటకు ఇరువదినాలుగు కళల కాలము కావలెను. ఈ నాల్గవఆవృత్తికూడ ద్రుతలయముననే జరుగును.

ఏవ ముత్థాపనం కార్యం తతశ్చ పరివర్తనమ్. 88

ఈవిధముగా ఉత్థాపనమైనతర్వాత పరివర్తనమును గావించవలెను; నాట్యముత్థాపితము కాగా తదనంతరప్రక్రియను చెప్పబోవుచున్నాడు.

చతురశ్రం లయే మధ్యే సన్నిపాతై, రథాష్టభిః
యస్యాం లఘూని సర్వాణి కేవలం నైధనం గురు. 89
భవేదతి జగత్యాంతు సా ధ్రువా పరివర్తనీ

చతురశ్రతాళములో నున్న ధ్రువాయోగముచే పరివర్తనము చతురశ్రమగుచున్నది. నాల్గుపాదములుగల ధ్రువాగానమున సన్నిపాతాష్టకము రాగలదు. ఇది మధ్యలయలో ప్రయోగించ బడును. అతిజగతీఛందమున, అంత్యాక్షరము గురువుకాగా, శేషించిన అక్షరములు లఘువులు కాగా, పాడబడునది పరివర్తనీధ్రువ యగును. అతిజగతీఛందమున పాదమునకు పదమూడుఅక్షరము లుండును.

వార్తికేనతు మార్గేణ వాద్యేనానుగతేనచ. 90
లలితైః పాదవిన్యాసై ర్వంద్యా ద్దేవాః యథాదిశమ్
ద్వికలం పాదపతనం పాదచార్యాం గతం భవేత్. 91
వామపాదేన వేధస్తు కర్తవ్యో నృత్తయోక్తృభిః
ద్వితాలాంతర విష్కంభో విక్షేపో దక్షిణస్యచ. 92

చతుర్మాత్రాత్మకమగు మార్గమున వాద్యము లాలాపింపబడుచుండగా ఆ యా దిక్కులలో గల దేవతలను లలితములైన పాదవిన్యాసములతో నమస్కరింపవలెను. భూచారినిగాని ఆకాశచారినిగాని ప్రయోగించినచో రెండుకళలకాలములో పాదపతనము జరుగవలెను. అనగా ఒక పాదము పైకి ఎత్తబడగా, రెండవది క్రిందపడును. ఎడమపాదమును సూచీవిద్ధముగా ప్రయోగించి, పదునెన్మిది అంగుళముల అవధిగల కుడిపాదమును విక్షేపింపవలెను.

తతః పంచపదీం గచ్ఛే దతిక్రాంతైః పదైరథ
తతోఽభివాదనం కుర్యా ద్దేవతానాం యథాదిశమ్. 93
వందేత ప్రథమం పూర్వాందిశం శక్రాధిదైవతామ్
ద్వితీయాం దక్షిణామాశాం వందేత యమదైవతామ్. 94
వందేత పశ్చిమామాశాం తతో వరుణదైవతామ్
చతుర్థీ ముత్తరామాశాం వందేత ధనదాశ్రయామ్. 95
దిశాంతు వందనం కృత్వా వామవేధం ప్రయోజయేత్
దక్షిణేనచ కర్తవ్యం విక్షేప పరివర్తనమ్. 96

అతిక్రాంతచారీగమనమున ఐదడుగులనువేసి ఆ యా దిక్కులలోగల దేవతలకు వరుసగా నమస్కారములను చేయవలెను. మొదట ఐంద్రదేవతాకమగు తూర్పుదిక్కును నమస్కరించవలెను. తర్వాత యమదైవత్యమగు దక్షిణమున, వరుణదైవత్యమగు పశ్చిమమున, కుబేరదేవతాకమగు ఉత్తరమున నమస్కారములను జరిపి ఎడమపాదమును సూచీవిద్ధముగ[illegible]

కుడిపాదమును విక్షేపపూర్వకమగు పరివర్తనమును చేయవలెను. ఉత్తరాభిముఖుడుగా నిలచి పరివర్తనముచేసి తూర్పుదిక్కునకు తిరుగునని భావము.

ప్రాఙ్ముఖస్తు తతః కుర్యాత్ పురుష స్త్రీ నపుంసకైః
త్రిపదీం సూత్రభృ ద్రుద్ర బ్రహ్మో పేంద్రాభివాదనమ్. 97

దక్షిణంతు పదం పుంసో వామం స్త్రీణాం ప్రకీర్తితమ్
పునర్దక్షిణమేవస్యా న్నాభ్యాత్క్షిప్తం నపుంసకమ్. 98

తూర్పుదిక్కునకభిముఖుడై సూత్రధారుడు రుద్ర, బ్రహ్మ, విష్ణువులకు పుంస్త్రీనపుంసక భేదములతో కూడిన త్రిపదీరూపమైన అభివాదనమును చేయవలెను. పురుషులకు కుడిపాదము, స్త్రీలకు ఎడమపాదము, కొంచెమెత్తిన కుడిపాదము నపుంసకులకని తెలియనగును.

వందేత పౌరుషేణేశం స్త్రీ పదేన జనార్దనమ్

పరివర్తనీధ్రువాగానమున కుడిపాదముతో శివునకు, ఎడమపాదముతో విష్ణువునకు నమస్కారములు చేయబడవలెను.

యస్యాం లఘూని కార్యాణి కేవలం నైధనం గురు. 99
పాదేత్వతి జగత్యాంహి సా ధ్రువా పరివర్తనీ

పాదమునకు పదమూడుఅక్షరములుగల అతిజగతీఛందమున, అంత్యాక్షరముమాత్రమే గురువుగానుండి, శేషించినవి లఘువులైన నది పరివర్తనీధ్రువ యనిపించుకొనును.

నపుంసకపదేనాపి తథైవాంబుజ సంభవమ్. 100

కొద్దిగా ఎత్తిన పాదముతో బ్రహ్మకు నమస్కరింపవలెను.

పరివర్తన మేవంస్యా త్తస్యాంతే ప్రవిశేత్తతః
చతుర్థకారః పుష్పాణి ప్రగృహ్య విధిపూర్వకమ్. 101

యథావత్తేన కర్తవ్యం పూజనం జర్జరస్యతు
కుతపస్యచ సర్వస్య సూత్రధారస్యచైవహి. 102

తస్య భాండసమః కార్య స్త్వఙ్గ గతిపరిక్రమః
న తత్ర గానం కర్తవ్యం తత్రస్తోభక్రియా భవేత్. 103

నమగకారసహాజాంతః సకృత్కాంతరితో భవేత్

తతో గేయావకృష్టాతు చతురశ్రా స్థితా ధ్రువా. 104

గురుప్రాయాతు సా కార్యా తథాచైవార్ధపాణికా

స్థాయి వర్ణాశ్రయోపేతా కలాష్టక వినిర్మితా. 105

చతుర్థం పంచమంచైవ సప్తమం చాష్టమంతథా

లఘూని పాదేపంక్త్యాంతు సావకృష్టా ధ్రువా స్మృతా. 106

మొదటి తొమ్మిది గుర్వక్షరములతో నున్నది, అర్ధపాణికమైనది, స్థాయివర్ణములగు సమస్వరములతో కూడినది, ద్వికల షంచత్పుటాది కలాష్టకముతో నిర్మించబడినది, విలంబిత లయగలది, నాలుగుపాదములు కలదియు నగు ధ్రువను గేయావకృష్ట యందురు. దశాక్షరముల నొకపాదమునకు కలిగియున్న పంక్తి ఛందమున నాలుగు, ఐదు, ఏడు, ఎనిమిది అక్షరములు లఘువులై యున్న నది అవకృష్టాధ్రువా అనబడును.

సూత్రధారః పఠేత్తత్ర మధ్యమం స్వరమాశ్రితః

నాందీం పదై ర్ద్వాదశభి రష్టభి ర్వా ప్యలంకృతమ్. 107

"నమోఽస్తు సర్వదేవేభ్యో ద్విజాతిభ్యః శుభంతథా

జితం సోమేనవై రాజ్ఞా శివం గోబ్రాహ్మణాయచ. 108

బ్రహోత్తరం తథైవాస్తు హతా బ్రహ్మద్విష స్తథా

ప్రశాంస్త్వేమాం మహారాజః పృధివీంచ ససాగరామ్. 109

రాష్ట్రం ప్రవర్ధతాంచైవ రంగస్యాశా సమృద్ధ్యతు

ప్రేక్షాకర్తు ర్మహాన్ ధర్మో భవతు బ్రహ్మభావితః. 110

కావ్యకర్తు ర్యశశ్చాస్తు ధర్మశ్చాపి ప్రవర్ధతామ్

ఇజ్యయా చానయా నిత్యం ప్రీయంతాం దేవతా"ఇతి. 111

ఏవం నాందీ విధాతవ్యా యథావ ల్లక్షణాన్వితా
తత శ్శుష్కావకృష్టాస్యా జ్జర్జరశ్లోకదర్శికా. 113
నవగుర్వక్షరాణ్యాదౌ షడ్లఘూని గురుత్రయమ్
శుష్కావకృష్టాతు భవే త్కలాహ్యష్టౌ ప్రమాణతః. 114

యథా—

'దిగ్లే దిగ్లే ఝుణ్టా ఝుణ్టా జంబుక కలితక తే తేజాః'

ఈ రీతిగా లక్షణాన్వితమైన నాందీప్రయోగము పూర్తికాగా ధ్వజస్తుతికి దారితీయు శుష్కావకృష్టప్రయోగము జరుగవలెను. ఇందు తొమ్మిది గుర్వక్షరములు, తర్వాత ఆరు లఘువులు, ఆపై మూడుగురువులు నుండును. 'దిగ్లే దిగ్లే ఝుణ్టా ఝుణ్టా జంబుక కలితక తే తేజాః' అనునది శుష్కావకృష్ట కుదాహరణము. ఇచటగల అక్షరము లన్నియు అర్థరహితములే. ఇది అష్టకళాత్మకమైన ప్రమాణము గలది.

కృత్వా శుష్కావకృష్టాంతు యథావ ద్ద్విజసత్తమాః. 115
తత్ర శ్లోకం పఠేదేకం గంభీరస్వరసంయుతమ్
దేవస్తోత్రం పురస్కృత్య యస్య పూజాప్రవర్తతే. 116
రాజ్ఞోవా యత్ర భక్తిః స్యా దథవా బ్రాహ్మణస్తవమ్
గదిత్వా జర్జరశ్లోకం రంగద్వారేచ యత్స్మృతమ్. 117
పఠేదన్యః పునఃశ్లోకం జర్జరస్య ప్రకాశకమ్

విధిపూర్వకముగా శుష్కావకృష్టము ప్రయోగించి గంభీరస్వరముతో దేవతాపూజ జరుగుచున్నది గనుక దేవతాస్తోత్రవిషయకమగు శ్లోకము నొకదానిని పఠించవలెను. ఈ శ్లోకముద్వారా రంగద్వారమను నంగము ప్రయుక్తమగును. రాజునకు భక్తిగల దేవతాస్తోత్రమునుగాని, బ్రాహ్మణస్తవమునుగాని పఠించవచ్చును. జర్జరమనబడు ధ్వజమును గూర్చిన శ్లోకమును రంగద్వారాంగమున పఠించి, మరల ధ్వజము నభివ్యక్తముచేయు మరొకశ్లోకము నుచ్చరించవలెను.

జర్జరం నమయిత్వాతు తత శ్చారీం ప్రయోజయేత్. 118
పారిపార్శ్వకయోశ్చ స్యా త్పశ్చిమే నావసర్పణమ్
అడ్డితా చాత్ర కర్తవ్యా ధ్రువా మధ్యలయాన్వితా. 119
చతుర్భిః సన్నిపాతైశ్చ చతురశ్రా ప్రమాణతః
ఆద్యం మంత్యం చతుర్థంచ పంచమంచ తథా గురు. 120

అప్పుడు మధ్యలయలో అడ్డితా ధ్రువగానము వినియోగింపబడవలెను. చంచత్పుట తాళమున నాలుగు పాదములతో నున్నదీ ధ్రువ. ఇందు ఆద్యక్షరము, అంత్యాక్షరము, నాలుగు ఐదక్షరములు గురువులు శేషించినవి లఘువులు. ఇచట పాదమునకు ఏడునుండి పది వరకు అక్షరము లుండవచ్చును. కాని ప్రతిపాదమున అక్షరసంఖ్య ఒకేవిధముగా నుండవలెను. పూర్వము శివుడునూ దేవితో నాట్యముచేసినవేళ అడ్డితాచారీవిధానము ప్రయోగించబడినది. ఆ ప్రయోగము ననుసరించి దీని లక్షణము చెప్పబడుచున్నది.

కృత్వావహిత్థం స్థానంతు వామం చాధోముఖం భుజమ్. 122
చతురశ్రే మురఃకార్య మంచితశ్చాపి మస్తకః
నాభిప్రదేశే విన్యస్య జర్జరంచ తులాధృతమ్. 123
వామపల్లవహస్తేన పాదైస్తాలాంతరస్థితైః
గచ్ఛేత్పంచపదీంచైవ సవిలాసాంగచేష్టితైః. 124

మొదట అవహిత్థస్థానకమును ప్రయోగించవలెను. ఇది స్త్రీ స్థానకము. కుడిపాదమును త్రికోణాకారముగా నుంచి, ఎడమపాదమును సమముగా నుండునట్లు అపసృతము చేసి, రెండు పాదములకు మధ్య తొమ్మిమిది అంగుళముల దూరము నుంచవలెను. త్రికోణాకృతితో నున్న పాదమును కొంచెముగా పైకి ఎత్తి యుంచవలెను అప్పుడు కుడిచేతిని లతాహస్తముగా పట్టి, ఎడమచేతిని నితంబమున నుంచినచో అవహిత్థస్థానకమగును రొమ్మును చతురశ్రముగా నుంచి, వంగిన మస్తకముతో నుండగా కుడిచేతిని కటకాముఖముగా పట్టి నాభిప్రదేశమున త్రాసువలె జర్జరమును చూపవలెను. పతాక రూపమున నెడమచేతిని పల్లవింపజేసి, రెండు పాదములు తాళగతులకు సరిపడునట్లుగా విలాసముతో కూడిన అవయవచేష్టలతో ఐదడుగులు వేయవలెను.

వామవేధస్తు కర్తవ్యో విక్షేపో దక్షిణస్యచ
శృంగార రస సంయుక్తాం పఠే దార్యాం విచక్షణః 125
చారీశ్లోకం గదిత్వాతు కృత్వాచ పరివర్తనమ్
తైరేవచ పదైః కార్యం పశ్చిమే నాపసర్పణమ్ 126
పారిపార్శ్వకహస్తేతు న్యస్య జర్జర ముత్తమమ్
మహాచారీం తతశ్చైవ ప్రయుంజీత యథావిధి. 12'

ఆద్యం చతుర్థ మంత్యంచ సప్తమం దశమం గురు
లఘు శేషం ధ్రువా యోగే త్రిష్టుభే చరణే యథా. 129

"పాద తలాహతి పాతిత శైలం క్షోభిత భూత సమగ్ర సముద్రమ్
తాండవ నృత్త మిదం ప్రలయాంతే పాతు జగత్సుఖదాయి హరస్య". 130

ద్వికళతో చంచత్పుటమున, అష్టకలాప్రమాణాత్మకముగా, నాలుగు సన్నిపాతలతో, ద్రుతలయాన్వితమై ఈ ధ్రువ ఉండవలెను. ఈ ధ్రువాపాదమునకు పదకొండు అక్షరములుండును. ఇందు ఒకటి, నాలుగు, ఏడు, పది, పదకొండు అక్షరములు గురువులు. శేషించినవి లఘువులు. అనగా పంక్తికి మూడు భగణములు, రెండు గురువులు ఉండును. ఈ లక్షణములతో కూడిన ఉదాహరణ ఇవ్వబడినది. "పాదతలపుదెబ్బచే పడిన కొండయు, క్షోభిల్లిన భూతములన్నిటితో కూడిన సముద్రమును కలిగి, జగత్తునకు సుఖమునొసగు హరుని తాండవనృత్తము ప్రళయాంతమున రక్షించుగాక!" అని ఉదాహరణశ్లోకములోని భావము.

భాండోన్ముఖేన కర్తవ్యం పాదవిక్షేపణం తతః
సూచీంకృత్వా పునః కుర్యా ద్విక్షేప పరివర్తనమ్. 131

అతిక్రాంతైః సలలితైః పాదై ర్ద్రుతలయాన్వితైః
త్రితాలాంతర ముత్క్షిప్తై ర్గచ్ఛే త్పంచపదీం తతః. 132

తత్రాపి వామ వేధస్తు విక్షేపో దక్షిణస్యచ
తైరేవచ పదైః కార్యం ప్రాఙ్ముఖే నాపసర్పణమ్. 133

తర్వాత భాండోన్ముఖుడై పాదవిక్షేపణమును చేయవలెను. సూచీవిద్ధముగా ఎడమపాదము ప్రయోగించి, కుడిపాదమున విక్షేపపూర్వకమగు పరివర్తనమును చేయవలెను. సుందరములై, లలితాత్మకములైన అతిక్రాంత చారీపాదములను ద్రుతలయసహితములుగా ప్రయోగించి, త్రిశ్రజాతితాళమున ఐదడుగులు వేయవలెను. అప్పుడు ఎడమకాలిని సూచీవిద్ధముగను, కుడికాలితో విక్షేపమును మరల ప్రయోగించి అదే అడుగులతో తూర్పునకభిముఖుడై వెనుక కేగవలెను.

తతో ఽఽగమనం కార్యం గానం నర్కుటకం బుధైః
తథాచ భారతీ భేదే త్రిగతం సంప్రయోజయేత్. 136

పారిపార్శ్వకుల ఆగమనమును నర్కుటక ధ్రువాగానముతో ప్రయోగించవలెను. అప్పుడు భారతీ వృత్తి భేదమగు త్రిగతము ప్రయోగించబడును.

విదూషక స్త్వేకపదాం సూత్రధార స్మితావహామ్
అసంబద్ధ కథాప్రాయాం కుర్యాత్కథనికాంతతః 137
ప్రరోచనాచ కర్తవ్యా సిద్ధే నోపనిమంత్రణమ్
రంగసిద్ధౌ పునఃకార్యం కావ్యవస్తు నిరూపణమ్. 138
సర్వమేవ విధిం కృత్వా సూచీవేధకృతై రథ
పాదై రనావిద్ధగతై ర్నిష్క్రామేయుః సమం త్రయః 139
ఏవమేవ ప్రయోక్తవ్యః పూర్వరంగో యథావిధి
చతురశ్రో ద్విజశ్రేష్ఠా త్ర్యశ్రంవాపి నిబోధత. 140

విదూషకుడుగూడ నొక పాత్రయై సంభాషించుచుండగా సూత్రధారునకు స్మితము కలుగజేయునట్టి నొకానొక అసంబద్ధ కథానికను ప్రయోగించవలెను. సిద్ధమైన అర్థముతో ప్రరోచననుకూడ ప్రయోగించవలెను. ఆపై రంగము సిద్ధించగా కావ్యవస్తువును నిరూపించవలెను. ఈ విధముగాచేసి సూచీవిద్ధముగా పాదములను ప్రయోగించి, అనావిద్ధగతులతో ముగ్గురును నిష్క్రమించవలెను. ఈరీతిగా ప్రయోగించబడిన పూర్వరంగమును చతురశ్రమందురు.

చతురశ్రము, త్ర్యశ్రము, శుద్ధము, చిత్రము అని పూర్వరంగము నాలుగు విధములు. ఇక త్ర్యశ్రపూర్వ రంగమును గురించి చెప్పబోవుచున్నాడు.

అయమేవ ప్రయోగః స్యా దంగా న్యేతానిచైవహి
తాలప్రమాణం విక్షిప్తం కేవలంతు విశేషకృత్. 141
శమ్యాతు ద్వికలా కార్యా తాలో హ్యేకకల స్తథా
పునశ్చైక కలా శమ్యా సన్నిపాతః కలాద్వయమ్. 142
అనేనహి ప్రమాణేన కలా తాల లయాన్వితః
కర్తవ్యః పూర్వరంగస్తు త్ర్యశ్రో2 వృత్తాపనాదికః. 143

పాదమునకు పన్నెండక్షరములుండ, అందు ఒకటి, నాలుగు, ఎనిమిది, పది, పన్నెండవ అక్షరములు గురువులై మిగిలినవి లఘువులైన దానిని త్ర్యశ్రపూర్వరంగమందలి ఉత్థాపనీ ధ్రువ యందురు.

వాద్యం గతి ప్రచారశ్చ ధ్రువా తాలస్తథైవచ
సంక్షిప్తా న్యత్ర కార్యాణి త్ర్యశ్రనృత్త ప్రవేదిభిః. 145

వాద్య గీత ప్రమాణేన కుర్యా దంగవిచేష్టితమ్
విస్తీర్ణమథ సంక్షిప్తం ద్విప్రమాణ వినిర్మితమ్. 146

హస్త పాద ప్రచారస్తు ద్వికలః పరికీర్తితః
చతురశ్రే పరావర్తే పాతాః స్యుః షోడశైవతు. 147

త్ర్యశ్రే ద్వాదశ పాతాస్తు భవంతి కరపాదయోః
ఏతత్ప్రమాణం విజ్ఞేయ ముభయోః పూర్వరంగయోః. 148

వాద్యము, గతిప్రచారము, ధ్రువా, తాళము అనువానిని త్ర్యశ్ర పూర్వరంగమున సంక్షిప్తముగా ప్రయోగించవలెను. వాద్యగీతములు తీసికొని కాలపరిమితి ననుసరించి అంగ విన్యాసము నొనర్పవలెను. ద్వికళాపరిమాణముతో వీటి అన్నిటివి స్తీర్ణము సంక్షేపించబడును. హస్తపాదప్రచారము రెండు కళలలో పూర్తి కావలెను. పరావర్తనక్రియలో చతురశ్రమందు కరపాదముల పతనములు పదునారుండగా, త్ర్యశ్రమందు పన్నెండుమాత్రమే గలవు. ఈ ప్రమాణమున నీ రెంటికిగల భేదమును మరచిపోరాదు.

కేవలం పరివర్తేతు గమనే త్రిపదీ భవేత్
దిగ్వందనే పంచపదీ చతురశ్రే విధీయతే. 149

ఆచార్య బుద్ధ్యా కర్తవ్య త్ర్యశ్రే స్తజ్ఞైః ప్రమాణతః
తస్మాన్నలక్షణం ప్రోక్తం పునరుక్తం భవేద్యతః. 150

దిగ్వందనమును చేయువేళ చతురశ్ర పూర్వరంగమున ఐదడుగులను వేయవలెను: కాని త్ర్యశ్రమున మూడడుగులే విధించబడినవి. గురుముఖమున చతురశ్రమునకు త్ర్యశ్రమునకు గల భేదమును తెలిసికొని పైన చెప్పబడిన విధుల నన్నిటిని సక్రమముగా ప్రయోగించవలెను. ఈ రెంటియందును క్రమము, విధులు ఒకేరీతిగా నుండుటచే, పునరుక్తిని నివారించుటకై మరల లక్షణము నిచట చెప్పుటలేదని గ్రహించవలెను.

ఈ నాల్గింటిలోను విశిష్టమైనది చిత్రపూర్వరంగము. ఈ చిత్రపూర్వరంగమున నాల్గవ అధ్యాయమున చెప్పబడిన కరణాంగహారములు వినియోగింపబడుచున్నవి. అంగహారములతో సమన్వితమై శుష్కావకృష్ట మొదలుగాగల ప్రరోచనాంతప్రక్రియ ప్రయోగింపబడవలసి యున్నది. అందువలననే సీ చిత్రపూర్వరంగము నాట్యమునకు శ్రేష్ఠమైనదగుచున్నది.

వృత్తే హ్యుత్థాపనే విప్రాః కృతేచ పరివర్తనే
చతుర్థకారదత్తాభిః సుమనోభి రలంకృతే. 153
ఉదాత్తగానై ర్గంధర్వైః పరిగీతే ప్రమాణతః
దేవదుందుభయశ్చైవ నినదేయు ర్భృశం తతః. 154

ఉత్థాపనీ ధ్రువతో ప్రయోగమైన తర్వాత, పరివర్తన జరుగగా, నాల్గవనటుడు వచ్చి చక్కని పూవులతో రంగము నలంకరింపజేయును. అప్పుడు గాయకులు ఉదాత్తగానములను తాళలయాన్వితములుగా నాలాపించ, మాటి మాటికి దేవదుందుభులు మ్రోగగలవు.

శుద్ధాః కుసుమమాలాభి ర్వికిరేయుః సమంతతః
అంగహారైశ్చ దేవ్యస్తా ఉపనృత్యేయు రగ్రతః. 155
య స్తాండవ విధిః ప్రోక్తో నృత్తే పిండీ సమంతతః
రేచకై రంగహారైశ్చ న్యాసోపన్యాస సంయుతః. 156
నాందీపదానాం మధ్యేతు ఏకైకస్మిన్ పృథక్పృథక్
ప్రయోక్తవ్యో విధిః సమ్య క్చిత్ర భావ మభీప్సుభిః. 157

తెల్లనివస్త్రములను ధరించిన దివ్యస్త్రీలు పూలమాలలను వెదజల్లుచు, అంగహారములను ప్రయోగించుచు రంగస్థలమున అగ్రభాగమున నృత్యముచేయుదురు. రేచకాంగహారములతో, న్యాసోపన్యాసములతో కలసియున్న యే అకృతివిశేషములు తాండవవిధిలో చెప్పబడినవో వాటినన్నిటిని నాందీపదములమధ్య ఒకదానితర్వాత నొకదానిని చక్కగా ప్రయోగించవలెను. అప్పుడు చిత్రపూర్వరంగము సిద్ధించగలదు.

దివ్యస్త్రీలందరు తర్వాత నంతర్తితులు కావలెను. రంగమునుండి నర్తకురాండ్రు నిష్క్రమించిన తర్వాత పూర్వరంగమున అంగముల నన్నిటిని ప్రయోగించగా చిత్రపూర్వరంగము పూర్తి కాగలదు.

కార్యో నాతిప్రసంగో౽త్ర నృత్తగీత విధింప్రతి
గీతవాద్యేచ నృత్తేచ ప్రవృత్తే౽తి ప్రసంగతః. 161

ఖేదో భవేత్ ప్రయోక్తౄణాం ప్రేక్షకాణాం తథైవచ
ఖిన్నానాం రసభావేషు స్పష్టతా నోపజాయతే. 162

తతః శేషప్రయోగస్తు న రాగజనకో భవేత్
లక్షణేన వినా బాహ్యాలక్షణా ద్రస్ఖితం భవేత్. 163

లతో నున్నది, చిత్రవృత్తులతో నలంకరించబడినదియు నగు గీతమును సూత్రధారుడు తెర వెనుకనిల్చి వాద్యములు తోడురాగా పాడవలెను.

ఆశ్రావణావసానేచ నాందీం కృత్వా స సూత్రధృత్. 167
పునః ప్రవిశ్య రంగంతు కుర్యాత్ ప్రస్తావనాం తతః

ఈ ఆశ్రావణావిధిలో చెప్పబడిన గీతమైన తర్వాత సూత్రధారుడు నాందీశ్లోకమును పఠించి, మరల రంగస్థలమును ప్రవేశించి ప్రస్తావనను ప్రయోగించవలెను.

ప్రయుజ్య విధినైవంతు పూర్వరంగం ప్రయోగతః. 168
స్థాపకః ప్రవిశేత్తత్ర సూత్రధార గుణాకృతిః
స్థానంతు వైష్ణవం కృత్వా సౌష్ఠవాంగ పురస్కృతమ్. 169
ప్రవిశ్య రంగం తైరేవ సూత్రధారపదై ర్వ్రజేత్

నాట్యప్రయోగవశమున విధిపూర్వకముగా పూర్వరంగమైన తర్వాత స్థాపకుడు ప్రవేశించవలెను. సకలరూపకవృత్తిని స్థాపింపజేయువాడు స్థాపకుడు. సౌమనస్యము, విస్మయము, అద్భుతదృష్టి, ఆకృతివిశేషము అను సూత్రధారుని గుణములుమాత్రమే స్థాపకునకుండును. ఈ స్థాపకుడే సూత్రధారుడు. వెనుక చెప్పబడిన వైష్ణవస్థానకమును చక్కని అవయవ సన్నివేశముతో ప్రయోగించుచు రంగమును ప్రవేశించి, సూత్రధారగమనమునకు చెప్పిన పదలక్షణములతో నేగవలెను.

స్థాపకస్య ప్రవేశేతు కర్తవ్యా ర్థానుగా ధ్రువా. 170
త్ర్యశ్రా వా చతురశ్రా వా తజ్ఞై ర్మధ్యలయాన్వితా
కుర్యా దనంతరం చారీం దేవ బ్రాహ్మణ శంసినీమ్. 171
సువాక్యమధురైః శ్లోకై ర్నానా తాల లయాన్వితైః
ప్రసాద్య రంగం విధివ త్కవేర్నామచ కీర్తయేత్. 172

స్థాపకుడు ప్రవేశించి త్ర్యశ్రపూర్వరంగమునకుగాని చతురశ్ర పూర్వరంగమునకుగాని సంబంధించియుండి అర్థవంతమైన ఉత్థాపనాది ధ్రువాగానమును మధ్యలయలో నొనర్చవలెను. దేవబ్రాహ్మణులను ప్రశంసించు చారీని తర్వాత ప్రయోగించవలెను. చక్కని వాక్యములతో మధురములైన శ్లోకములను వివిధ తాళములతోను లయలతోను విధియుతముగా రంగమ నలంకరించి, సభాసదుల అనుగ్రహ ఆదరములు కలుగునట్లు చేసికొని, కవియొక్క నా సంకీర్తనము చేయవలెను.

ఘోరమైన కీడు, పశుజన్మ రాగలవు. వాయువుచే ప్రేరితమైన అగ్నిసహితము అపగ్ర
గము దహించునట్లు ఒక్క త్రుటిలో దహించ లేదు.

ఇత్యేషోఽవంతి పాంచాలా దాక్షిణా త్యాంధ్ర మాగధైః
కర్తవ్యః పూర్వరంగస్తు ద్విప్రమాణ వినిర్మితః. 1౬౮

అవంతి, పాంచాల, దాక్షిణాత్య, ఆంధ్రమాగధీ ప్రవృత్తులతో నీ విధముగా ఆ దేశములలోని రూపకనాయకుల ప్రవృత్తులకు తగిన వేషభాషాచారాభినయములతో సూత్రధారాదులచే పూర్వరంగము ప్రయోగింపబడవలెను. ఈ పూర్వరంగము త్ర్యశ్రముగా చతురశ్రముగాను నిర్మింపబడినదని తెలియవలెను.

ఏష వః కథితో విప్రాః పూర్వరంగా శ్రితోవిధిః
భూయః కిం కథ్యతాం సమ్య గ్నాట్యవేద విధింప్రతి. 1౬౯

ఇతి శ్రీ భారతీయే నాట్యశాస్త్రే పూర్వరంగవిధానంనామ పంచమోఽధ్యాయః.

పూర్వరంగము నాశ్రయించుకొనిన విధి యంతయు నీ రీతిగా చెప్పబడినది. నాట్యము నందలి విధులనుగురించి ఇక తెలిసికొనవలసినదేమి గలదని భరతుడు మునుల నడుగుచున్నాడు.

శ్రీ భరతమునిప్రణీతమగు నాట్యశాస్త్రమున ఆంధ్రభారతియందు
పూర్వరంగవిధానమను ఐదవఅధ్యాయము.